

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM



పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్

ESTABLISHED 1984 | సంపుటి 35 | 28.9.2018 | సంచిక 13

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

Take care of today it will take care of tomarrow

## సీరియల్స్



## కథలు





ముఖచిత్రం : హెబ్బాపటేల్

Courtesy : YOU & I

## స్పెషల్ ఫీచర్స్



## శీర్షికలు



## అమలిన భక్తి

మలిదాసు అనే పిల్లవాడు గోవులను మేపుతూ వుండేవాడు. ఒక బ్రాహ్మణుడు నది ఒడ్డున కూర్చుని, ప్రాణాయామం చేసుకోవడం మలిదాసు చూశాడు. "అయ్యా!ఇప్పటిదాకా మీరు చేసిందేమిటి?"అని అడిగాడు. "నేను ముక్కు మూసుకుని దేవుడిని ప్రార్థించాను" అని చెప్పాడు బ్రాహ్మణుడు.

"నాకూ నేర్పండి" అని అడిగాడు."ముక్కు మూసుకుని నది ఒడ్డున కూర్చో" అని చెప్పి వెళ్ళిపోయాడు. వెంటనే మలిదాసు నదిలో కాళ్ళు కడుక్కుని ఒడ్డున కూర్చున్నాడు. ముక్కు మూసుకున్నాడు.

కొద్దిసేపు చూశాడు దేవుడురాలేదు.గట్టిగా మూసుకోవాలి కాబోలనుకుని గట్టిగా మూసుకున్నాడు. ఊపిరి ఆడక ఉక్కిరిబిక్కిరవుతున్నాడు.

దేవుడికి జాలివేసింది. విష్ణుమూర్తి వచ్చి ఎదురుగా నుంచున్నాడు. 'నువ్వు ఎవరు?' అని అడిగాడు మలిదాసు. "నేను దేవుణ్ణి" అన్నాడు విష్ణువు.

"ఉండు. మా గురువుగారిని పిలుచుకువస్తా" అని, మళ్ళీ తనే "నీవు వెళ్ళిపోతావేమో?" అంటూ, ఆవు మెడలోని తాడు తెచ్చి చెట్టుకు కట్టి వెళ్ళాడు. బ్రాహ్మణుణ్ణి వెంటపెట్టుకు వచ్చాడు. "గురువుగారూ! దేవుణ్ణి ఈ చెట్టుకు కట్టి వేశాను చూడండి" అన్నాడు. బ్రాహ్మణుడికి దేవుడు కనిపించడంలేదు.

"మా గురువుగారు చెప్పినందుకే నిన్ను పిలిచాను. నాకు కనిపించి, ఆయనకు ఎందుకు కనబడవు?" అని ప్రశ్నించాడు. "కాని అతని గర్వం వుంది. అది పోతేగాని కనపడను" అన్నాడు దేవుడు.

ఆ మాటలు విన్నాడు బ్రాహ్మణుడు. బాలుని పాదాలపై పడి ఏడ్చాడు. "పాపం మా గురువుగారికి కూడా కనపడు. లేకపోతే కట్టిన తాడు విప్పను"అన్నాడు మలిదాసు. దేవుడు నవ్వుతూ బ్రాహ్మణుడికి కూడా దర్శనం ఇచ్చి వెళ్ళిపోయాడు. మలిదాసు భక్తి మలినం లేనిది.

-పండిత శ్రీరామశర్మ

చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సర చందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



# ఏకపీఠంపై శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వరస్వామి ఘంటసాల

521 133 కృష్ణాజిల్లా A.P.

జలం జీవులకు ప్రాణాధారం. దేహాన్ని పరిశుద్ధం చేసేదీ, ఆరోగ్యాన్నిచ్చేదీ, ఆయుష్షును పెంచేదీ జలమే. జలంనుంచి జనించి జలధీశ్వరునిగా భక్తులచే పూజలందుకుంటున్న కృష్ణా జిల్లా ఘంటసాలలోని శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వర స్వామిని దర్శించండి. ఆరోగ్యవంతులుకండి.

జయ జయశ్రీ జలధీశ్వరస్వామివారికి జలమంటే ఇష్టం. కాసిన్ని నీళ్ళతో ఆయన్ని అభిషేకిస్తే చాలు, తృప్తిపడి కరుణతో మన శరీరంలో వున్న వ్యాధులన్నింటినీ ఆయన కడిగేస్తాడు. భక్తులు అభిషేకించిన నీరే తీర్థమై, ఆ తీర్థమే మహౌషధమై, సర్వరోగాలను హరించివేస్తుంది.ఆరోగ్యవంతుల్ని చేస్తుంది.

ఈ స్వామి ఆరోగ్యప్రదాత. శ్రీ జలధీశ్వరస్వామికి మూడు ప్రదక్షిణలు చేసి అభిషేక తీర్థాన్ని సేవిస్తే, సంపూర్ణ ఆరోగ్యం లభిస్తుంది. ఎందరో భక్తులకు అనుభవైకవేద్యమది. ఏక పీఠంపై వెలసిన శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వర స్వామి విశిష్టత ఇది.

సతీసమేతంగా కొలువైన నవగ్రహ మండపం ఇక్కడి ప్రత్యేకత. ఒకే ఆవరణలో తన కుమారులైన విఘ్నేశ్వర సుబ్రహ్మణ్యేశ్వరులతో శ్రీ బాలపార్వతీ సమేత శ్రీ జలధీశ్వరస్వామి దర్శనభాగ్యం, భక్తుల పాలిటి మహద్భాగ్యం.

ఇక్కడి సుబ్రహ్మణ్యస్వామికి సుబ్రహ్మణ్యషష్ఠినాడు విశేషమైన పూజలు జరుగుతాయి. గ్రహానుగ్రహంకోసం, గ్రహ దోషాలను పోగొట్టుకోదలచినవారు ఈ సతీసమేత నవగ్రహాలను వ్యక్తిగతంగా ఆరాధిస్తే, అత్యంత త్వరగా తమ సమస్యలన్నింటినుండి బయటపడతారు.

బస్సు మార్గం : విజయవాడ నుంచి ఘంటసాలకు (ఉయ్యూరు, కూచిపూడిల మీదుగా) దూరం 40 మైళ్ళు.
మోపిదేవి నుంచి ఘంటసాలకు - 8 మైళ్ళు, కూచిపూడి నుంచి ఘంటసాలకు - 8 మైళ్ళు.

సమగ్ర సమాచారంకోసం సెల్: 99494 92410 E-mail: jaladheeswara@gmail.com

## ఆరోగ్యప్రదాతా! జలధీశ్వరా! పాహిమాం రక్షమాం!



## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక




**14.9.2018**

'మనసు మారాలి' వ్యాసం చాలా బాగుంది. పెద్దలు వారి ప్రవర్తన ఎడల జాగరూకత వహించాలి. అప్పుడే కుటుంబవ్యవస్థ పద్ధతిగా నడుస్తుంది.

'చివరిరోజుల్లో...' శీర్షికలో హాస్య నటుడు నగేష్‌చరిత్ర తెలుసుకున్నాం.

లక్ష్మీ గిరిజాకుమార్ రాజమహేంద్రవరం

'డబ్బులెవరికీ ఊరికే రావు', 'పర దేశీ ప్రేమకథ', 'నానితో నిత్య', 'ఉచ్చు' సీరియల్స్ అన్నీ వారం వారం ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

'మరుపు రాని రేయి', 'చల్ చల్ గుర్రం', 'చిరంజీవి', 'మా ఊరికి రా గోవింద' కథలు బాగున్నాయి.

'లంచ్ బాక్స్', 'No చెప్పండి అదే బెటర్', 'మనసు మారాలి' వ్యాసాలు ఆసక్తిగా చదివింపజేశాయి.

పి.బాలకృష్ణారావు విజయనగరం

నీది అనుకున్నది నీది కాదు అది భగవంతుడిది అన్న స్వామి రామ తీర్థ బోధ అక్షరాలా నిజం.

'No చెప్పండి అదే బెటర్' కథనం ఒక చక్కటి ప్రవర్తనా నియమావళి.

'అనిల్' శీర్షికలో తెలిపిన పిల్లల పెంపకం విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలు ఆచరణీయం.

పి.నరసయ్య హైదరాబాద్

'అభివృద్ధి పొందాలంటే స్వార్థాన్ని వదిలేసి నిత్యత్యాగి అవ్వాలి' అంటూ సంపాదకీయంలో స్వామి రామతీర్థ చెప్పిన హితోక్తి సమంజసంగా ఉంది.

'No చెప్పండి అదే బెటర్' వ్యాసం బాగుంది. ఎలా చెప్పాలో బాగా వివరించి మంచి గైడెన్స్ ఇచ్చారు.

'నానితో నిత్య' సీరియల్ విజ్ఞానదాయకంగా సాగుతోంది.

సత్య కడప

గర్వాన్ని వదిలిపెట్టి వాంఛలను విడిచిపెట్టినప్పుడే వాంఛలు సిద్ధిస్తాయన్న స్వామి రామతీర్థ ఉవాచ అందరికీ అనుసరణీయంగా ఉంది.

'ఒక చిన్నమాట' శీర్షిక బాగుంది. 'మనోబలం' ఎంతటి ఆవశ్యకమో చదివి తెలుసుకున్నాం.

'సత్యాన్వేషణ' శీర్షికలో చెప్పిన ఉద్బోధ ఆచరణీయంగా ఉంది.

ఎస్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

వచ్చేవారం స్పెషల్

**భిన్నాభిప్రాయాలు సహజం**

'రెండు రాష్ట్రాల తొలిఎన్నికలు' వ్యాసంలోని ప్రతి అక్షరం వాస్తవం.

'లంచ్ బాక్స్' వ్యాసం గురించి ఇచ్చిన వివరణలు చాలా ఆచరణీయం. 'మనసు మారాలి' వ్యాసం బాగుంది.

'మరుపు రాని రేయి', 'చల్ చల్ గుర్రం', 'చిరంజీవి', 'మా ఊరికి రా గోవింద' కథలన్నీ చాలా అద్భుతంగా ఉన్నాయి. చదివింపజేశాయి.

'డబ్బులెవరికీ ఊరికే రావు', 'పర దేశీ ప్రేమకథ', 'నానితో నిత్య', 'ఉచ్చు' సీరియల్స్ బాగున్నాయి.

ఎ.వి.సోమయాజులు కాకినాడ

# ఇది మంచి సమయం



**20.9.2018 నుండి 26.9.2018 వరకు శ్రీ విలంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, శరదృతువు, భాద్రపదమాసం, శుక్లపక్షం.**

**20.9.2018 గురువారం**
తిథి: ఏకాదశి రా. 1.16 వరకు
నక్షత్రం: ఉత్తరాషాఢ మ.1.44 వరకు
వర్జ్యం: సా. 6.15-8.03 వరకు
దుర్ముహూర్తం: ప. 9.58-10.47 వరకు. మ. 2.54-3.43 వరకు
రాహుకాలం: మ. 1.33-3.05 వరకు
మంచి సమయం: ఉ. 7.50 నుండి 9.00 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 6.00కి

**21.9.2018 శుక్రవారం**
తిథి: ద్వాదశి రా. 3.41 వరకు
నక్షత్రం: శ్రవణం సా. 4.46 వరకు
వర్జ్యం: రా. 9.13-11.00 వరకు
దుర్ముహూర్తం: ప.8.19 నుండి 9.08 వరకు. మ. 12.25-1.14 వరకు
రాహుకాలం: మ. 10.29 నుండి 12.01 వరకు
మంచి సమయం: ప. 9.55 నుండి 12.00 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.59కి

**22.9.2018 శనివారం**
తిథి: త్రయోదశి తె. 5.44 వరకు
నక్షత్రం: ధనిష్ఠ సా. 7.30 వరకు
వర్జ్యం: రా. 3.23-5.08 వరకు
దుర్ముహూర్తం: ఉ.5.50-7.29 వరకు
రాహుకాలం: ప. 8.58-10.30 వరకు
మంచి సమయం: ప. 8.00 నుండి 9.50 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.58కి

**23.9.2018 ఆదివారం**
తిథి: చతుర్దశి పూర్తి
నక్షత్రం: శతభిషం రా. 9.49 వరకు
వర్జ్యం: తె.గం. 4.43 లగా...
దుర్ముహూర్తం: సా.4.36-5.26 వరకు
రాహుకాలం: సా. 4.41-6.13 వరకు
మంచి సమయం: ప. 9.50 నుండి 11.50 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.57కి

**24.9.2018 సోమవారం**
తిథి: చతుర్దశి ఉ. 7.18 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర రా.11.40 వరకు
వర్జ్యం: ఉ. 6.27 వరకు
దుర్ముహూర్తం : మ. 12.27 నుండి 1.17 వరకు. మ. 2.55-3.45 వరకు
రాహుకాలం: ఉ. 7.25-8.58 వరకు
మంచి సమయం: ప. 9.40 నుండి 11.20 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.56కి

**25.9.2018 మంగళవారం**
తిథి: పూర్ణిమ ప. 8.22 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర రా. 1.01 వరకు
వర్జ్యం: ప. 9.49 నుండి 11.30 వరకు
దుర్ముహూర్తం: ప. 8.19-9.08 వరకు రా. 10.52-11.41 వరకు
రాహుకాలం: మ. 3.06-4.38 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.55కి

**26.9.2018 బుధవారం**
తిథి: బహుళ పాడ్యమి ప. 8.57 వరకు
నక్షత్రం: రేవతి రా. 1.55 వరకు
వర్జ్యం: మ. 1.28-3.08 వరకు
దుర్ముహూర్తం: ప. 11.37 నుండి 12.26 వరకు
రాహుకాలం: మ. 12.02-1.34 వరకు
మంచి సమయం: ఉ. 7.30 నుండి 8.50 వరకు
సూర్యోదయం: 5.53కి
సూర్యాస్తమయం: 5.54కి

* ఏ సమస్యనైనా మీరు పరిష్కరిస్తారు.




పులిలా మాటువేసి, పిల్లిలా అడుగులేస్తూ, పాములా పడగ విసిరి, టార్గెట్‌ను గద్దలా తన్నుకుపోయే చాకచక్యం కలిగిన పత్తేదార్ల గూఢచర్యం జాతీయంగా, అంతర్జాతీయంగా ప్రసిద్ధం. వారి నేర పరిశోధన రోమాంచితం. వారి సాహసం అనితరసాధ్యం. నేటి ప్రపంచం నేరచరితం. మోసపూరితం. మాఫియామయం. ఆ దుర్మార్గాన్ని వెలికితీసే ప్రయత్నంలో జరిగే ఇన్వెస్టిగేషన్ వెరీ ఇంట్రెస్టింగ్.

## అపరాధ పరిశోధన సీరియల్స్ పోటీ

# ఇది అక్షర లక్షల పోటీ

## 16 వారాల అపరాధ పరిశోధన సీరియల్స్

### ఎన్నికైన ప్రతి అపరాధ పరిశోధన సీరియల్‌కు ₹1,00,000

ఈ డిటెక్టివ్ సాహిత్యంమీద వేలాదిమంది రచనలుచేసి, లక్షలాది పుస్తకాలను రాసి, కోట్లాది రూపాయల అమ్మకాలతో ప్రపంచమంతా విస్తరింపజేసి గొప్ప బుక్ మార్కెట్‌ను సృష్టించగలిగారన్నది అన్ని భాషా సాహిత్యాలలో జగద్విదితం. అంతటి రీడబిలిటీ కలిగిన అపరాధ పరిశోధన సీరియల్స్ పోటీలో పాల్గొని విజేతలైతే అగ్రశ్రేణికి చెందిన రచయిత(త్రు)లు కావడం ఖాయం. వెంటనే రాసి ఈ పోటీకి మీ సీరియల్‌ని పంపండి.

మీ స్క్రిప్ట్‌లో పేజీకి సుమారుగా 200 పదాలు ఉండేటట్లు 160 పేజీలు రాయాలి. ఒక పేజీలో మీరు రాసే పదాల సంఖ్యనుబట్టి మీ స్క్రిప్ట్‌లో పేజీలు ఎక్కువ తక్కువలు రావచ్చు. అందుకు అభ్యంతరం లేదు.

ఎంపికైన ప్రతి సీరియల్‌కూ అక్షరాలా

# ఒక లక్ష రూపాయలు

బహుమతిని అందిస్తాం.

**నిబంధనలు**

1. మీ రచన 16 వారాలకు సరిపడా 160 పేజీలు వుండాలి.
2. రచయిత(త్రి) పేరు, చిరునామా విడిగా రాతప్రతితో జతపరచాలి. రచన పేరుమాత్రమే నవలపైన ఉండాలి.
3. అముద్రితమనీ, దేనికీ అనువాదంగానీ, అనుకరణగానీ కాదని స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్ని విధిగా జతచేయాలి.
4. స్క్రిప్ట్‌లో మార్పులు, చేర్పులు, ఎడిట్ చేసుకునే విషయంలో ఎడిటర్‌కు హక్కు ఉంది.
5. సీరియల్స్ ఎంపికలో స్వాతి సంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావు లేదు.
6. ఈ పదహారు వారాల సీరియల్స్ పోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ, పోటీని రద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
7. ప్రచురణకు స్వీకరింపని సీరియల్‌ని తిప్పి పంపగోరువారు తగినన్ని స్టాంపులు అతికించిన కవరు జతపరచాలి.
8. మీ సీరియల్ పంపే కవరుమీద '16 వారాల సీరియల్స్ పోటీ'కి అని రాయాలి.

సీరియల్స్ పంపవలసిన చిరునామా: ఎడిటర్ స్వాతి సపరివార పత్రిక అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్‌బాక్స్ 339 విజయవాడ 520 002

**సీరియల్స్ మాకు చేరవలసిన ఆఖరు తేదీ : 15.11.2018**

# బ్యాంక్‌లపై నిరర్థక భారం

భారతీయ ఆర్థికవ్యవస్థ మహాద్భుతం. ప్రపంచంలో ఇప్పుడది ఐదవ అతిపెద్ద ఆర్థికవ్యవస్థ.అతిత్వరలో భారత్ మూడవస్థానంలోకి వెళుతుంది. అంతేకాదు అత్యంత వేగంగా ఎదుగుతున్న ఆర్థికవ్యవస్థలో ప్రస్తుతం రెండవస్థానం నుండి చైనాను దాటి మొదటిస్థానానికి వెళ్ళబోతున్నది.

ఇది అంతర్జాతీయసంస్థలనుండి వస్తున్న బ్రహ్మాండమైన నివేదికలు. అదంతా చదివి మనం ఒక గొప్ప ఆర్థిక ప్రగతిబాటలో ముందుకు వెళుతున్నామని అనుకోవచ్చు. కాని వాస్తవం అందుకు భిన్నంగా వుంది.

శారీరకంగా ఎముకల, కండపుష్టిలేకుండా ఏపుగా పెరుగుతున్న యువకులను ఎప్పుడైనా చూశారా! వారి ఎత్తుకు తగిన బలం లేకపోయేసరికి వారి శరీరం ఒంగిపోయి వింతగా కనిపిస్తారు.

సరిగా భారతదేశపు ఆర్థికపుష్టి పరిస్థితి అటువంటిదేనంటున్నాయి అంతర్గత నివేదికలు.

దేశఆర్థికవ్యవస్థలో కీలకపాత్ర వహించే బ్యాంకులు తమకుతాముగా క్షీణించి దివాలాకు దగ్గరలో వున్నాయన్న వార్తలు ఆందోళన కలిగిస్తోంది.

బ్యాంక్‌ల మీదున్న విశ్వసనీయత తగ్గిపోయింది ప్రజలలో. బ్యాంకులు నిర్వహించేవారు బాధ్యతాయుతంగా వ్యవహరించటంలేదు.

బ్యాంకు సిబ్బందిలోనూ నిజాయితీ కొరవడింది. తమ డిపాజిట్లకు భద్రత లేదా! అనే ఆందోళన ప్రజలలోకి వచ్చింది. ఎప్పుడు ఏ బ్యాంక్ పతనమవుతుందో, ఎప్పుడు ఏ బ్యాంక్ గురించి ఎటువంటి వార్త వినాల్సి వస్తుందోనన్న భయంలో ప్రజలు ఉన్నారు.

బ్యాంకుల నిరర్థక ఆస్తుల అంశం మీద వాస్తవాలు రావటం లేదు.అధికార,ప్రతిపక్షాలు రెండూ బ్యాంక్‌ల ప్రస్తుత పరిస్థితిని తమ రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకుంటున్నాయి.బ్యాంకుల అధ్వాన్న స్థితికి మూలం మీరంటే మీరని యు.పి.ఎ., ఎన్.డి.ఎ.లు రాజకీయయుద్ధం చేసుకుంటున్నాయి.

మేము అధికారం నుండి తప్పుకునే సరికి బ్యాంక్‌ల నిరర్థక ఆస్తులు అరులక్షల కోట్ల రూపాయలు మాత్రమేనని, అది అదుపుచేయగలిగిన స్థాయిలోనే వున్నాయని యు.పి.ఎ. నేతలు అంటున్నారు.

నాడు మీరు సృష్టించిన ఆ నిరర్థకతే నేడు వడ్డీతో సహా పెరిగి మరింత భారమై పదిలక్షల కోట్ల రూపాయలకు చేరిందని ఎన్.డి.ఎ. అంటున్నది.

2014లో తాము అధికారం చేపట్టేసరికి వున్న ఆర్థికపరిస్థితి, బ్యాంక్‌ల ఆరోగ్యం చూసి ఆందోళనకు గురైనా దానిని వెంటనే బహిర్గతం చేసి ప్రజలలో భయాందోళనలు సృష్టించటం ఇష్టంలేక మౌనంగా వుండి, బ్యాంక్‌ల్లోని లోపాలన్నింటినీ చక్కదిద్దటం మొదలుపెట్టి,

అవన్నీ ఒక గాడినపడేలా చేసిన తర్వాతేఇప్పుడు ధైర్యంగా బ్యాంక్‌ల్లోని నిరర్థక ఆస్తుల అంశంపై పార్లమెంటరీ సభాసంఘాన్ని నిగ్గు తేల్చమన్నామని అంటున్నది నేటి ఎన్.డి.ఎ. ప్రభుత్వం.

బి.జె.పి. నేత మురళీమనోహర్ జోషి ఆధ్వర్యంలోని పార్లమెంటరీకమిటీ తన బాధ్యతలను చేపట్టేలోపే బ్యాంకులకు భారీదెబ్బలు తగిలాయి.

పంజాబ్ నేషనల్ బ్యాంక్ (పి.ఎన్.బి.)కి వేల కోట్లు ఎగ్గొట్టిన వజ్రాల వ్యాపారి నీరవ్ మోడీ దేశం వదిలి హాయిగా పారిపోయి మన దేశ బ్యాంక్‌ల సమర్థతను, నిఘావ్యవస్థ చురుకుదనాన్ని అపహాస్యం చేశాడు.

పైగా "తాను చట్టబద్ధంగానే దేశం వదిలివెళ్ళాను. వెళ్ళేముందు నిబంధనల ప్రకారం భారతీయ పౌరసత్వం వదులుకున్నాను.

మరో దేశ పౌరసత్వం తీసుకునేందుకు అనుమతి పొందాను. నాకు అంతా క్లియరెన్స్ ప్రభుత్వమే ఇచ్చి పాగనంపింది" అని వజ్రాలవ్యాపారి నీరవ్‌మోడీ ప్రకటించటాన్నిబట్టి మనదేశంలో నిఘావ్యవస్థ ఏ స్థాయిలో పనిచేస్తున్నదో అర్థంచేసుకోవచ్చు. ప్రతి చిన్న అనుమతికీ సాధారణ పౌరుడిమీద పలురకాల చెకింగ్‌లు చేసే వ్యవస్థ నీరవ్‌మోడీ విషయంలో ఏం చేసింది! అనే ప్రశ్న సహజంగానే కలుగుతుంది.

పార్లమెంట్ సభ్యుడు విజయ్‌మాల్యా వేలకోట్లు బ్యాంక్‌లకు ఎగ్గొట్టి, తన పార్లమెంట్ సభ్యత్వహోదాని అడ్డంపెట్టుకుని హాయిగా దేశం విడిచిపారిపోయాడు. లండన్‌లో తన విలాసజీవితానికి ఏమాత్రం భంగం కలగనిరీతిలో గడుపుతున్నాడు.

బ్రిటీష్ కోర్టులను అడ్డంపెట్టుకుని భారతదేశాన్ని ఎంతగా అపహాస్యం చెయ్యగలడో అంతగా అపహాస్యం చేస్తున్నాడు. పైగా తాజాగా "నేను దేశం వదిలివెళ్ళేముందు ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీని కలిసి వెళ్ళా" అంటూ నమ్మలేని ప్రకటన చేశాడు విజయ్ మాల్యా. విజయమాల్యా, నీరవ్ మోడీ వంటివారందరూ దేశీయ బ్యాంకులను మోసంచేసి, ప్రజా సంపదను దోచుకుని విదేశాలకు వెళ్ళారు.

మరో దేశంలో అయితే అటువంటి మోసగాళ్ళను స్వదేశానికి రప్పించి శిక్షించాలనే అంశంమీద అధికార, ప్రతిపక్ష పార్టీలు ఏకమై ఒక జాతీయవిధాన రూపకల్పనకు కృషిచేసేవి. కాని మనదేశ ప్రజాస్వామ్య దురదృష్టం ఏమోకాని అటువంటి కీలక నేరస్తుల అంశాన్ని రాజకీయంగానే వాడుకుంటున్నారు.

ఇటువంటి అధికార, ప్రతిపక్ష పార్టీలు దేశంలో వున్నప్పుడు ఏదో ఒక పక్షం తమ పక్షాన నిలుస్తుందన్నదే బడా ఆర్థిక నేరస్తుల విశ్వాసం.

"నేరస్థులు మీ హయాంలో దేశం వదిలి పారిపోయారు" అని కాంగ్రెస్ పార్టీ ఆరోపిస్తుంటే "అసలు నేరాలు జరిగిందే మీ హయాంలో" అంటూ బిజెపి సమాధానమిస్తున్నది. ఇరుపార్టీలదీ బాధ్యత అంటూ ఇటీవల రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్ రఘురామ్ రాజన్ సమర్పించిన నివేదిక ఉభయపార్టీలకు చెంపపెట్టువంటిదే.

రఘురామ్ రాజన్ పార్లమెంటరీ కమిటీకి ఇచ్చిన సమాచారం ప్రకారం బ్యాంకులలోని అతి ఉత్సాహం, అడ్డగోలుగా అప్పులిచ్చిన వైనం బయటపడింది. 1991 సంవత్సరంలో ఆర్థిక సంస్కరణలను పి.వి. ప్రభుత్వం ప్రారంభించగా ఆ తర్వాత వచ్చిన వాజ్‌పేయి ప్రభుత్వం కొనసాగించింది.

జాతీయ ప్రయోజన అంశాలలో పి.వి., వాజ్‌పేయిలు ఏకాభిప్రాయం కలిగివుండి, పార్టీ సిద్ధాంతాలకు



వ్యాపారంలో నుండి రిటైర్ అయిన తర్వాత నా సంపద, సమయం విద్యకోసమే అంకితం చేస్తాను. -జాక్ మా, ఆలీబాబా వ్యవస్థాపకుడు

అతీతంగా ఒకరికొకరు సహకరించుకున్నారన్నది స్పష్టం. అందుకే 1991లో ప్రారంభమైన ఆర్థిక ప్రగతి వేగం 2004లో వాజ్‌పేయి దిగేవరకు కొనసాగింది.

ఆర్థికసంస్కరణల అమలులో భాగస్వామి, ఒక రకంగా వ్యూహకర్త ఐన మన్మోహన్‌సింగ్ యు.పి.ఎ. తరఫున ప్రధాని కావటంతో ఆర్థికవవ్యవస్థ అదే వేగంతో ముందుకు వెళుతుందని భావించారు.

అయితే మన్మోహన్‌సింగ్ రాజకీయబలం కరువైన ప్రధాని. ఏ నిర్ణయం అయినా సోనియాగాంధీ తీసుకుంటే మన్మోహన్ అమలుచేయటమే.

సరిగా ఆ సమయంలోనే బ్యాంక్‌లమీద ఒత్తిడి మొదలైందనేది రఘురామ్ రాజన్ చెపుతున్న మాట. "సోనియాగాంధీ, ఆమె పరివారం నుండి ఫోన్ వస్తే వెనువెంటనే భారీ రుణాలు బ్యాంకులు ఇచ్చాయి" అన్నది రాజకీయ ఆరోపణ.

అయితే 2004 వరకు వున్న లాభసాటి ఆర్థిక ప్రగతే మున్ముందు కొనసాగుతుందన్న నమ్మకంతో రుణాలు వెంటపడి మరీ ఇచ్చాయి బ్యాంకులు అన్నది రఘురామ్ రాజన్ చెప్పింది.

2006 నుండి 2008 మధ్యకాలంలో బ్యాంకులు ఇచ్చిన రుణాలే నిరర్థక ఆస్తుల య్యాయి.ఆ సమయంలో బ్యాంకులు తప్పులు చేశాయి. పారిశ్రామికవేత్తల సొంతపెట్టుబడుల అంశం పరిగణనలోకి తీసుకోకుండా, ఇవ్వటానికి వీలులేనంత ఎక్కువ ఋణాలు మంజూరుచేశారు. రాజకీయ ఒత్తిడి, అవినీతి కూడా అందులో ఒక భాగమయ్యాయి.

ఆ తర్వాత ప్రపంచవ్యాప్త ఆర్థిక మాంద్యం, వృద్ధి రేటు తిరోగమనం, ప్రాజెక్టు అంచనాల పెరుగుదల, ప్రభుత్వ విధానాలు అన్నీ కలగలిపి బ్యాంకులను కుదేలు చేశాయి అని రఘురామ్ రాజన్ జాతీయ బ్యాంకులపై నియమించిన పార్లమెంట్ ఎస్టిమేట్స్ కమిటీ ముందు చెప్పాడు.

తాను రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్‌గా బాధ్యతలు తీసుకున్న తర్వాత అమలుచేసేందుకు కొన్ని యత్నాలను చేసినట్టు రఘురామ్‌రాజన్ వివరించాడు. తాను 2013లో రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్‌గా పని ప్రారంభించిన సమయంలోనే నిరర్థక ఆస్తుల భారం బ్యాంకుల మీద పడనుందని గుర్తించానని చెప్పాడు.

బ్యాంకుల్లో జరుగుతున్న మోసాలను, రుణ ఎగవేత అంశాలను గమనించేందుకు ఒక పర్యవేక్షణా బృందం ఏర్పాటుచేసి, వారు కనుగొన్న ఎగవేతదారుల మోసాల గురించి ప్రభుత్వ పరిశోధనాసంస్థలకు పంపాలని ఆదేశించాడు.

అదే సమయంలో ఋణాలు ఎగవేసి తప్పించుకుంటున్న పెద్ద తిమింగలాల గురించి నేరుగా ప్రధాని కార్యాలయానికి 2016లో ఒక నివేదిక పంపి, కనీసం అందులోని ఒకరిద్దరిపైన అయినా చర్యలు చేపట్టేందుకు సమన్వయంగా పనిచేద్దామని అన్నాను.

కాని దానిమీద పురోగతి లేదు. ఒక్కరిపైన కూడా కేసు నమోదు అవలేదు. దగాలను అడ్డుకోలేక పోయారు" అన్నది రఘురామ్ రాజన్ వాదన.

ఆ విధంగా భారతదేశ బ్యాంక్‌లు బలహీనపడటానికి యు.పి.ఎ., ఎన్.డి.ఎ.లు రెండూ కారణమేనని మాజీ గవర్నర్ రఘురామ్‌రాజన్ అన్నారు.

మన్మోహన్‌సింగ్, నరేంద్ర మోడీలిద్దరి వ్యవహారశైలిని తప్పుపట్టాడు రఘురామ్ రాజన్. అయితే అసలు నేరం రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్‌గా పనిచేసిన రఘురామ్ రాజన్‌దేనంటూ ప్రణాళికాసంఘం సభ్యుడు గతంలో ఆరోపించాడు.

బ్యాంకులను చక్కదిద్దే యత్నం గవర్నర్‌గా రఘురామ్ రాజన్ చెయ్యలేదు.

ఆయన హయాంలోనే నిరర్థక ఆస్తులు పెరిగాయి అన్నది నీతి ఆయోగ్ ఆరోపణ. తాను వ్యక్తిగతంగా చర్యలు తీసుకున్నానని చెపుతూనే "ఆ యా ప్రాజెక్టు విలువను బ్యాంకులు అతిగా అంచనావేసిన తొలి నాళ్ళలోనే ఋణాల తీరుతెన్నులపై రిజర్వ్‌బ్యాంక్ అప్రమత్తం చేసివుండాల్సిందని" అంగీకరించాడు.

- ⇨ భారీగా పెరిగిన నిరర్థక ఆస్తులు
- ⇨ రఘురామ్ రాజన్ నివేదికలో వాస్తవాలు
- ⇨ యు.పి.ఎ., ఎన్.డి.ఎ. రెండూ రెండే
- ⇨ ఇది సరైన ఆర్థిక ప్రగతి కాదు

"నియమనిబంధనలను పాటించని బ్యాంక్‌లపై జరిమానాలు విధించటంలో మరింత నిర్ణయాత్మకంగా వ్యవహరించివుండాల్సిందని" రఘురామ్ రాజన్ ఒప్పుకున్నాడు. భారతీయబ్యాంకులమీద ప్రభుత్వ పెత్తనం కొత్తదికాదు.ఆ పెత్తనంకోసమే నాడు బ్యాంకులను జాతీయం చేసింది ఇందిరాగాంధీ.

తన పలు రాజకీయ ప్రణాళికలకు అనుగుణంగా బ్యాంక్‌లనుండి రుణాలు మంజూరు చేయించటం మొదలుపెట్టారు.

బ్యాంక్ ఛైర్మన్లు, డైరెక్టర్ల నియామకం పూర్తిగా రాజకీయపరమైంది. భారీ విరాళాలతో ఆ పదవులు కొనుక్కున్న వ్యక్తులు బ్యాంకులనుండి తాము పెట్టిన పెట్టుబడులను వడ్డీతో సహా రాబట్టే అక్రమవిధానాలు అనుసరించారు. ఎంపికచేసిన పారిశ్రామికవేత్తలకు భారీ ఋణాల మంజూరు అందులో భాగమే.

బ్యాంకులపై ప్రభుత్వ అజమాయిషీ తగ్గిస్తాం అని ప్రధాని నరేంద్రమోడీ గతంలో ప్రకటించారు. దానికి అనుగుణంగా బ్యాంక్ ఛైర్మన్లు,ఇతర కీలక పదవులకు అభ్యర్థుల ఎంపికకై రాజకీయ ప్రమేయం లేని వ్యవస్థను 2016లో ఏర్పాటుచేశారు.

అయితే ఆ వ్యవస్థద్వారా ఎంపిక అయిన అభ్యర్థులకు ప్రభుత్వం క్లియరెన్స్ ఇవ్వకపోవడంతో నేటికీ జాతీయబ్యాంకుల్లో మూడోవంతుకు పూర్తిస్థాయి ఛైర్మన్లు లేరు. ఇవన్నీ ఇలా వుండగా పలు కీలక పదవులు నేటికీ ఖాళీగా పడున్నాయి.

రాజకీయ పథకాలకు అనుగుణంగా బ్యాంకుల ఋణాల మంజూరీ నేటికీ కొనసాగుతున్నది.

ప్రధాని నరేంద్రమోడీ ప్రభుత్వం ఇస్తున్న ముద్ర రుణాలు, పలు రాష్ట్రప్రభుత్వాలు చేస్తున్న రైతు ఋణాల మాఫీలు రెండూ కూడా బ్యాంకుల మెడకు పెనుభారంగా తగులుకోనున్నాయి అన్నది రఘురామ్ రాజన్ హెచ్చరిక.

అదేవిధంగా మధ్యతరహా పరిశ్రమలకు ఉదారంగా ఇస్తున్న ఋణాలు బ్యాంకులను ముంచే ప్రమాదం ఉందన్నది ఆర్‌బిఐ మాజీ గవర్నర్ రఘురామ్ రాజన్ మాట. బ్యాంకులనుండి తీసుకున్న ఋణాలు చెల్లించనవసరంలేదు,

ఏదో ఒకసార్టి వాటిని రద్దుచేసి తీరుతుందన్న అభిప్రాయం సామాన్య ప్రజలలో ప్రభుత్వాలు కలిగించిన తర్వాత ఇక బ్యాంకులు ఋణాలను తిరిగి వసూలుచేసే యత్నం ఎలా చేస్తాయి!

ఋణగ్రహీతలు ఋణాలనెందుకు చెల్లిస్తారు! మొత్తం బ్యాంకుల ఋణమంజూరీ, వసూలు సంస్కృతినే వరసగా ప్రభుత్వాలు దెబ్బతీశాయి. ఇందిరాగాంధీ హయాంలో జరిగిన భారీస్థాయి ఋణమేళాలు,

ఆ తర్వాత మూపనార్ వంటి కాంగ్రెస్ పెద్దలు సృష్టించిన ఇండియన్ బ్యాంక్ కుంభకోణాల తర్వాత బ్యాంక్‌లకు రక్షణ కరువైంది.

బ్యాంకుల నష్టాలను ప్రజాధనంతో ప్రభుత్వాలు భర్తీచేసే సంస్కృతి మనదేశంలో వచ్చింది.

అధికారం ఏ పార్టీది అయినా అనుసరించే బ్యాంకింగ్ విధానం ఇదే. ప్రభుత్వాల బలహీనతలను తెలివిగా కొందరు పారిశ్రామికవేత్తలు, రాజకీయనాయకుల అండతోనే మరికొందరు తమకు అనుకూలంగా మలచుకున్నారు.

బ్యాంకులను కొల్లగొట్టిన డబ్బును పంచి, ఎమ్.ఎల్.ఎ.ల ఓట్లు కొని విజయ్‌మాల్యా రాజ్యసభకు ఎంపికయ్యాడన్న విషయం మరువకూడదు.

రాజ్యసభ సభ్యత్వహోదాను బ్యాంక్‌లు తన జోలికి రాకుండా ఉపయోగించుకున్నాడు విజయ్ మాల్యా. హాయిగా విదేశాలకు పారిపోయేందుకు సహకరించాయి దేశంలోని వ్యవస్థలన్నీ.

ఇప్పటికైనా బ్యాంకులు, ప్రభుత్వం తాము ప్రజాధనానికి ట్రస్టీలుగా వ్యవహరించటం మొదలుపెడతాయా! ప్రజాస్వామ్యంలో ప్రజలకు జవాబుదారీగా నిలవాల్సిన విషయం గుర్తిస్తాయా! లేక రాజకీయ పోరాటాలకే విలువనిస్తాయా!

ఎవరి హయాంలో ఏం జరిగిందనేది కాదు ప్రజలు తెలుసుకోవాలనుకుంటున్నది. ఎందుకు అలా జరిగిందనేది చెప్పమంటున్నారు.

డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

# అంతా రాజకీయమే

## ప్రశ్నలు మొదలయ్యాయి

తెలంగాణలో నాకు తిరుగులేదనే ధైర్యంతో అసెంబ్లీని హఠాత్తుగా రద్దుచేసి ముందస్తుకు వెళ్ళిన కె.సి.ఆర్ కుటుంబానికి తెలంగాణ సమాజంనుండి ప్రశ్నలు మొదలయ్యాయి.

టి.ఆర్.ఎస్‌లో టికెట్లు దక్కనివారు అసమ్మతి వర్గంలో చేరిపోతున్నారు. ఇప్పుడు వారు అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పటం కె.సి.ఆర్. కుటుంబ బాధ్యత అయింది.

ఏవి ఉద్యోగాలు అంటున్నది ఉస్మానియా క్యాంపస్. ఏడీ దళిత ముఖ్యమంత్రి అంటున్నది దళిత సామాజికవర్గం.

విభజన తర్వాత ఆర్థికంగా బలపడిన ఆంధ్ర వర్గాలతో మీ దోస్తీ వెనకున్న మతలబు ఏమిటో చెప్పమంటున్నాయి బలహీన వర్గాలు.

మొత్తం లెక్కదీసి నీ వర్గానికి అన్ని పదవులేంటో చెప్పు దొరా అంటున్నారు గ్రామీణులు. ఇప్పుడు తన ప్రచార ఉధ్ధృతంలో ఈ ప్రశ్నలకు సమాధానం చెప్తుతాడో చూడాలి కె.సి.ఆర్. ◆

## ఏమి చేసినా తిప్పలే

**2019** సంవత్సరంలో లోక్‌సభ ఎన్నికలు ప్రకటించేలోగా తన మతం, కుల, గోత్రాల విషయంలో మరింత స్పష్టత ఇవ్వాలన్న యత్నం రాహుల్‌గాంధీ చెయ్యాలనుకున్నాడు.

అందుకే రాష్ట్రాల స్థాయి దేవాలయాలు దర్శించి, నేను శివ భక్తుడిని అని ప్రకటించి,చార్ ధామ్ యాత్ర ముగించినా హిందూ సమాజం రాహుల్‌ని అక్కున చేర్చుకోలేదని భావించిన కాంగ్రెస్ పెద్దలు రాహుల్‌గాంధీని ఏకంగా మానస సరోవర యాత్రకు పంపించారు.

అక్కడ రాహుల్ తీయించుకున్న ఫోటోలు, సెల్ఫీలు, ఇంటర్నెట్‌లో పెట్టాడు. ఐతే ఆయన పెట్టిన ఫోటోల్లో వున్న లోపాలు. నిజంగా మానస సరోవరం వెళ్ళాడా! అనే సందేహం రేకెత్తించాయి. ఈలోగా మా నాయకుడు బ్రాహ్మణుడు అంటూ కాంగ్రెస్ అధికార ప్రతినిధి చేసిన ప్రసంగం మిగిలిన కాంగ్రెస్ మద్దతుదారులకు కోపం తెప్పించింది. బ్రాహ్మణత్వపు ప్రచారం ఏంటని ఎదురుప్రశ్న వేస్తున్నారు వారు. ◆

## హరియాణా పోయినట్లేనా

**2014** లోక్‌సభ గెలుపు తర్వాత వెనువెంటనే బి.జె.పి. అనూహ్య విజయం సాధించిన రాష్ట్రం హరియాణా.ఆ రాష్ట్రంలో నిజానికి పార్టీకి అంతగా పట్టులేదు. పార్టీ వ్యవస్థా సరిగ్గా లేదు.

అయినా అప్పుడు నరేంద్రమోడీకున్న హవాతో గెలుపు దక్కింది. ఎవరిని సి.ఎమ్. చేయాలను కున్నప్పుడు ఆర్.ఎస్.ఎస్‌లో కీలకపాత్ర పోషించే ఒక హరియాణా రాష్ట్ర వ్యక్తి మనోహర్‌లాల్‌ఖట్టర్ పేరు ప్రతిపాదించి సి.ఎమ్.గా కూర్చోపెట్టారు.

అంతకన్నా పాపులర్ అయిన నేత పార్టీలో వున్నా ఆయన జాట్ కులస్తుడు కాబట్టి, ఆ రాష్ట్రం ఏర్పడినప్పటినుండి జాట్‌లే సి.ఎమ్ లుగా వుంటున్నారు. కాబట్టి ఆ పద్ధతిని మార్చాలన్నది అప్పటి బి.జె.పి. భావన.

అయితే ఖట్టర్ పాలన అంత సజావుగా లేదు. దాంతో కాంగ్రెస్ నెమ్మదిగా జాట్‌లను దువ్వటం మొదలుపెట్టింది. మిమ్మల్ని కాదని మరెవరినో సి.ఎమ్. చేస్తే ఎలా ఊరుకుంటారు అని రహస్య మీటింగుల్లో నూరిపోసింది.

అది జాట్‌ల మనసులలోకి బాగా ఎక్కింది. వచ్చే ఎన్నికల్లో బి.జె.పికి జాట్‌లు అంటే ఏమిటో చూపిస్తాం అంటున్నారు. ◆

## మారని ఫార్ములా

చంద్రబాబు నాయుడి సక్సెస్ ఫార్ములా ఒకటే. తన పార్టీలో వున్నవారిని ఎలాగైనా నచ్చ చెప్పవచ్చు... ముందుగా ఇతర పార్టీలో నుండి మనుషులను లాక్కుందాం అనేది ఆ ఫార్ములా.

పార్టీ బలహీనంగా వున్న ఉత్తరాంధ్రలో, నాయకుల మధ్య వున్న విభేదాలను చక్కదిద్దలేనని చేతులు ఎత్తేశాడు. పైగా ఉత్తరాంధ్రలో పవన్ పలుకుబడి, జగన్ జనాకర్షణ చూసిన తర్వాత ఆయనలో కంగారు మొదలైంది.

అందుకే ఆ జిల్లాలలోని కాంగ్రెస్‌పార్టీలో వున్న నేతలు వై.కా.పావైపు మళ్ళకముందే ముందుగా మన సైకిల్ ఎక్కించండి అని పిలుపునిచ్చాడు.

ఈ ఫిరాయింపుల ఫార్ములాతోనే గెలుపు సాధ్యం అనుకుంటున్నాడు.

అయితే ప్రతిఒక్క ఫిరాయింపు రాకతో సొంత పార్టీవారు పదిమంది అలుగుతారనే ఆలోచన అగ్రనేతలో లేదు.

అందరికీ పదవుల ఆశ చూపి, ఎవరికీ ఇవ్వలేక ఇప్పటికే పార్టీలో లుకలుకలు సృష్టించిన చంద్రబాబు నాయుడు తాజా ఫిరాయింపు కార్డులతో గెలుస్తాడా! భంగపడతాడా! ◆

## బీహారులో కొత్త షాక్

**2014** ఎన్నికల్లో రాష్ట్రీయ లోక్ సమతా పార్టీ (ఆర్.కె.ఎస్.పి.), బి.జె.పితో కలిసి పోటీ చేసింది. ఆ పార్టీ నేత ఉపేంద్ర కుష్వా మోడీ మంత్రివర్గంలో పదవి పొందాడు. అయితే 2019 ఎన్నికల సమయానికి కుష్వా తాను ఎన్.డి.ఎ. నుండి వెళ్ళిపోయే సంకేతాలు ఇచ్చాడు.

"కుష్వాలు వ్యవసాయదారులు. బియ్యం పండించే మేము, పాలు పితికే యాదవులు కలిస్తే అద్భుతమైన పాయసం తయారవుతుంది" అంటూ తాను లాలూ ప్రసాద్ యాదవ్‌తో కలవబోతున్న విషయం చెప్పకనే చెప్పాడు.

కుష్వాకి అసలు సమస్య సి.ఎమ్. నితీష్‌కుమార్‌తో. అతనితో నేరుగా పోరాడలేక బి.జె.పికి షాక్ ఇస్తే వాళ్ళు అటునుండి నరుక్కువస్తారనుకున్నాడు. అయితే నితీష్‌కుమారే అమిత్‌షాకి షాకు ఇస్తున్నాడు సీట్ల పంపిణీ వ్యవహారంలో.

ఎన్.డి.ఎ. భాగస్వాములంతా తిరిగి లాలూతో చేతులు కలిపితే బీహార్‌లో బి.జె.పి. పరిస్థితి అంతే. బీహార్‌లో తగులుతున్న షాక్‌లనుండి అమిత్‌షా ఎలా బయటపడతాడో చూడాలి. ◆

## పాత పాపాలు

అధికారంలో వుండగా ఆదాయపు పన్ను శాఖకు ఆదాయం విషయం సక్రమంగా తెలియ చెయ్యలేదు సోనియా, రాహుల్.

ఆ విషయం సుబ్రహ్మణ్యస్వామి పసిగట్టి కోర్టులో కేసువేశాడు.2011-12 ఆర్థిక సంవత్సరపు ఆదాయపు పన్ను విషయంలో కొన్ని రకాల ఆదాయాలు ఎందుకు చూపలేదని ఆదాయపు పన్ను శాఖవారికి నోటీసు ఇచ్చింది. పాతలెక్కలు ఎలా అడుగుతారు వీలుకాదంటూ ఆ ఇద్దరు నేతలు ఢిల్లీ హైకోర్టును ఆశ్రయించారు.

హైకోర్టు వాదోపవాదాలు విని ఐ.టి. శాఖ జారీ చేసిన నోటీసులు సక్రమైనవేనని, మీ అభ్యంతరాలు ఆ శాఖకు తెలియచేసుకోండి అన్నది.

పన్ను నిబంధనలను ఉల్లంఘించలేదన్న రాహుల్, సోనియా తరపు న్యాయవాదుల వాదనను కోర్టు అంగీకరించలేదు.

ఫలితంగా పాత పాపాలకు శిక్ష ఎదుర్కోక తప్పటం లేదు తల్లి, కొడుక్కి.

# ఒక చిన్నమాట



రాహుల్‌గాంధీకి మానససరోవర యాత్ర చేయటానికి ఇంచుమించు పదిరోజులు పట్టింది. వచ్చిందే ఆలస్యం అన్ని పార్టీల సహకారంతో పెరుగుతున్న ఇంధనం ధరలు వ్యతిరేకిస్తూ భారత్ బంద్ జరిపారు.

ఇంధనం ధరలు నిర్ణయించటం తమ వశంలో లేదని ప్రభుత్వమెలాగూ చెపుతూనే ఉంది.కాని సమస్యకు ఏదో పరిష్కారం చూడాలి. పెట్రోలు ధరల ప్రభావం అన్నిటిమీదా పడుతుందనేది అందరికీ తెలిసిన విషయమే.

సమస్య తీవ్రమే. నిరసనవల్ల అది తీరదు. పరిష్కారమార్గానికి అందరూ ఏకమై ఉంటే బాగుండేది. కాని ఏ రాయి అయితేనేం అనే వెతుకులాటలో నిరసనలు తప్పవు. అవకాశం చూసుకునే హింసా తగ్గదు.

రాహుల్‌గాంధీ మానససరోవర యాత్ర ఒక మొక్కుబడి తీర్చుకోటానికి వెళ్ళినట్టు వార్తలొచ్చాయి. ఆపదలలో దేవునిమీద భారంవేయటమూ సబబే.కృతజ్ఞతలు తెలుపుకోవటం సమంజసమే. విమాన ప్రమాదం తప్పినందుకు ఈ యాత్ర చేయాలనుకున్నారు,చేశారు. ఆ యాత్రలోని విశేషాలు ఫోటోలతో సహా సామాజిక మాధ్యమాలలోవచ్చాయి.ట్విట్టర్‌లో కైలాస్ మానససరోవర్‌గురించి ఈవిధంగా వర్ణించారు.



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

"మానససరోవర్ నీళ్ళు సౌమ్యంగా, శాంతంగా, ప్రశాంతంగా ఉన్నాయి. అవి ప్రతిదీ ఇస్తాయిగాని ఏదీ పోగొట్టుకోవు. ఎవరైనా ఆ నీళ్ళు తాగొచ్చు. ఇక్కడ ద్వేషంలేదు. అందుకే మనం భారతదేశంలో ఈ నీళ్ళని ఆరాధిస్తాము"

రాహుల్‌పట్ల దేశంలో ఎవరికీ వ్యతిరేకభావం లేదు. పైగా ఇంతో అంతో ప్రేమాభిమానాలున్నాయి.కాని అప్పుడప్పుడు రాహుల్‌చేసేవ్యాఖ్యలు, దేశకాలాలు పట్టించుకోకుండా, ఉచితానుచితాలు చూడకుండా చేసే ప్రకటనలు వింతగానూ ఉంటాయి. వివాదాలకూ దారితీస్తాయి.

విదేశాలలో ఉన్నప్పుడు సామాన్య పౌరులు కూడా తమ దేశ ప్రతిష్ఠకు భంగం కలగకుండా వ్యవహరించుకుంటారు. అవతల వ్యతిరేకభావమున్నా సరిదిద్దటానికి ప్రయత్నిస్తారు. ఆ క్షణంలో దేశానికి నైతిక రాయబారులవుతారు.

కొందరు మేధావులుగా మన్ననలు పొందేవారు విదేశాలలో మనదేశంగురించి తక్కువచేసి మాట్లాడినా, వ్యతిరేకభావాలు వ్యక్తంచేసినా ఇక్కడెవ్వరూ ఆమోదించరు. రాహుల్‌గాంధీ సామాన్య వ్యక్తి కాదు.దేశంలో పురాతనమైన ఒక పెద్ద పార్టీకి అధ్యక్షుడు. ప్రతిపక్ష నేత. ఈయన చెప్పే మాటలన్నిటికీ ప్రాముఖ్యముంటుంది. ఇక విదేశాలకు వెళ్ళినప్పుడు మాట్లాడే మాటలన్నీ క్షుణ్ణంగా విశ్లేషిస్తారు. ఆ విశ్లేషణలు అనేక దేశ ప్రతిష్ఠతో ముడిపడి ఉంటుంది.

ఆగష్టులో లండన్ పర్యటనలో ఇంటర్నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్ట్రాటజిక్ స్టడీస్ ఏర్పాటుచేసిన కార్యక్రమంలో పాల్గొన్నారు. ఆర్.ఎస్.ఎస్.గురించి ఆయన విపరీతమైన వ్యాఖ్యలు చేశారు. రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌ను అరబ్ దేశాలలోని రాడికల్ ఇస్లామిస్ట్ గ్రూప్ ముస్లిమ్ బ్రదర్ హుడ్‌తో పోల్చారు. ఏమాత్రం పొంతనలేని పోలిక.

ముస్లిమ్ బ్రదర్‌హుడ్ ఉగ్రవాద సంస్థగా పేరు పొందింది. బహ్రెయిన్, ఈజిప్ట్, రష్యా, సిరియా, సౌదీ, యూఏఈ-లు ఉగ్రసంస్థగా దీనిని ప్రకటించాయి. సమాజ సేవకు అంకితమైన రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లో టెర్రరిజమ్ ఎక్కడుంది? ఆర్.ఎస్.ఎస్. కార్యకలాపాలను వ్యాఖ్యానిస్తూ సంఘ్ భారత దేశ స్వభావాన్ని మార్చివేయడానికి ప్రయత్నిస్తోంది అన్నారు.

"అన్ని భారతీయ సంస్థలనూ వశపరచుకోడానికి ప్రయత్నిస్తోంది. ప్రతి జీవనరంగము, కార్యకలాపము ఒకే భావజాలంతో నిర్వహింపబడాలని విశ్వసిస్తుంది" మోడీ ప్రభుత్వం తీసుకునే చర్యలూ ఆర్.ఎస్.ఎస్. ప్రభావితమని చెపుతూ మూకదాడుల మరణాలకు చిత్రమైన వివరణ ఇచ్చారు. జర్మనీలో ఇచ్చిన ఉపన్యాసంలో వాటికి ఆర్థిక కారణాలు పేర్కొన్నారు.

డీమానిటైజేషన్ (నోట్ బందీ)వల్ల నిరుద్యోగం ప్రబలిందని, అదే మూకహింసకు కారణమని చెప్పారు. జి.ఎస్.టి. సరిగ్గా అమలు జరపనందున వ్యాపారస్తులు, దళారులు దెబ్బతిన్నారన్నారు.

నమ్మశక్యం కాని మరోమాట రాహుల్ నోటినుండి లండన్ ఉపన్యాసంలో వెలువడింది. 1984 సంవత్సరంలో మూకదాడులకు 3000 మంది సిక్కులు బలికావటంలో తమ పార్టీ ప్రమేయం లేదన్నారు.

ఆ హింసలో పాల్గొన్నవారికి శిక్షపడాల్సిందే అని చెప్పినా,హింస బాధితుడైన తాను హింస ఎంత క్షోభ కలిగిస్తుందో అర్థంచేసుకోగలనని చెప్పినా, 2005 సంవత్సరంలో నాటి ప్రధానమంత్రి మన్‌మోహన్‌సింగ్ తమ అందరి తరఫునా క్షమాపణ కోరారన్నా కాంగ్రెస్ పార్టీకి ఆ అల్లర్లతో సంబంధంలేదని చెప్పటం ఎవరూ అంగీకరించలేకపోయారు.

ఇందిరాగాంధీ మరణవార్త తెలియగానే కాంగ్రెస్ నాయకులు మూకలను కదిలించి, సిక్కులమీద, వారి ఆస్తులమీద దాడిచేసేటట్లు చూశారన్నది సర్వవిదితం. ఈ హింసాకాండ ఢిల్లీలో ఎక్కువగా జరిగింది.

కొన్ని ఉత్తరభారత రాష్ట్రాలలోనూ జరిగింది. ఈ అల్లర్లను పరిశీలించి నివేదికను సమర్పించిన జస్టిస్ నానావతి కమిషన్ చాలా విషయాలను స్పష్టంచేసింది.పోలీసుల నిర్లక్ష్యాన్నీపేర్కొంది. ఎన్నో కేసులు నమోదు కాలేదు.

నమోదైన కేసుల్లో కొన్నింటికి జాడలేదు, మరి కొన్నింటిలో నేరస్తులు విడుదల అయ్యారు. వదంతులు వ్యాపించాయి. హింసను రెచ్చగొట్టారు. ప్రతీకారం తీర్చుకోమన్నారు.

మూకలు బస్సుల్లో, ఇతర వాహనాలలో వచ్చాయి. దాడులన్నీ కూడా వ్యవస్థీకృతంగా జరిగాయి. పేలుడు వస్తువులు లభ్యమయ్యాయి. సిక్కు సమాజంలోని పురుషులను ఇంటినుండి బయటకు లాగి తగలబెట్టారు.

"పెద్ద సంఖ్యలో అఫిడవిట్లు ప్రాంతీయంగా కాంగ్రెస్(ఐ) నాయకులు, కార్యకర్తలు రెచ్చగొట్టారు లేదా సిక్కులమీది దాడిచెయ్యటానికి సాయపడ్డారు అని తెలియజేస్తాయి" అని కమిషన్ రిపోర్ట్ చెపుతుంది.

ఎన్నో సందర్భాలలో తాను ప్రధానమంత్రిని అవుతాను అనే నమ్మకాన్ని వెలిబుచ్చిన రాహుల్ లండన్‌లోనే తాను ప్రధానమంత్రినవుతాననే కలలు తనకు లేవని చెప్పారు.

"నేను భావజాలాల పోరాటం చేస్తున్నాననిపిస్తుంది. ఈమార్పు 2014 తర్వాత వచ్చింది. నేను ఉదయం లేచి భారతదేశంలో సంస్థల నిర్మాణాలను ఎలా రక్షించాలా అన్నది ఆలోచిస్తాను" మంచి ఆలోచనే కదా!

# పిల్లలకు ప్రీతి వినాయకుడు

వినాయకచవితి పండుగ అంటే పిల్లలకు సరదా. పుస్తకాలన్నీ తెచ్చేసి 2ఈ చదువుల దేవుడి ముందుంచి ప్రతి పుస్తకం అట్టపైనా పసుపుతో 'శ్రీ', 'ఓం' అన్న అక్షరాలు రాస్తుంటారు.

బుద్ధిగా, భక్తిగా అమ్మానాన్నల పక్కన కూర్చుని వినాయకచవితి కథంతా శ్రద్ధగా వింటారు. ఆపైన బొజ్జగణపతికి నివేదించిన భారీ ప్రసాదాలపై దాడి చేస్తారు.ఇవన్నీ సరే-ఈ విఘ్ననాయకునినుంచి పిల్లలు నేర్చుకోవాల్సినవి అనేకం ఉన్నాయనేది తెలుసా?

విఘ్నేశ్వరుడినుంచి పిల్లలు నేర్చుకోవాల్సిన మూడు నీతి కథలున్నాయి. వాటిని పిల్లలు అర్థం చేసుకుని, ఆచరించగలగాలి.

## ఏనుగు తల ఎలా వచ్చింది?

ఓ రోజున కైలాస పర్వతాన పార్వతీదేవి స్నానానికి సిద్ధం అవుతున్నది. తలుపు దగ్గర కాపలా కాయడానికి ఎవ్వరూ లేకపోయారు.

దీంతో తన నలుగుపిండి, పసుపులతో ఒక పిల్లవాడిని తయారుచేసి, ప్రాణం పోస్తుంది. తన స్వంత బిడ్డగా భావించి, 'గణేశా' అని పిలుచుకుంటుంది.



Courtesy : PARENT CIRCLE

తలుపు దగ్గర కాపలా వుండి, ఎవరినీ లోపలకు అనుమతించవద్దని చెప్తుంది. తపస్సు ముగించి శివుడు ఇంటికి వస్తాడు. గణేశుడు గుమ్మంవద్ద అతన్ని ఆపేస్తాడు. తానెవరో శివుడు చెప్పినా, లోపలకు ప్రవేశించడానికి అనుమతించడు.

శివుడు పిల్లవాడితో పోరాడి, త్రిశూలంతో తల తుంచేస్తాడు. తన బిడ్డ చనిపోయినందుకు పార్వతీదేవి దుఃఖిస్తుంది. ప్రపంచం నశిస్తుందని శపిస్తుంది. సృష్టికర్త బ్రహ్మ జోక్యం చేసుకుని, ఆమె మనస్సు మార్చుకోవాలని ప్రార్థిస్తాడు.

గణేశుడికి తిరిగి జీవంపోస్తే ఒప్పుకుంటానంటుంది. అప్పుడు శివుడు శక్తివంతమైన గజాసురుడి తలతెచ్చి అతికించి, ప్రాణంపోస్తాడు. గణేశుడిఅంకిత భావం, బాధ్యత శివపార్వతులకు నచ్చుతుంది.అతన్ని తమ స్వంత బిడ్డగా ఆమోదిస్తారు.

## పిల్లలు గ్రహించాల్సిన విలువలు :

అన్ని అంశాల్లోనూ గణేశుడి నాయకత్వ లక్షణాలు, దేవుళ్ళందరిలోనూ గల ఉత్తమస్థానం అర్థం చేసుకోవాలి. మన విధులపట్ల ఎటువంటి పరిస్థితుల్లోనైనా వాస్తవికంగా వుండాలన్న నీతి ఈ కథద్వారా తెలుస్తుంది. మన మార్గంలో ఎంతటి శక్తివంతమైన అవాంతరాలు ఎదురైనా భయపడకూడదు.

మనపట్ల వుంచిన నమ్మకానికి విలువ ఇస్తే, మన విధులను మనస్ఫూర్తిగా పాటిస్తే, గౌరవమర్యాదలు, ప్రేమకు పాత్రులం అవుతాము.

## విజ్ఞాన ఫలాలు

ఓసారి నారదమునీంద్రుడు మామిడిపండు తీసుకుని శివపార్వతుల వద్దకు వస్తాడు. దానిని విజ్ఞాన ఫలంగా పేర్కొంటాడు. దానిని ఎవరైతే తింటారో వారికి అనంతవిజ్ఞానం వరంగా లభిస్తుందని చెప్తాడు. అయితే, ఫలితం పొందాలంటే దాన్ని యథాతథంగా, కోయకుండా తినాలని చెప్తాడు.

తమ కుమారులైన గణేశ్, కార్తికేయుల్లో ఒకరికి ఆ ఫలాన్ని ఇవ్వాలని శివపార్వతులు భావిస్తారు. ఎవరికి ఇవ్వాలో నిర్ణయించడానికి నారదుడు పోటీ పెడతాడు. ఇద్దరు కుమారులు లోకాన్ని ముమ్మారు చుట్టిరావాలి. ఎవరైతే ముందుగా వస్తారో వారికే పండు లభిస్తుంది.

తానే ముందుగా పూర్తిచేయగలనన్న విశ్వాసంతో కార్తికేయుడు తన నెమలి వాహనంపై వేగంగా బయలుదేరతాడు. తన మూషిక వాహనాన్ని ఉపయోగిస్తే ఖచ్చితంగా ఓడిపోతానని గణేశుడు గ్రహిస్తాడు. వెంటనే బుర్రకు పనిపెడతాడు.

తన తల్లిదండ్రుల చుట్టూ సంతోషంగా మూడు ప్రదక్షిణలు చేస్తాడు. వాళ్ళే తన ప్రపంచం అని,దాని ముందు ఏదీ సాటిరాదని తల్లిదండ్రులకు గర్వంగా చెప్తాడు. అతని సమాధానానికి మెచ్చిన శివపార్వతులు పండును గణేశుడికి బహూకరిస్తారు.

### పిల్లలు గ్రహించాల్సిన విలువలు :

మన తల్లిదండ్రు లకు, పెద్దలకు విలువ, గౌరవం ఇవ్వాలని గణేశుడి చర్యలు చెప్తున్నాయి.

వారితో మనం పంచుకునే బాంధవ్యానికి మించి ఈ ప్రపంచంలో మరేదీ వుండదు.మనం ఎప్పుడూ మన బలహీనతలు, బలాలు అర్థంచేసుకుని దాని ప్రకారం నడుచుకోవాలి. ప్రతి సందర్భంలోనూ బుర్రను సృజనాత్మకంగా వాడుకోవాలి. అలా చేస్తే విజయం ఎప్పుడూ మనకే స్వంతం అవుతుంది.

## గణేశుడు, మహాభారతం

ఒకరోజు వ్యాసమహర్షి మహాభారతం రాయాల్సిందిగా గణేశుడి వద్దకు వచ్చి అడుగుతాడు. తానుచెప్తూ గణేశుడితో రాయించాలని భావిస్తాడు. ఒకసారి మొదలుపెడితే ఆపనని, మహర్షి ఆపకుండా చెప్తూ ఉండాలన్ననిబంధనపై గణేశుడు ఒప్పుకుంటాడు.

తెలివిగల వ్యాసుడు ఓ మెలిక జతచేస్తాడు. తాను గణేశుడికి చెప్తుంటే, రాయడానికి ముందు అతను పూర్తిగా అర్థంచేసుకోవాలని చెపుతాడు. అంగీకారం మేరకు పని మొదలవుతుంది. మహర్షికి విరామం కావాల్సివచ్చినప్పుడల్లా క్లిష్టమైనవి చెప్తుంటాడు.

గణేశుడు ఆగి, సమయం తీసుకుని విషయాన్ని విశ్లేషించుకుంటూ, అవగాహన చేసుకుంటాడు. మహర్షి ఈ సమయంలో విశ్రాంతి తీసుకుంటూ, మరిన్ని విషయాలను బుర్రలోకి తెచ్చుకుంటాడు.

దురదృష్టవశాత్తూ గణేశుడు రాసే ఈ కథ ఆపకుండా రాస్తుండడంవల్ల కలం విరిగిపోతుంది. ఆగకుండా రాస్తానన్న తన వాగ్దానాన్ని దృష్టిలో వుంచుకుని, ఎటువంటి సందేహం లేకుండా, తన దంతాన్ని విరిచి, దాంతో రాస్తాడు.

### పిల్లలు గ్రహించాల్సింది :

అవాంతరాలను అంటే విఘ్నాలను తొలగించే దేవుడిగా గణేశుడికి ఏవిధంగా పరిగణన లభించిందో ఈకథ తెలియజేస్తుంది.అధిగమించడానికి ఏ అడ్డంకీ పెద్దది కాబోదు. మాట ఎలా నిలబెట్టుకోవాలో గణేశుడు బోధించాడు. అందరంకూడా మనస్సుపట్ల నిబద్ధతతో వుండాలి. మనకు సరైన మనస్సు వుంటే విజయాలకు ఏదీ అడ్డంకి కాబోదు. టి.వైష్ణవి

## గణేశుడి చిహ్నాలు

ఏనుగు తల వున్న గణేశుడంటే పిల్లలకు ప్రీతి. అతని పెద్ద చెవులు, బానపొట్టవంటివన్నీ వారికిష్టమే. ఈ చిహ్నాలకు గల అర్థాలను పిల్లలకు వివరించాలి.



ఫోన్ రింగవ్వడంతో చేస్తున్న పని ఆపి రిసీవర్ తీసుకుని "హలో..." అంది సునందిని.

"హలో! వదినా! నేను సుధని"

"చెప్పు..." అంది సునందిని.

"ఊళ్ళో తిరునాళ్ళు మొదలవ్వబోతున్నాయి. నువ్వు, అన్నయ్య పిల్లల్ని తీసుకుని రండి"

"మీ అన్నయ్యతో మాట్లాడు"

సుధ ఏదో చెప్పబోతున్నా వినిపించుకోకుండా రిసీవర్ అక్కడున్న టీపాయ్‌మీద పెట్టి పనున్నట్టు వెళ్ళిపోయింది సునందిని.

"హలో... సుధా! తిరునాళ్ళని పిలవడానికి ఫోన్ చేశావా! సునందిని, అమ్మా పిల్లల్ని తీసుకునివస్తారు లేమ్మా. నాకు పనులు ఉన్నాయి" చెప్పాడు చెల్లెలి మనస్సు నొచ్చుకోకూడదని క్రిష్ణ

"వదిన సంగతి కొత్తేం కాదు నాకు. అందుకే నువ్వూ వదినా ఈసారి తప్పకుండా రావాలి. లేదంటే నా మీద ఒట్టు" క్రిష్ణ చెప్పేది వినకుండా ఫోన్ పెట్టేసింది సుధ. ఆ రాత్రి భార్యతో ఇద్దర్నీ తప్పకుండా రావాలందని, లేదంటే తనమీద ఒట్టు అందని చెప్పాడు. సునందిని మాట్లాడలేదు. అటు తిరిగి పడుకుంది. క్రిష్ణ లైటుతీసి పడుకున్నాడు.

భార్యాభర్తల్ని కప్పేస్తూ సన్నని దోమతెర వాళ్ళిద్దరి మధ్యా దూరం అనే అడ్డు తెరలా రెపరెపలాడుతోంది. మరో గదిలో పిల్లలు నానమ్మ, తాతయ్య మధ్యలో పడుకుని కథ చెప్పించుకుంటున్నారు.

క్రిష్ణ నిద్ర నటిస్తున్నాడు. వెళ్ళాలని ఉంది నందినితో కలిసి... కానీ తనేం చెప్పదు. తను రమ్మంటే వస్తుంది అంతే... తనిష్టాలతో పనేముంది అన్నట్టు బిహేవ్ చేస్తుంది. చాన్నాళ్ళు ఇలాగే దాంపత్య సమరాన్ని కొనసాగించారు.

అతనికి విసుగొచ్చేసింది. రెండు మనస్సులు, రెండు తనువులు ఒకే ఊపిరిగా కలవాల్సిన చోట ఎందుకో తెలీదు నందిని నాకేం సంబంధం లేనట్లు శరీరాన్ని త్యాగం చేస్తున్న తీరు.

క్రిష్ణ అటు నుండి ఇటు తిరిగాడు. నందిని ప్రశాంతంగా నిద్రపోతోంది. ఆమె ఊపిరి తీసి వదిలినప్పుడు పూర్ణకుంభాల్లాంటి ఎద ఎగసిపడే అలలని గుర్తు చేస్తోంది. ఆమె పెదవులు నిద్రలోనూ నవ్వుతున్నట్టు వున్నాయి. అధరం మధురం అన్నట్టు అమృతం తాలూకు కొన్ని చుక్కలు పెదవులపై తడిలా చేరి మెరుస్తున్నట్టున్నాయి.

అందుకోవాలనిపిస్తుంది. ఆమె అభ్యంతరం పెట్టదు. పుష్పం తుమ్మెదను ఆహ్వానించినట్టు ప్రేమతో ఆహ్వానించదు. నిర్లిప్తంగా అందిస్తుంది. అందులో ఆమె హృదయం ఉండదు. ఆఖరిసారి ఆమెహృదయంలోకి తొంగిచూడాలనుకుని భంగపడ్డరోజు ప్రతి నిమిషం గుర్తొచ్చి వేధిస్తూనే ఉంది.

రెండవసారి తల్లిగా మారిన సునందిని ఎప్పుడూ కనిపించనంత అందంగా కనిపించి అతని మతిని పోగొట్టింది. బాబుకి ఇరవై ఒకటోరోజు బారసాల అయ్యింది. నిండు పున్నమిజాబిల్లిలా ఉన్న భార్య



# కరిగే హిమము

## జాస్తి రమాదేవి

**"రానని రాలేనని ఊరక అంటావు... రావాలని ఆశలేనిదే ఎందుకు వస్తావు!" అంటూ ఆమె చుబుకాన్ని ఎత్తి అధరాల్ని చటుక్కున ముద్దుపెట్టుకున్నాడు అతడు. ఆమె కళ్ళు వాల్చుకుంది. ఆ రాత్రి ఆమె ఒక్కమాట కూడా మాట్లాడింది లేదు. తనువును మౌనంగా అర్పించింది అతడికి. ఆ సమయంలో...**

ఒంటరిగా ఎప్పుడెప్పుడు కలుస్తుందా, ఎప్పుడెప్పుడు తన విన్నపాలు విన్నవించుకుందామా అన్న ఆరాటం అతనిది. బంధువులు ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు. ఇంట్లో ఉన్నవాళ్ళు హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

నందిని రూమ్‌లోకి వెళ్ళింది. క్రిష్ణ ఆనందంతో నిశ్శబ్దంగా తలుపులు మూశాడు. ఆమె అతని రాక గమనించలేదు.చీరకొంగు కిందికి జారి ఉంది. జాకెట్ హుక్కులు పట్టకో, రాకో అవస్థపడుతూ ఉంది.

అతను వెనకనించి చేతులు రెండూ ముందుకు చుట్టి మోహంగా అన్నాడు.

"బరువైన.నీ పరువాలని బంధించడానికి నీకంత శ్రమ ఎందుకు చెలీ, మే హెల్ప్ యు..."

అతని బంధనానికి ఆమె ఉక్కిరిబిక్కిరయ్యింది. అతని చేతులు ఎక్కడ ఆగాయో అర్థమై షాకయ్యింది. సడన్‌గా అతనికి అభిముఖంగా తిరిగింది. అతని కళ్ళలో ఏదో మత్తు. అది ఆమెని ఆకాశపుటంచుల్లోకి లాక్కుపోవాలని తహతహలాడుతున్నట్టుంది. అవమానంతో రగిలిపోయిందామె.

"ఎప్పుడూ అదే ధ్యాస.ఆడది ఓ బాణం కాదు ఎటు కావాలంటే అటు సంధించడానికి. ఆమెకో మనస్సుంటుందని... దానికి ఓ స్పందన కావాలని అన్పించదు... హృదయంలేని శరీరంతో పడక పంచుకోవడం బాగా అలవాటయిపోయింది. ప్రతిసారి ఛీ... ఛీ... అసహ్యం వేస్తోంది..." నందిని నోటివెంట ఆరోపణ. తెల్లబోయాడు.

ఆమె కళ్ళ లోతుల్లోకి తొంగిచూశాయి అతని కళ్ళు ఆవేదనగా. అక్కడ కనిపించిన ఏహ్యానికి తుళ్ళి పడ్డాడు. ఇన్నాళ్ళూ తను హృదయంలేని శరీరంతో రమిస్తూ... తనని తను రంజింపచేసుకుంటున్నాడా... ఆమె ప్రమేయం లేకుండా తను మాత్రమే తృప్తిని పొందుతున్నాడా.

ఛీ... ఛీ... అంటూ భార్య తిరస్కారం. క్రిష్ణ పట్టు సడలిపోయింది. ఆమెని మంచంమీదికి తోసి గబగబా బయటికి వచ్చేశాడు.

గదిలోంచి వచ్చిన అన్నయ్య మొహంలో భంగపాటు గమనించింది సుధ. నందినిని ప్రేమించి, కావాలని పెళ్ళి చేసుకోవడం ఏకపక్షంగా జరిగిందేమో అని, అన్నయ్య తప్పుచేశాడేమోనని వాళ్ళ పెళ్ళయినప్పుడే అనుకుంది తను.

కానీ నందినిమాత్రం ఇష్టంలేదని ఎప్పుడూ చెప్పలేదు... ఇష్టంగానో, అయిష్టంగానో కాపురం చేసి ఇద్దరు బిడ్డలకి తల్లయ్యింది.

వదిన మోములో ఉండాల్సినంత ఆనందం ఎప్పుడూ తను చూడలేదు. వీళ్ళిద్దరిమధ్యా దాంపత్య సంబంధం సరిగ్గా ఉన్నట్టు లేదు. అన్నను అడిగింది. వదినను అడిగింది. అటూ ఇటూ అమ్మను, అత్తనూ అడిగింది. ఇద్దర్లో ఎవరూ బైటపడలేదు. ఏదో జరిగితే తప్ప వాళ్ళ సమస్య తీరదని వదిలేసింది సుధ.

క్రిష్ణ మేనత్త వాళ్ళూరు, నందిని వాళ్ళ ఊరు ఒక్కటే. ఓసారి తిరునాళ్ళలో నందినిని చూసి మనసు పారేసుకున్నాడు. నిజానికి మేనత్త కూతురు ప్రశాంతితో అతనిపెళ్ళని పెద్దవాళ్ళుఅనుకునేవారు. సునందినిని చూశాక ప్రశాంతిని ఆహ్వానించలేకపోయాడు క్రిష్ణ. ఆ విషయం ప్రశాంతితో ముందు చెప్పాడు.

"పోనీ బావా! బతికించావు... ఇది పెళ్ళయ్యాక చెప్పుంటేచచ్చేదాన్ని. అయినా నాకూ బోరే కదా చిన్నప్పటి నుంచి చూస్తున్న మోహాన్నే జీవితకాలమంతా చూడ్డం"అంటూ ఆట పట్టించింది. అప్పట్నించిబావ ప్రేమకావ్యానికి ఆమే శ్రీకారం చుట్టింది.

అవసరం ఉన్నా లేకపోయినా బావ వచ్చిన ప్రతిసారీ నందినిని పిలుచుకువచ్చేది. కావాలని బావ గొప్పలు చెప్పేది. "ఈ సోదంతా నాకెందుకే... నేను డిగ్రీతర్వాత మాస్టర్ డిగ్రీ చెయ్యడానికి మా మావయ్య వాళ్ళూరు వెళుతున్నాను. ఈ కబుర్లన్నీ మరెవరికైనా చెప్పుకో... అంటూ తేల్చేసింది నందిని ఓసారి.

క్రిష్ణఉసూరుమన్నాడు. అతను ఇంటర్‌తోచదువు ఆపేసి వ్యవసాయంలోకి అడుగుపెట్టినవాడు. ఆమె చదువుతప్ప వేరే ఆలోచన లేనట్టు చెప్పేసింది.

లక్కీగా సుధని నందినిఅన్నయ్య భాస్కర్‌కి అడగ

## న్యూ లుక్

తన రాబోయే సినిమా 'బట్టిగుల్ మాస్టర్ చాలు' చిత్రం ప్రమోషన్ పనిలో బిజీబిజీగా గడిపేస్తున్న యామీగౌతమి సరికొత్త అవతారంతో క్యూట్‌గా కనపడుతున్నది. యురికోసం జుట్టు పొట్టిగా కట్ చేసుకున్నది. ఈ సినిమాలో ఇంటెలిజెన్స్ ఆఫీసర్‌గా నటిస్తున్నది. "నాకు పొడవాటి జుట్టంటే వ్యక్తిగా ఇష్టం. నేను ఏడో తరగతిలో ఉండగా ఇంత షార్ట్‌గా కట్ చేసుకున్నాను. ఇది యురి రూపం.

నా పాత్రకోసం షార్ప్‌గా కనపడాలని నా దర్శకుడు చెప్పారు. వ్యానిటీ అవకాశం లేదని చెప్పడంతో మరో ఆలోచన లేకుండా కట్ చేసేశా" అని చెప్పింది.



## ఈసారైనా...

ఎవర్‌గ్రీన్ హీరోయిన్‌గా దశాబ్దానికి మించిపరుగు పెడుతున్న త్రిషకు రెండో ఇన్నింగ్స్‌లో మాత్రం కాలం కలిసిరావడంలేదు. చేసే ప్రతి సినిమాకు ముందస్తుగా హైప్ లభిస్తున్నదికాని, బాక్సాఫీస్‌వద్దమాత్రం బోల్తా పడుతున్నాయి.

బోలెడన్ని ఆశలు పెట్టుకున్న 'నాయకి' తుస్సుమన్నది. పట్టువదలని దీక్షతో లేడీ ఓరియంటెడ్ సినిమాలతో సాగుతున్నది. ఇప్పుడు తాజాగా '96' సినిమా పైన మరోమారు ఆశలపందిరి అల్లింది.

సినిమాలో త్రిష నటన హైలెట్ అంటూ ఎప్పటి మాదిరే హైప్ మొదలయింది.

పైగా తెలుగు రీమేక్ హక్కులు దిల్ రాజుని కొనడంతో మరిన్ని అంచనాలు షికారు చేస్తున్నాయి. త్రిష అదృష్టం ఎలా ఉందో చూద్దాం.

డానికి వచ్చినప్పుడు వాళ్ళ అమ్మాయి నందినిని అడగమని చెప్పాడు క్రిష్ణ

అలా ఉండిపోయిందనుకున్న ప్రేమ వన్నెందుకో అన్నట్టు ముందుకొచ్చి నిలబడింది. వాళ్ళు ఎక్కువసేపు ఆలోచించలేదు. క్రిష్ణ నెమ్మది, అతడు వ్యవసాయం చేస్తున్న తీరుకి వాళ్ళు ముచ్చటపడిపోయారు. ఎక్కువగా ఆలోచించకుండానే, నందినిని అడగకుండానే తాంబూలాలు మార్చేసుకున్నారు.

డేటు కూడా ఫిక్సయిపోయింది. నందిని డిగ్రీ చేతికి వచ్చేసరికి పెళ్ళిపీటలు ఎక్కాల్సివచ్చింది.

ఫస్ట్‌నైట్ ఎంతో ఎగ్జయిట్‌గా ఎదురుచూశాడు క్రిష్ణ. కోరుకున్న స్వర్గం కౌగిట్లోకి రాబోతోందని. నందిని పాలగ్లాసుతో గదిలోకి అడుగుపెట్టింది.

క్షీరసాగర తనయలా మెరిసిపోతూ ఉంది. మల్లెల పరిమళం డామినేట్ చెయ్యాలని ముందుకొచ్చి అతన్ని మోహానాంకితుడ్ని చేస్తున్నట్టుంది.

"రా నని రాలేనని ఊరక అంటావు... రావాలని ఆశలేనిదే ఎందుకు వస్తావు!" అంటూ ఆమె చుబుకాన్ని ఎత్తి అధరాల్ని చటుక్కున ముద్దు పెట్టుకున్నాడు. ఆమె కళ్ళు వాల్చుకుంది. ఆ రాత్రి ఆమె ఒక్కమాటకూడా మాట్లాడింది లేదు. తనువును మౌనంగా అర్పించింది. సిగ్గనుకున్నాడు క్రిష్ణ.

తర్వాత చాలాసార్లు ఆమె కళ్ళలో భావాలకోసం వెతకబోయాడు. కానీ అవి ఎప్పుడూ ఏ భావాలూ వ్యక్తం చెయ్యలేదు. మూసిన కళ్ళపై ముద్దుపెట్టినప్పుడు కాని నాభి చివరి అంచుల్లో ఆట్లాడుతూ చూసినప్పుడు కానీ రెప్పలు విడిపోనేలేదు ఎప్పుడూ.



అతను చేయివేసిన ప్రతిసారీ మంచు మేఘం అవుతోందామె. వదులుకోలేని ప్రేమ అతనిది. తన కౌగిలిలో ఆమె ఎప్పుడు అగ్నిశిఖగా మండుతుందోనని ఆమె అణువణువు వెతుకుతూనే ఉన్నాడు. మార్పులేని మౌనం కాలంతో జతకట్టింది.

పడకఒక్కటైనా తనువులు పంచుకుని మూడేళ్ళు. ఆమెకి అదేం పట్టదు. పిల్లల్ని తమదగ్గర ఉంచి వాళ్ళిద్దర్నీ వెళ్ళిరమ్మన్నారు పెద్దవాళ్ళిద్దరూ. క్రిష్ణ నందినిని తీసుకుని బైక్‌మీద బయలుదేరాడు.

మూడు కిలోమీటర్ల దూరం ఆ ఊరు. పచ్చని పొలాల మధ్యనున్న మట్టి రోడ్డు. గోతుల్లో పడ్డప్పుడు క్రిష్ణని హత్తుకున్నా ఏం పట్టనట్టు కూర్చుందామె. అది హాయి అనుకోవాలో, యాదృచ్ఛికం అనుకోవాలో అర్థంకాని పరిస్థితి అతనిది.

ఊరు తిరునాళ్ళ హడావిడితో వచ్చిన బంధువులతో కళకళ్ళాడుతూ స్వాగతం పలుకుతోంది. అన్నా వదినల్ని చూసి సుధ ఎదురొచ్చి కాళ్ళకు నీళ్ళిచ్చింది. ఇంట్లో వాళ్ళందరూ వచ్చేసి ఉక్కిరిబిక్కిరి చేసేశారు. "వదినా మీరు మా గదిలో ఉండండి" అంది సుధ.

నందిని బ్యాగ్ తీసుకుని గదిలోకి వెళ్ళింది. క్రిష్ణ బావగారితో మాట్లాడుతూ కూర్చున్నాడు. "బావా!" అంటూ సుడిగాలిలా దూసుకొచ్చేసింది ప్రశాంతి.

"నువ్వేం మారలేదే..." క్రిష్ణ కంగారు దాచుకుంటూ నవ్వాడు.

"ఎందుకు మారాలి బావా! వరస మారిందా, పేరు మారిందా! ప్రేమ మారిందా! అన్నీ అలాగే ఉన్నాయి. ఈ ప్రశాంతి కూడా అలాగే ఉంది. నందినితో బోర్ కొడితే చెప్పు నేను రెడీ..." ప్రశాంతి మాటలకి అందరూ వేళాకోళంగా నవ్వుకున్నారు.

క్రిష్ణమాత్రం ఇబ్బందిగా గుమ్మందగ్గర నిల్చున్న నందినివైపు చూశాడు. ఆమె తనకేం సంబంధం లేనట్టు మౌనంగా చూస్తోంది. "నందినీ! మీ ఆయన్ని ఇక్కడున్నన్ని రోజులు నాకు వదిలేస్తావా!" కవ్విస్తూ అడిగింది. నందిని మాట్లాడకపోయేసరికి క్రిష్ణ చేయి పట్టుకుని లేవదీసింది.

"బావా! బైక్‌మీద మనిద్దరం తిరిగి చాన్నాళ్ళయింది...రా బావా! మా ఇంటికెళదాం" అంది చనువుగా గారాలుపోతూ ప్రశాంతి.

"అన్నయ్య ఇప్పుడే కదా వచ్చింది. ఇద్దరూ కలిసి తర్వాత వస్తారులే..."

"అదేం కుదరదు. నువ్వు మీ ఆడబిడ్డని ఉంచుకో. నేను మా బావని తీసుకుపోతున్నాను... రా బావా!" చెయ్యి గట్టిగా పట్టుకుని గుంజింది ప్రశాంతి.

బైక్ తాళాలు తీసుకున్నాడు క్రిష్ణ. ప్రశాంతి నందినిని చూసి అల్లరిగా నవ్వింది. నందిని అలాగే చూస్తూ నిలుచుంది. క్రిష్ణవెనక బైక్‌మీదకూర్చునిఅందరికీ టాటాచెప్పి కుడిచేతిని అతని నడుము చుట్టూ తిప్పింది ప్రశాంతి. సుధ నందిని వైపు చూసింది.

మొదటిసారిగా తనకు సంబంధించిన

భాగాన్ని ఎవరో బలవంతంగా లాక్కుపోతున్నఫీలింగ్ మనస్సులో ఎంత దాచుకోవాలన్నా దాగక కళ్ళలో ప్రత్యక్షమయ్యింది. గుండె ఎందుకో దిగులుగా కొట్టుకుంది. ఆమెకి అర్థంకాని నొప్పి.

"వదినా! రా! నాకు వంటలో సాయం చేద్దూగాని" అంటూ పిల్చింది సుధ.

ఇద్దరూ వంట చేస్తుండగా భాస్కర్ పిలిచాడు. సుధ రూమ్‌లోకి వెళ్ళొచ్చింది.

"అన్నయ్య ఎందుకు పిలిచాడు..." అనడుగుతూ ఆగిపోయింది. సుధ చెక్కిళ్ళు కంది ఉన్నాయి. ఆమె ముంగురులు చెదిరిఉన్నాయి. పెదవులుతడిని దాచుకోలేనట్లు అవస్థపడుతున్నాయి. కళ్ళు ఏం చెప్పాలో అర్థంకాక సిగ్గుతో దొంగచూపులు చూస్తున్నాయి.

భాస్కర్‌మళ్ళీపిలిచాడు. "నేను చూసుకుంటాను... నువ్వెళ్ళు" అంది నందిని.

ఆమె అలా అనగానే వెళ్ళిపోయింది సుధ. వంట పూర్తిచేసి తన గదిలోకి అడుగు వెయ్యబోయి ఆగిపోయింది నందిని. గది తలుపులు ఓరగా వేసి ఉన్నాయి. భాస్కర్ భార్యని వదల్లేనట్లు గట్టిగా కౌగిట్లో బంధించాడు.

"వదలండి బాబూ! ఇన్నాళ్ళయినా ఇదే అల్లరి. ఈ గది మీ చెల్లికి బావకి ఇచ్చేశాము. రెండు రోజులు బుద్ధిగా ఉండాలి తమరు" అంటూ అల్లరిగా అతని ముక్కుపట్టి లాగింది సుధ.

చటుక్కున ఆమె అధరాల్ని చప్పరించి వదిలాడు భాస్కర్. ఆ దృశ్యం చూడగానే ఒంట్లో ఏదో వేడి ఆవిర్లు కమ్ముకుంటూ బయటికి వచ్చేసింది. రక్తం నరనరాల్లో గజిబిజిగా పరుగెత్తుతున్నట్టు నిలబడలేకపోయింది నందిని.

"మైగాడ్ రెండురోజులు... ఆలోచించు స్లీపింగ్ పిల్స్ అవసరమేమో... అసలే అలసిపోతున్నావు..." ఆమె ముంగురులతో ఆటాడుకుంటూ మరింతగా దగ్గరకు లాక్కున్నాడు భాస్కర్.

"అబ్బా! వదలండి మీ స్లీపింగ్ పిల్స్ మీ దగ్గరే ఉంచుకోండి. నందిని చూస్తే బాగుండదు" అంటూనే భర్తకి మరింత చనువు ఇస్తోంది సుధ.

సునందిని పనున్నట్టు సన్నజాజుల పందిరి దగ్గరకు పరుగెత్తి మొగ్గలు కోస్తూ తనలో కలిగిన అలజడిని దాచుకునేందుకు ప్రయత్నిస్తోంది.

తల్లి ఏదో అడుగుతుంటే ఆ... ఊ... అంటూ పరధ్యాసగా సమాధానాలిస్తోంది. రాత్రయినా క్రిష్ణ రాలేదు. ప్రశాంతి వచ్చింది. నైట్‌డ్రెస్ ఇవ్వమన్నాడు అంటూ "బావ లేకుండా ఈ రాత్రి ఉండగలవుకదా" నందిని కళ్ళలోకి చూసి నవ్వింది ప్రశాంతి.

మాట్లాడకపోయేసరికి ప్రశాంతి తిరిగి అంది- "కొంచెం కష్టమే బావ చేతిపట్టు అలాంటిది. ఓసారి ఏం జరిగిందో తెలుసా!" అంది.

నందిని మౌనంగా వింటోంది.

"దోరజామకాయ కోయడానికి కాళ్ళు ఎత్తి ప్రయత్నిస్తుంటే ఎప్పుడు వచ్చాడో బావ అమాంతం పైకి ఎత్తి ఇప్పుడు కోసుకోవే ఎన్ని కావాలంటే అన్నిఅన్నాడు. ఇంకేం కోస్తాను... పదహారేళ్ళ వయస్సు. ఒళ్ళంతా వేడి సెగ.

బావ చేతుల్లో ఏం మాయ ఉందో గాని... ఇప్పటికీ తల్చుకుంటే ఒళ్ళంతా ఏదోలా అయిపోతుంది. నువ్వు చెప్పు నీకెలా అన్పిస్తుందీ! అప్పుడప్పుడూ..."

నందిని ముఖం ఎర్రబడింది. గదిలోంచి నైట్‌డ్రెస్ తెచ్చి ఇచ్చి ఇంక వెళ్ళు అన్నట్టు చూసింది. ప్రశాంతి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. రేయి కరుగుతూ ఉంది.

సునందినికి నిద్రరావడం లేదు. గదిలో అన్నా వదినల మధ్య జరిగిన దృశ్యం.

ప్రశాంతి క్రిష్ణ గురించి చెప్పడం, చెప్పలేనంత అలజడి మదిలో. ఏనాడో దూరం అయ్యింది తనువు.. అయినా క్రిష్ణ పక్కన లేకుండా నిద్రపోనంటోంది.

అతని ఫీలింగ్స్‌తో తన ఫీలింగ్స్ కలవలేదు.ఎందుకో తన హృదయాన్ని కదిలించలేకపోయాడు. దూరం సుదూరం అయిపోయింది ఎందుకు? ఇద్దరి మధ్యా ఇష్టమో అయిష్టమో తెలీదు.

అతను తన ప్రాపర్టీ. ఎక్కడికీ పోడనుకుంది. ప్రశాంతి అలా ఎలా... అటు తిరిగి ఇటు తిరిగి ఎప్పటికో నిద్రపోయింది.

క్రిష్ణ, ప్రశాంతి ఒకరితో ఒకరు చనువుగా... భరించలేని బాధ... "ఏమైంది నందినీ!" క్రిష్ణ ఎదురుగా. ప్రశాంతి లేదు అతనిపక్కన.

"ప్రశాంతి చాలా గొడవ చేసింది. వెళ్ళనివ్వనని నువ్వు గుర్తువచ్చి వచ్చేశాను..." అర్ధరాత్రి అతని అపాలజి మనస్సుకు ఊరటగా అన్పించింది.

హృదయం కరిగి కన్నీళ్ళ రూపంలో బయటికి వచ్చేస్తున్నాయి.

"ఏమైంది..." కంగారుగా అడుగుతున్న అతన్ని ఉప్పెనలా కమ్మేసింది.

ఆమె పెదవులపైన ఉన్న కొన్ని తేనెచుక్కలు చనువుగా అతని పెదవులకు తాకాయి.

చూడకూడదు అనుకుంటూనే ఆమె కళ్ళలోకి చూశాడు క్రిష్ణ. మధు ఒలకబోస్తూ ఆహ్వానపత్రిక అందిస్తున్నాయవి. ఇంకేం అతను చాంపియన్‌గా మారి ఆట మొదలుపెట్టేశాడు.

అతని బ్యాటింగ్‌కి సై అంటూ బౌలింగ్‌కి సిద్ధమైపోయాయి ఆమెలోని అందాలు.అతని పరిష్వంగంలో ఆమె తనువు అగ్నిశిఖలా రగులుతోంది.



రైతులు చెరకు పండించి మధుమేహం పెంచవద్దు. కూరగాయలు పండించి ఆరోగ్యం పెంచండి. -యోగి ఆదిత్యనాథ్, యు.పి. సి.ఎమ్.

నా ఆశ ఆశయంపైనేగాని సి.ఎమ్. పదవిపై కాదు.
-పవన్‌కళ్యాణ్, జనసేన అధినేత

## ఎగ్జయిటింగ్ బ్రాండ్

'ధడక్'తో కుర్రకారుకు గుబులు రేపిన తాజా అందాలబొమ్మ జాన్వీకపూర్ తొలిసారిగా తన బ్రాండ్‌కు సంతకాలు చేసింది. నైకా కాస్మొటిక్‌కు జాన్వీ బ్రాండ్ అంబాసిడర్.

"ఈ బ్రాండ్‌తో అసోసియేట్ కావడం ఓ గౌరవంగా, ఎగ్జయిటింగ్‌గా ఫీలవుతున్నాను. ఎందుకంటే ఇది మేకప్‌కు సంబంధించినదికదా.

ఈ బ్రాండ్ జర్నీ చాలా ఇన్‌స్పైరింగ్‌గా ఉంది. పూర్తిస్థాయి మోడల్స్‌కాకుండా సాధారణ అమ్మాయిల గురించి వాళ్ళు చెపుతారు. అందుకే ఈ బ్రాండ్‌ను నేను ఎంచుకున్నా" అని చెప్పింది.





Courtesy : GRUHASOBHA

# ఓరల్ హెల్త్

మంచితనానికి నోటినుంచి వచ్చే పలుకులు ప్రధానంగా వుంటాయి. అలాగే పూర్తి శారీరక ఆరోగ్యానికి నోటి ఆరోగ్యం ప్రతిబింబంగా వుంటుంది. పళ్ళగురించి జాగ్రత్త వహించడం అంటే మంచి నవ్వు, తాజాశ్వాస మాత్రమే కాదు.

పూర్తిస్థాయి ఆరోగ్యానికి,నోటిఆరోగ్యానికినడుమ అనేకరకాలుగా సంబంధం వుంటుందనేది తాజా అధ్యయనాల సారాంశం. చాలా విభాగాలకు సంబంధించి ఎటువంటిలింకు ఉందనేదిఇంకా స్పష్టంగా తెలియకపోయినప్పటికీ నోటి స్థితిగతులు పూర్తిస్థాయి శారీరక ఆరోగ్యానికిసన్నిహితంగా లింకైవుంటాయన్నది మాత్రం పూర్తి వాస్తవం.

**డయాబెటిస్ :** పెరియోడాంటిటిస్ లేదా చిగుర్లవ్యాధి గలవారికి టైప్2 డయాబెటిస్ అవకాశాలు ఎక్కువగా ఉంటున్నట్లు వైద్యులు గుర్తిస్తున్నారు.

పెరియోడాంటల్ వ్యాధి ఎక్కువగా ఉన్నవారిలో టైప్ 2 డయాబెటిస్ వచ్చే అవకాశాలు చిగుర్ల వ్యాధి తక్కువ లేదా అసలు లేనివారితో పోల్చితే అధికంగా ఉన్నట్లు వారు పేర్కొన్నారు.

**గుండె సంబంధిత వ్యాధులు :** గుండెకుసంబంధించి ముందుగాఎటువంటివ్యాధులూ లేనివారిపై పరిశోధనలు జరిపినప్పుడు, పెరియోడాంటల్‌బ్యాక్టీరియాకు సంబంధించిన విశ్లేషణలు జరిపారు. వయస్సు, జెండర్, స్మోకింగ్ వంటి రిస్కు కారణాలను పక్కనపెడితే, గుండె జబ్బులకు, నోటి ఆరోగ్యానికి నడుమ ఎక్కువ లింకు ఉంటున్నదని పరిశోధకులు అధ్యయనాల్లో గుర్తించారు. నములుతున్నప్పుడు కొద్దిస్థాయి బ్యాక్టీరియా రక్తస్రావంలోకి ప్రవేశిస్తుంది. ఇన్‌ఫెక్షన్‌గల నోటిలోని చెడు బ్యాక్టీరియా రక్తనాళాల్లోకి ప్రవేశించి, హానికర బ్లాకేజీలకు కారణం కావచ్చునేది నిపుణుల వివరణ.



## » గర్భిణీలకు సమస్యలు

**21** నుంచి 24 వారాల గర్భవతుల్లో చిగుర్ల వ్యాధి కనుక తలెత్తితే, మిగతా వారితో పోల్చితే 37 వారాలకంటే ముందుగానే ప్రసవం అయ్యే అవకాశాలుంటాయనేది ప్రస్తుత పరిశోధనల సారాంశం. అలాగే చిగుర్ల ఆరోగ్యం సరిగ్గా లేనప్పుడు శిశువుల బరువు కూడా బాగా తక్కువగా ఉంటుంది.

శరీరంలో, నోట్లో చాలారకాల బ్యాక్టీరియా వుంటుంది. వాటిలో చాలాభాగం హానిలేనివే. సాధారణంగా శారీరక సహజ రక్షణ ప్రక్రియ, నోటి ఆరోగ్య పరిరక్షణ చర్యలు అంటే క్రమం తప్పకుండా రెండుపూటలా బ్రెషింగ్, ఫ్లాసింగ్‌లు హానికర బ్యాక్టీరియాను నియంత్రణలో ఉంచుతుంటాయి.

నోటి పరిశుభ్రత పాటించకపోతే బ్యాక్టీరియా స్థాయిలు పెరిగి పండ్లు పుచ్చిపోవడం, చిగుర్ల వ్యాధులు వంటి నోటి ఇన్‌ఫెక్షన్లకు కారణం అవుతుంటాయి. అంతేకాకుండా డీ కంజస్టెంట్స్, యాంటీ హిస్టమిన్లు, పెయిన్ కిల్లర్స్, డైయూరెటిక్స్, యాంటీ డిప్రెసెంట్స్ వంటి మందులు వాడుతున్నప్పుడు లాలాజలం స్రావం తగ్గుతుంటుంది.

ఈ లాలాజలం ఆహారపదార్థాలను శుభ్రపరిచి, నోట్లోని బ్యాక్టీరియా ఉత్పత్తి చేసే ఆమ్లాలను న్యూట్రలైజ్ చేస్తుంటుంది. బ్యాక్టీరియా మరింత పెరిగి వ్యాధు లకు కారణం కాకుండా పరిరక్షిస్తుం టుంది. నోటి అనారోగ్యం ఇతర అనా రోగ్యాలకు ఏ విధంగా అయితే దారితీస్తుందో, ఇతర అనారోగ్యాలు కూడా నోటి ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తుం టాయి.

డా॥ నల్లూరి శశిధర్
MDS, ENDODONTIST
Cell : 94403 13066

**డయాబెటిస్ :** ఇన్‌ఫెక్షన్‌లనుంచి శరీరం తట్టుకునే శక్తి సన్నగిల్లుతుంది. దాంతో చిగుర్లకు అనారోగ్యం కలిగే అవకాశాలుంటాయి. డయాబెటిస్‌గల వారిలో చిగుర్ల వ్యాధులు తరచూవస్తుంటాయి. అధిక స్థాయిలో వుంటాయి.

రక్తంలో చక్కెరస్థాయిల నియంత్రణకూడా కష్టం అవుతుంది. క్రమం తప్పని పెరియోడాంటల్ పరిరక్షణ డయాబెటిస్ నియంత్రణ స్థాయిలను మెరుగ్గా ఉంచుతుంది.

- హెచ్.ఐ.వి./ఎయిడ్స్ గలవారిలో నొప్పితో కూడిన లీజన్లు సర్వసాధారణం.
- ఎముకలను పెళుసుబార్చే ఆస్టియోపోరోసిస్ పెరియోడాంటల్ ఎముకల బలహీనతతో, పళ్ళు ఊడిపోవడంలో లింకయివుంటుంది. ఆస్టియోపోరోసిస్‌కు వాడే మందులు దవడలోని ఎముకలకు హానిచేయగల చిన్నపాటి రిస్క్ కలిగివుంటాయి కూడా.
- అల్జీమర్స్ వ్యాధిగలవారిలో నోటి ఆరోగ్యం దెబ్బతినే అవకాశాలుంటాయి. ఆహార పానీయాలు సక్రమంగా లేకపోవడం, రుమటాయిడ్ ఆర్థ్రైటిస్, తల, మెడ, క్యాన్సర్లు, ఇమ్యూన్ డిజార్డర్లు నోరు పొడిబారిపోడానికి కారణమవుతుంటాయి.

## » ఏం చేయాలి?

నోటిశుభ్రత విషయంలో ప్రత్యేక శ్రద్ధ వహిస్తుంటే అనారోగ్యాల నుంచి పరిరక్షించుకోవచ్చు.

- పళ్ళను ఫ్లోరైడ్ ఆధారిత టూత్ పేస్ట్‌తో మాత్రమే కాకుండా, బేకింగ్ సోడా ఆధారిత టూత్‌పేస్ట్‌తో కూడా బ్రెష్ చేసుకుంటుండాలి.
- స్మోకింగ్‌కు దూరంగా వుండాలి. స్మోకింగ్‌వల్ల చిగుర్లు, పంటిఆరోగ్యం దెబ్బతింటుంది.
- గ్రీన్‌టీ తాగాలి. గ్రీన్‌టీపళ్ళు, చిగుర్ల ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుంది. ఇన్‌ఫ్లమేషన్ తగ్గిస్తుంది. నోట్లో మరింత ఆల్కలైన్‌కు దోహదపడి, క్యావిటీలకు కారణమయ్యే బ్యాక్టీరియా పెరగకుండా అడ్డుకుంటుంది.
- క్యాల్షియం, ఫాస్ఫరస్, మెగ్నీషియం, విటమిన్ కె, విటమిన్ డి అందించే పూర్తిస్థాయి, పోషకాలతో కూడిన పదార్థాలు తింటుండాలి.

ఆకుకూరలు, నట్స్, గింజలు, ఛీజ్, పెరుగు, బీన్స్, పుట్టగొడుగులు, చేపలు, గుడ్లు, ఆర్గాన్ మీట్స్ బాగా మేలుచేస్తాయి. ప్రతిరోజూ కొంత సూర్యరశ్మి శరీరానికి తగలాలి.

- ప్రతిరోజూ తాజాపండ్లు, కొన్ని కూరగాయలను యథాతథంగా తింటుండాలి. ఆహార పానీయాలనుంచి అదనపు చక్కెరలు లేకుండా జాగ్రత్త వహించాలి.
- అదనపు శారీరక కొవ్వు అనారోగ్యాలకు హేతువు. ఆహారంలో పాలకూర, నట్స్, గుడ్లు, పూర్తిస్థాయి ధాన్యాలు, సీఫుడ్, మీట్, సోయా మేలుచేసేవి. అన్నింటికంటే ప్రధానమయినది క్రమంతప్పని వ్యాయామాలు. ఇవి పెరియోడాంటల్ వ్యాధులనుంచి పరిరక్షిస్తాయి.



# సత్యాన్వేషణ

## వామనావతార ప్రార్థన

**భవబంధన హర వితతమతే**
**పాదోదక, నిహతాఘతతే**
**పటువటువేష మనోజ్ఞ! నమో**
**భక్తం తే పరిపాలయమామ్**

విశాలమైన బుద్ధిగలవాడవై నీ పాదపద్మములయందు జన్మించిన గంగానదిచే అందరి పాపాలను హరించివేసి, సంసారబంధమునుండి విడిపించుచూ, దానవేంద్రుడైన బలిచక్రవర్తిని పాతాళానికి అణగద్రొక్కుటకై మనోహరమైన బ్రహ్మచారి రూపమును ధరించినవాడని ప్రసిద్ధి పొందిన శ్రీ మహావిష్ణో! నీకు నమస్కారము. భక్తుడనైన నన్ను రక్షింపుము. ❐

## వామన జయంతి

**(తేదీ: 21.9.2018)**

బలిచక్రవర్తి చక్కని యాగాన్ని ఏ విధమైన లోటూ లేకుండా చేస్తూంటే శ్రీహరి అతని దగ్గరకి వామన అవతార రూపంలో వెళ్ళాడు.

మూడడుగుల్ని యాచించాడు. ఈ కథ మనకి తెలుసు. ఏ అపకారాన్నిలోకానికి బలిచక్రవర్తి చేస్తున్నాడనే భావంతో శ్రీహరి ఇలా అతణ్ని యాచించి అతణ్ణి కింది లోకానికి తొక్కేశాడు? అనిపిస్తుంది పై దృష్టితో చూస్తే.

బలిచక్రవర్తి విష్ణువు అనుగ్రహాన్ని కోరుతూ యాగాన్ని చేసినా, విష్ణుభక్తులైన దేవతలనందరినీ వాళ్ళ రాజ్యాల నుండి పారద్రోలాడు. అది నేరం.

విష్ణువుని సేవించడం అంటే విష్ణు భక్తుల్ని కూడా ఆదరించడం దానిలో ఉండి తీరాలి.

**(విష్ణుప్రసాదాయ వైష్ణవాన్ పరిపూజయేత్).** అది లేని కారణంగా శ్రీహరి బలిని దిగద్రొక్కాడు. ❐

## విష్ణుపరివర్తన ఏకాదశి

**(తేదీ: 21.9.2018)**

సాధారణంగా నిద్రిస్తూన్న వ్యక్తి కొంతకాలమయ్యాక తనకి తానే తనకి తెలియకుండా వెల్లకిలా పడుకోవడమో లేక అప్పటివరకూ పడుకున్న ఆ భంగిమని మార్చుకుంటూ మరోపక్కకి తిరిగి పడుకోవడమనేది ఉంటూంటుంది.

ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు యోగ నిద్రకి ఉపక్రమించిన శ్రీహరి కార్తిక శుద్ధ ఏకాదశికి మేల్కొని తీరాలి.

అయితే ఈ నాలుగు నెలల యోగ నిద్రాకాలంలో సరిగ్గా మధ్య అయిన రెండు నెలల కాలానికి అంటే భాద్రపద శుద్ధ ఏకాదశికి ఆయన పరివర్తనం (మరో పక్కకి తిరగడం) చేస్తాడు కాబట్టి దీన్ని 'పరివర్తన మహోత్సవం', 'పరివర్తనఏకాదశి' అని అంటారు. ❐

## శని త్రయోదశి

**(తేదీ: 22.9.2018)**

శనిగ్రహం అనగానే భయపడాల్సిన అవసరం అసలు ఏమాత్రమూ లేదు. ఆయుష్యాన్ని ఇచ్చేవాడూ, మృత్యువు నుండి రక్షించగల శక్తి ఉన్నవాడూ, ఎవరు నిజమైన మిత్రులో, బంధువులో ఆ విషయాన్ని మనకి మనం గ్రహించుకునేలా- ఓ మంచి కష్టాన్ని కల్గించి- చేసేవాడూ, ఒకసారి తన పీడకి- అంటే తాను పెడుతూన్న బాధకి- దుఃఖంతో కళ్ళనీళ్ళు పెడితే అనుగ్రహించే లక్షణమున్నవాడూ, అనుగ్రహించే లక్షణం కలిగిఉండి, మంచి ఇబ్బందిని నెత్తిమీద పెట్టి ఇక అయిపోయాననుకున్న దశలో కష్టాన్ని తొలగించి బయటపడేసేవాడూ శని. ఈయనకి వాహనం కాకి కాదు- గ్రద్ద. ఈయన శరీరచ్ఛాయ నలుపు కాదు- ఆకాశపు రంగైన నీలం.

> పుణ్యపురుషులు ఇతరులకోసం జీవిస్తారు. జ్ఞాని ఇతరులకోసం తను తానే అర్పించుకుంటాడు.

ఈయన దశలో వ్యక్తికి శని పీడా కాలం పందొమ్మిది సంవత్సరాలు. మంచి అనుభవసారాన్ని ఉచితంగా అందించగల నేర్పున్నవాడు. ❐

## శని దానం

నువ్వులనూనె గింజల పత్తి, నల్ల గొడుగు, నల్ల చెప్పులు, నల్లని తుండు వాడుకునే విధంగా ఉన్న ఇనుప వస్తువు వీటితోపాటు ఇనుముతో చేయబడిన గిన్నె (బూరెలమూకుడు, అట్లకాడ...) వంటివాటిని దానంగా ఈయాలి. ❐

## అనంతపద్మనాభ వ్రతం

**(తేదీ: 24.9.2018)**

అనంత అంటే 'ముగింపు లేని' అని అర్థం. పద్మనాభుడంటే తన బొడ్డు నుండి ప్రపంచానికి కారణమైన పద్మాన్ని సృష్టించగలిగినవాడని అర్థం.

ఆ అనంతపద్మనాభ వ్రతమనేది ఎందరికో కుటుంబంలో సంప్రదాయంగా కన్పిస్తూ ఉంటుంది.

'వ్రత్యతే ఇతి వ్రతమ్' అన్నారు కాబట్టి అలా శ్రీ విష్ణుసహస్రనామాలని సామూహికంగా చదువుతూ చక్కగా భక్తిశ్రద్ధలతోచేసుకునే వ్రతం 'అనంత పద్మనాభ చతుర్దశీ' వ్రతం. ❐

## మహాలయపక్ష ప్రారంభం

**(తేదీ: 25.9.2018)**

మన శ్రేయస్సుకోసం తపించి పరమపదానికి వెళ్ళిన పెద్దలే పితృదేవతలంటే. వాళ్ళని తలుచుకుని నూతన వస్త్రాలని భోజనంపెట్టాక దానమిచ్చి ఆ పురోహితుని ఆశీర్వచనాన్ని పొందాలి.

భాద్రపద బహుళ పాడ్యమి నుండి (25.9.2018) పదిహేనురోజులపాటు ఈ ఉత్సవాలు జరుగుతాయి కాబట్టే దీన్ని పితృపక్షాలు- లేదా మహాలయ అమావాస్య ప్రారంభపు రోజుగా నిర్ణయించారు పెద్దలు.

ఈ 15 రోజుల్లోనూ-ఏ కుటుంబ వ్యక్తులు లోగడ ఏ తిథిలో మరణించారో ఆ తిథి- ఈ మహాలయపక్షపు ఐదు రోజుల్లో ఏ తిథినాడో గమనించి వాళ్ళ పేరిట ఆ రోజున ఐదుగురిని పిలిచి మంత్రపూర్వకంగా అన్నాన్ని పెట్టడం మహాలయపక్షమంటే.



# ఎప్పుడిది అప్పుడే

రాత్రి పడుకునే ముందు చాలా విషయాలు గుర్తుకువస్తాయి.ఉదయం లేవగానే అవన్నీ చెయ్యాల్సిన పనులుగా మనసులో అనుకుంటారు. తెలవారుతుంది. పగలంతా బిజీబిజీగా గడిచి పోతుంది. తిరిగి రాత్రి పడుకునే ముందు ఆలోచించు కుంటే నిన్న అనుకున్న పని ఒక్కటికూడా చేసినట్టుం డదు. అది చాలామందికి కలిగే అనుభవమే.

ఎందుకు ఆ పనులు ముగించలేకపోయారు. సమయం కుదరకనా! లేక ఆ పనులు చెయ్యటానికి తగిన శక్తియుక్తులు లేకనా! డబ్బు అందుబాటులో లేకనా! ఇలా ఎన్ని రకాల కారణాలు అనుకున్నాఅవేవీ అసలు కారణం కాదన్న సమాధానమే వస్తుంది.

మరి ఎందుకు అనుకున్న పని అనుకున్నట్టుగా చెయ్యలేకపోయాము? అంగీకరించటానికి వెంటనే ఇష్టపడరు కాని మనసులో అందరికీ తెలిసిన కారణం వల్లనే ఆ పనులు చెయ్యలేకపోయివుంటారు. ఆ కారణం ఏమిటంటే వాయిదావేసే మనస్తత్వం.

ఏదో చెయ్యాలనుకుంటాం.కాని తర్వాత చేద్దాంలే అని వాయిదావేస్తాం. చదువుకునేటప్పుడు చదువును వాయిదావేస్తారు. ఉద్యోగులు చెయ్యాల్సిన పనులు వాయిదా వేస్తారు. గృహిణులు ఇంటి పనులను వాయిదా వేస్తారు. ఏదోఒక అంశాన్ని వాయిదా వేయ టం అనేది దాదాపు 95 శాతంమందిలో కనిపించే జబ్బు. అనుకున్నది అనుకున్నరీతిలో చెయ్యరు. అనుకున్న సమయానికి చెయ్యలేరు.

అసలు పని మొదలుపెట్టకుండానే మరచిపోయే వారు ఒక రకం అయితే, మొదలుపెట్టిన వెంటనే ఆపేసి ఆ తర్వాత చేద్దాంలే అనుకునేవారు మరి కొందరు. 'రేపు తప్పక చేస్తాంగా' అని మనసుకు చెప్పుకుని ఆ రోజుకు చేతులు దులుపుకునేవారు చాలామంది. అయితే వాయిదా వెయ్యటం అనేది పుట్టుకతో వచ్చిన లక్షణం కానేకాదు.

## ఆత్మస్థైర్యం లేకపోవడం

ఒక్కసారి మీ బాల్యంలోకి వెళ్ళండి. ఆనాడు మీరు చెయ్యదలచుకున్నవి ఎంత చక్కగా సమయా నికి చేసివుంటారో గుర్తుతెచ్చుకోండి. పెద్దవాళ్ళు పండుగకు బట్టలు కొంటామని చెప్పి కొనకపోతే ఆ విషయం గుర్తుచేసి ఎంత గట్టిగా ఏడ్చి, అల్లరి చేసి వుంటారో గుర్తుకువచ్చేవుంటుంది.

ఒక ఆటకు వెళ్ళాలన్నా,మరొకదానికి వెళ్ళాలన్నా 'వద్దులే రేపు చేద్దాం' అని ఒక్కసారి కూడా అనుకుని వుండరు. ఔను... మనందరం అలా జీవితం ప్రారం భించినవారమే. ప్రారంభంలో ఎవరికీ ఎటువంటి చెడు అలవాట్లూ వుండవు.

క్రమంగా ఎదుగుదలతోపాటు ఒక్కొక్కటి చెడు అలవాటు అవుతుంటుంది. అదిగో సరిగ్గా అటువంటి చెడు అలవాటే పనులు వాయిదా వేయటం. అది కూడా అకారణంగా వాయిదావేయటం.

వాయిదా మనస్తత్వం ఏర్పడటానికి పలుకార ణాలు వుంటాయి. వాటిలో ఒకటి ఆత్మస్థైర్యం లేకపోవటం. తాను ఆ పనిచెయ్యలేనన్న అపనమ్మకం, చేసి విఫలమయ్యాననిపించుకోవటం ఇష్టం వుండదు. కాబట్టి ఏదోక విధంగా అసలు ఆ పని చెయ్యకుండా వాయిదా వేసుకుంటూపోతారు.

ఇది ఒక విధమైన పలాయనవాదం. ఆత్మస్థైర్యం లోపించినప్పుడు ఇటువంటి వాయిదా పద్ధతి అల వాటవుతుంది. సమర్థత కొరవడటం మరో కారణం. తమ పనులమీద తమకు అదుపు కొరవడటం వీరి లక్షణం. పనిచేయాలని తెలుసు.

పని ముగించాల్సిన గడువు తెలుసు. కాని పని ప్రారంభించరు. ఆలోచనను వాస్తవం చెయ్యటానికి మధ్యవున్న ఎడాన్ని అధిగమించలేకపోతుంటారు.

వాయిదావేసే మనస్తత్వంమీద జరిపిన పలు అధ్య యనాలలో తేలిన విషయం అది కొందరి మనస్తత్వ మని, మరికొందరు సులభంగా ఒత్తిడికి గురవటమని తేలింది. ఒత్తిడి పెరిగితే కాని పనిలోకి దిగరు.

అది వారి మనస్తత్వం. నెత్తిమీదికి వచ్చినప్పుడే స్పందిస్తారు. అప్పటివరకు 'చూద్దాంలే' అనేరీతిలో నింపాదిగా వ్యవహరిస్తారు. ఇలా చివరిక్షణంవరకు చెయ్యవలసిన పనులను వాయిదావేసినందున చివ రిలో ఆదుర్దా, ఒత్తిడి వారికి పెరుగుతాయి, వారి మీద ఆధారపడినవారికి అధికమవుతాయి.

ముఖ్యమైన పని ముగించాల్సిన సమయం దగ్గర పడుతున్నకొద్దీ కనిపించని ఒత్తిడి మానసికంగా అనుభవిస్తారు. దీనివలన శరీరంలో కార్టిసాల్ స్థాయి అధికమవుతుంది. కార్టిసాల్ హార్మోన్ ప్రభావాన ఆదుర్దా అధికమై, నిద్రపోలేకపోతారు.



Courtesy : OUTLOOK BUSINESS

## సమయపాలన అవసరం

పని ప్రారంభించగానే పలురకాల సందేహాలు, వ్యతిరేకభావాలు చెలరేగి ముందుకు వెళ్ళనియ్యవు. ప్రతి అడుగును సందేహాత్మకంగాచేసి వెనక్కి లాగుతుంటుంది మనసు. దానిని వదిలించుకోగలిగితే వాయిదా ఆలోచనలు దరిచేరవు.

'ఇది నా పని', 'నేను చెయ్యగలను', 'నేను ఎంచుకున్న పని', 'దీనిని ముగించి ఒక గుర్తింపు తెచ్చుకుంటాను' అని మనసులో ఎవరైతే పదేపదే అనుకుంటారో, వారిలోని సందేహాలు వెనక్కిపోతాయి. పనిమీద ఉత్సాహం వస్తుంది.

పనిలో సాధికారత సాధిస్తారు. ఇతరులనుండి అందుకునే 'మెప్పు' పనిలో ఉత్సాహం, సమయానికి ముగించే నేర్పు రెండూ తెస్తాయి.

పనిచేసుకునేవారిని పాడుచేసే తోటివారుంటారు. దృష్టిని మరల్చే ఇతర అంశాలూ వుంటాయి. అటువంటివాటిని వదిలించుకోవటం అవసరం. పనిలో వుండగా సోషల్ మీడియా జోలికి వెళ్ళను.

పని చేస్తున్నప్పుడు పర్సనల్ మెయిల్స్ చూడను. ఫేస్‌బుక్ గొడవ పట్టించుకోను అనే మాటకు కట్టుబడిన వారికి పనులు ఇట్టే ముగుస్తాయి.

ఎంత సమయం వాటివల్ల వృధా అవుతుందో తెలుసుకోరు. స్నేహితులతో కబుర్లకు ప్రత్యేకంగా సమయం కేటాయించుకోండి.

ఎప్పుడు పడితే అప్పుడు మాటలు వద్దు. ఇది సమయ క్రమశిక్షణ. సమయపాలన వుంటే పనులు 'డెడ్‌లైన్'లోపే పూర్తవుతాయి.

వాయిదా అనే పదమే దరిచేరదు. వాయిదా మనస్తత్వం చక్కదిద్దుకోలేనంత చెడు అలవాటు కాదు. ఎన్నో ఇతర దురలవాట్లను అధిగమించిన వారు ఈ వాయిదామనస్తత్వం వదిలించుకోలేరా! కావాల్సింది వదిలించుకోవాలన్న ఆలోచన. అది మొదలైతే ఇక పనులన్నీ చకచకా చేస్తారు. ◆

అకారణంగా తలనొప్పి, శరీరనొప్పులు అనుభవిస్తారు. ఎవరిలో అయితే అధిక రక్తపోటు, గుండె సంబంధిత ఇబ్బందులు వున్నాయో వారిలో వాయిదా మనస్తత్వం ఎక్కువగా వుండటం పరిశోధకులు గమనించారు. ఆత్మస్థైర్యం తక్కువగా వుంటే వాయిదా మనస్తత్వం వస్తుంది.

దీనివల్ల ముగించాల్సిన సమయానికి పని ముగించలేరు. దాని ప్రభావాన తాను చేతకానివాడినన్న ఆలోచనలు, తప్పు చేస్తున్నాననే భావన కలిసి ఆత్మస్థైర్యాన్ని కుంగదీస్తాయి.

### పనిపై అవగాహన

చేయవలసిన పనిగురించి పూర్తి అవగాహన వుండదు. పని ఎలా ముగించాలి! ఫలితం ఎలా వుంటుంది! అనే ఆలోచనలు వెంటాడుతుంటాయి. దీనివల్ల ఇటువంటి పని మరెక్కడన్నా జరిగిందా!

వారి ఫలితాలు ఎలావున్నాయి! అనేవి తెలుసుకుందామనుకుని ఇంటర్నెట్‌లోకి వెళతారు. ఫ్రెండ్స్‌కి మెసేజ్‌లు పెడతారు.

గూగుల్‌లో వెతుకుతారు. అలా వెతకటంలో అసలు విషయంవదిలి కొత్తవాటివైపుకు, ప్రస్తుతం చెయ్యాల్సిన పనికి అసలు సంబంధంలేని అంశాలు వెతకటంలోకి పడతారు.

దీనితో రెండు, మూడు గంటలు వృధాగా గడిపేస్తారు. వెనక్కితిరిగి చూసేసరికి ఆ పని ముగించాల్సిన గడువుదగ్గరపడుంటుంది. ఇక కంగారు. తిండి, నిద్రమానేసి అప్పుడు ఆ పనిచేస్తారు.

విశ్రాంతి లేకుండా చెయ్యటంలో ఆరోగ్యం చెడుతుంది. తప్పులు పెరుగుతాయి. అలా ఒకదానిలో నుండి మరోదానిలోకి, కిందికి దిగజారటమే తప్పించి పైకి ఎదగటం కనిపించదు.

ఈలోగా ఒత్తిడి ప్రభావం మన మనసు, శరీరం రెండూ దెబ్బతింటాయి.శారీరక అనారోగ్యాలలో ఎసిడిటీ, రక్తపోటు పెరగటం, నిద్రలేమివంటి అంశాలు, ఆ ఒత్తిడినుండి బయటపడేందుకు సిగరెట్, మత్తు పానీయాలువంటి కొత్త దురలవాట్లు వస్తాయి. ఇవి ఆరోగ్యాన్ని మరింత దిగజారుస్తాయి.

వాయిదావేసే మనస్తత్వం నుండి కడుపులో అల్సర్‌లు వస్తాయి. అంటే నమ్మలేరు చాలామంది. సమస్య ఒకచోట, దాని ప్రభావం శరీరమంతటా పడుతుందని తెలుసుకోవాలి. ఆరోగ్యం చెడి, రూపం మారిపోతుంది. పనిలో సమర్థత తగ్గుతుంది. ఆఫీసులో గుర్తింపు దిగజారుతుంది.

ఒక జారుడు మెట్టుమీద కాలువేస్తే అలా గబగబా జారి కిందపడినటువంటిదే వాయిదా మనస్తత్వంలోని అనుభవం కూడా.

వాయిదా మనస్తత్వానికి ఎవరి కారణం వారిదే. అందరిలో ఒకలాగానే వుండదు. వాయిదా వెయ్యటం వెనకున్న అసలు కారణం ఎవరికి వారు అర్థంచేసుకుంటే దానికి తగినట్టుగా ఆ అలవాటును అధిగమించే ఎత్తుగడలు అలవరచుకోవచ్చు.

మార్పు రావాలనుకునేవారు, వాయిదా మనస్తత్వాన్ని వదిలించుకోవాలనుకునేవారు ముందుగా చెయ్యాల్సింది కొత్త జీవితం ప్రారంభిస్తున్నా, గతం మరచిపోతున్నా అని మనసులో స్థిరపరచుకోవటం. గడచిపోయినది తిరిగిరాదు.

నాటి తప్పులు ఇప్పుడు సరిదిద్దలేరు. ఈ రోజు జరగాల్సినది ఏమిటి, దీనిని నేను ఎలా చెయ్యబోతున్నాను అనేదానిమీద దృష్టి పెట్టాలి.

ఈ రోజు, రేపు, ఆ పైరోజు ఏం చెయ్యాలి, ఆ లక్ష్యాలు ఏమిటనేవి మనసులో స్థిరపరచుకుని, వాటిని చెయ్యటం మీద 'పాజిటివ్' దృక్పథం పెంపొందించుకోవాలి. ఎందుకిలా! అనే ప్రశ్నకు స్పష్టమైన సమాధానం వుండితీరాలి.

### పాజిటివ్ దృక్పథం

ఎందుకు ఆ పని చేస్తున్నాం, ఆ పనిని ఇష్టంగా చేస్తున్నామా! అనే దానినిబట్టి వాయిదాసమస్య పరిష్కారమవుతుంది. తమ మనసుకు నచ్చిన పనులు అతి వేగంగా చేస్తారు.

వాయిదా వేసేవి మనసుకు అంతగా పట్టనివి. కాబట్టి పనిమీద ఇష్టత పెంచుకోవటం అవసరం. ఆ పనిని ఆనందంతో చెయ్యటం ముఖ్యం.

పనితో మంచి బంధం వుంటే పనిలో సమస్యలు వుండవు అనేది సూత్రం. లక్ష్యాలు మరీ భారీవి. మరీ సుదూర లక్ష్యాలు అయితే వాటిని అస్సలు అందుకోలేరు. ఆ లక్ష్యం భయపెడుతుంది. పనిని వాయిదా వేసి పక్కకు వెళ్ళమంటుంది.

మనసులోని పని భయం పోవాలంటే లక్ష్యాన్ని చిన్న చిన్నవిగా విడగొట్టండి. నలుగురిలో కలవలేని వారిలోనూ వాయిదా మనస్తత్వం వస్తుంది. దీని వలన ఇతరుల సహాయం అడగలేరు.

పనిలో ఏర్పడే సందేహాలు తీరవు. నాకు రావటం లేదు మీరు చెప్పండని అడగటం లేదా ఇతరులనడిగి నేర్చుకోవటంలో ఎటువంటి తప్పు లేదు.

పైగా నలుగురితో కలిసి పనిచేస్తున్నప్పుడు ఒకరికొకరు సవాలు విసురుకుని, ముందుగా పని ముగించేందుకు ఉత్సాహం తెచ్చుకుంటారు. అలా కలిసి పనిచేస్తే వాయిదా మనస్తత్వం పోతుంది.

టి.సువర్చల

# సీరియల్

“సర్! మీరు త్వరగా నా రూమ్‌లోకి రావాలి. కిడ్నాపర్ లైన్లో ఉన్నాడు” అని చెప్పింది.

నొసలు విరిచి చిరాగ్గా చూశాడు నిషాంత్. “ఓ షిట్! లైన్లో ఉండటమేంటి? వాడి ఫోన్ కోసమే గదా నేను ఇక్కడ వెయిట్ చేస్తున్నాను” అరిచాడు నిషాంత్.

“అతను నా ఆఫీసు రూమ్ ల్యాండ్‌లైన్‌కి చేశాడు. మీకు కాల్ ట్రాన్స్‌ఫర్ చేయాలని ట్రై చేశాను. కాల్ వెళ్ళటంలేదు. మీరు త్వరగా నా రూమ్‌కొచ్చి కాల్ అటెండ్ చేయండి...”

“డామిట్!” అంటూ వేగంగా ఆమెవెంట బయల్దేరాడు. ఇంతసేపూ రెండోసారి కూడా తన సెల్‌కే ఫోన్‌చేస్తాడని ఎదురుచూశాడు. కాని అంచనాతప్పింది. నైనా టేబుల్‌మీద ఉంది ఓల్డ్ మోడల్ ల్యాండ్ లైన్‌ఫోన్. వేగంగా వచ్చి విసురుగా రిసీవర్ అందుకున్నాడు నిషాంత్. కిడ్నాపర్ లైన్లోనే ఉన్నాడు.

“ఏయ్! నా సెల్‌కి చేయకుండా ల్యాండ్‌లైన్‌కి ఫోన్ చేశావేంటి?” అని ఫోన్ ఎత్తటంతోనే కోపంతో అరిచాడు నిషాంత్.

“హలో నిషాంత్! కూల్ మ్యాన్ కూల్. ఏ ఫోన్‌కి చేస్తే ఏంటి? ఫోన్ చేశానా లేదా అన్నదే ముఖ్యం. మా జాగ్రత్తలు మాకు వుంటాయిగా” అదే గొంతు గరగరలాడింది అవతల.

“అర్ధగంటలో ఫోన్ చేస్తానన్నావ్...”

“వీలుకాలేదు. ఐతే ఏమిటి? ఇప్పుడు చేశాగా”

“నా భార్య ఎలా ఉంది?”

“ప్రస్తుతానికి షీ ఈజ్ సేఫ్ బట్...”

“ఓకే... నీ డిమాండ్స్ ఏంటో చెప్పు”

“పోలీస్ కంప్లయింట్ ఇచ్చావా...? అలాంటి పిచ్చి పనిచేశావంటే ఖచ్చితంగా నీ భార్యని చంపేస్తాను”

“లేదు లేదు. నా భార్యనేం చేయకు. నేను పోలీస్ రిపోర్ట్ ఇవ్వలేదు. నన్ను నమ్ము. నా భార్య సేఫ్‌గా తిరిగి రావాలి. అంతే. చెప్పు. నీకేంకావాలి? డబ్బా...?”

“ఎస్... డబ్బే కావాలి”

“ఎంత?”

“నీ భార్య విలువెంత...? అంత కావాలి”

“ఏయ్! నా భార్య విలువ నా ప్రాణంరా. అలాగని నా ప్రాణాలు ఇచ్చేయమంటావా?”

“నీ బోడి ప్రాణాలు ఎవడికి కావాలిగాని ఎంత ఇస్తావ్ చెప్పు” అనడిగాడు

“పదికోట్లు?”

“నో... చాలదు”

“ఇరవై...”

“ఊహూ...”

“నువ్వే చెప్పు”



3

## జరిగిన కథ

సుమిత్ర చెప్పినట్లుగానే ఆ ఇంట్లో బంధిస్తాడు కశ్యప్. నిజంగా కిడ్నాపర్ చెరలో ఉన్నట్లే అత్యంత సహజంగా నటిస్తుంది సుమిత్ర.

ఆమెను ఫోటోలు తీస్తాడు కశ్యప్. ఆ తర్వాత సుమిత్ర తన భర్తకు ఫోన్‌కు చేస్తుంది, ఎవరో తనని కిడ్నాప్ చేసినట్లు.

నిషాంత్‌కి ఫోన్‌చేసి డబ్బు డిమాండ్ చేస్తాడు కశ్యప్. తన పి.ఎ. నైనా సలహాపై చెన్నై సిటీ పోలీస్ కమీషనర్‌కు ఫోన్‌చేస్తాడు నిషాంత్. క్రైమ్ బ్రాంచ్‌లో పనిచేసే విశ్వాస్, కావ్య ఇద్దరూ సహజీవనం చేస్తుంటారు. పెళ్ళిచేసుకోవడం ఇష్టం ఉండదామెకి. సహజీవనమే బెటర్ అంటుంది.

నిషాంత్ భార్య సుమిత్ర కిడ్నాప్ కేస్‌ను పోలీస్

# డబ్బులేవలికీ ఊలికే రావు

కమీషనర్ వీరిద్దరికీ అప్పజెబుతాడు.

కశ్యప్ భార్య గాంధార, ఆమెకోసం చాలా డబ్బు నష్టపోతాడు. కానీ ఆమెకు భర్త అంటే ప్రేమా, గౌరవం రెండూ వుండవు. భార్యతో గొడవపడి బయటకు వచ్చేస్తాడు. కిడ్నాపర్ ఫోన్‌కోసం ఎదురుచూస్తుంటాడు నిషాంత్.

ఇక జరగబోయేది చదవండి.

"వందకోట్లు"

"నో నో నో... అంత డబ్బు నావద్ద లేదు. ఓ ముప్పైకోట్లు..." అన్నాడు నిషాంత్.

"కుదరదు. ఫైనల్‌గా ఓ మాట చెప్తాను విను. యాభైకోట్లు కావాలి"

"ఓకే. డన్. ఇచ్చేస్తాను. బట్ నా భార్య సేఫ్‌గా తిరిగిరావాలి" అన్నాడు నిషాంత్.

"నువ్వు డబ్బిచ్చిన గంటలోపే నీ భార్య నీ ముందు వుంటుంది. సరేనా? గుర్తుంచుకో. యాభై కోట్లు అన్నీ యూజ్డ్ నోట్స్ కావాలి. కొత్త నోట్లు వద్దు. ఇప్పుడు టైమ్ సిక్స్ థర్టీ కావస్తోంది. నీకు రెండున్నరగంటలు టైమిస్తున్నాను. సరిగ్గా తొమ్మిది గంటలకి క్యాష్‌బ్యాగ్‌తో ఎగ్మోర్ రైల్వేస్టేషన్‌కి రా.

సిటీ ట్రైన్స్ వెళ్ళే మెట్రో లైన్ రెండో ప్లాట్‌ఫామ్‌కి వచ్చి వెయిట్ చెయ్యి. నేను నీ సెల్‌కి ఫోన్‌చేసి ఆ బ్యాగ్ ఎక్కడ ఉంచాలో చెపుతాను.

అక్కడుంచి నువ్వు వెళ్ళగానే నేను బ్యాగ్ తీసుకు వెళ్ళిపోతాను. క్యాష్ కరెక్ట్‌గా ఉంటే నీ భార్య నీ ఇంట్లో ఉంటుంది. ఓకేనా?"

"ఓకే. నేను వస్తాను"

"మాట నిలబెట్టుకుంటే నీకే మంచిది. నీ భార్య సేఫ్‌గా వస్తుంది" అన్నాడు.

అవతల లైన్ కట్ చేశాడు కిడ్నాపర్. రిసీవర్‌ను క్రెడిల్ చేశాడు నిషాంత్. గుండెలమీద నుంచి పెద్ద భారం దించినట్టుగా నిట్టూర్చి నుదుటపట్టిన స్వేదాన్ని కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు.

నిషాంత్‌తో కాయిన్‌బాక్స్‌నుంచి మాట్లాడి బయటికొచ్చాక ఏంచేయాలో తోచలేదు కశ్యప్‌కి. చాలాసేపు వ్యాన్‌లోనే కూర్చుండిపోయాడు.

ఎగ్మోర్‌రైల్వేస్టేషన్‌కి వెళ్ళటానికి తనకింకా రెండు గంటల వ్యవధి ఉంది. నిషాంత్‌కి అంత టైమివ్వటానిక్కూడా కారణం ఉంది. ఒకటి కాదు రెండు కాదు, ఏకమొత్తంగా యాభై కోట్లరూపాయలు. కాని యాభైకోట్లు లెక్కించి బ్యాగ్‌లో సర్ది సీక్రెట్‌గా వెంట తీసుకురావటానికి ఆ మాత్రం వ్యవధి అవసరమే.

అసలు అంత డబ్బు కళ్ళముందు మెదులుతుంటేనే ఒళ్ళు పులకరించిపోతోంది. జస్ట్ టూ అవర్స్. తన కష్టాలు, ఆమె కష్టాలు తీరిపోతాయి. అది తలచుకుంటేనే మనసు ఆనందంతో దూది పింజలా తేలిపోతోంది. అయితే ఈ రెండుగంటలు తనేం చేయాలి? గాంధారతో గొడవగాబట్టి ఇంటికి వెళ్ళి కాలక్షేపం చేయలేడు.

ఇలా వీధుల్లో తిరుగుతూ టైంపాస్ చేయాల్సిందే. వ్యాన్‌మీద కురుస్తున్న వాన చప్పుడుతోపాటు ఫ్రంట్ గ్లాస్‌ని తుడుస్తున్న వైఫర్స్ శబ్దాలు కశ్యప్‌ను ఆలోచనలనుంచి బయటపడేలా చేశాయి.

చలికి కాస్త వెచ్చగా వేడి వేడి చాయ్ తాగాలనిపించింది. వ్యాన్ స్టార్ట్ చేసి అంతదూరంలోని కమలా థియేటర్‌కి పోనిచ్చాడు. వ్యాన్‌ని ఇవతల పెట్రోల్ బంక్‌పక్కన ఆపి వ్యాన్‌దిగి రెయిన్ కోటు సవరించుకుంటూ కమలా థియేటర్‌నానుకొని రోడ్‌మీదకున్న టీ కార్నర్‌వైపు వడివడిగా నడిచాడు.

వర్షం మీదపడకుండా లోనకు నిలబడి స్పెషల్ టీ ఆర్డర్ చేశాడు. చలి చలి వాతావరణంలో వెచ్చగా టీ సేవిస్తుంటే హాయిగా ఉంది. టీ తాగుతూ కమలా థియేటర్ ఆవరణలోకి చూశాడు.

ఆడియన్స్ బాగానే ఉన్నట్టున్నారు. పార్కింగ్‌లో కార్లు, బైకులు, సైకిళ్ళు చాలా కన్పిస్తున్నాయి. ఆలోచిస్తూ చాయ్ తాగి సిగరెట్ ముట్టించుకున్నాడు.

టీ డబ్బులిచ్చాక కూడా సిగరెట్ కాల్చుకునేవరకు అక్కడే నిలబడ్డాడు. తర్వాత వెనక్కివచ్చి వ్యాన్‌లో కూర్చుని డోర్ మూశాడు.

రేడియో ఆన్‌చేసి రేడియో 'మిర్చి'లో పాటలు వింటూ అర్ధగంట కాలక్షేపం చేశాడు. సుమారు రాత్రి ఏడున్నర గంటల ప్రాంతంలో తిరిగి వ్యాన్ స్టార్ట్ చేశాడు. రివర్స్ తీసి కోడంబాక్కం ఫ్లైఓవర్‌వైపు పోనిచ్చాడు. కాని ఫ్లైఓవర్ ఎక్కలేదు.

రైట్‌లో ఉన్న శేఖర్ ఎంపోరియమ్ ముందు నుంచి పైకి వెళ్ళి లిబర్టీ థియేటర్ సందుగుండా నేరుగా కోడంబాక్కం మెట్రో రైల్వేస్టేషన్ చేరుకున్నాడు. వ్యాన్‌ని పార్కింగ్‌లో ఉంచి లాక్ చేసుకుని టోకెన్ తీసుకున్నాడు. ఎగ్మోర్‌కి టికెట్ తీసుకుని స్టేషన్‌లోకి వెళ్ళాడు. ఆ టైమ్‌లో కూడా వర్షం కారణంగా స్టేషన్ రద్దీగానే ఉంది.

కశ్యప్ ప్లాట్‌ఫారంలో అడుగుపెట్టిన మూడో నిముషమే లోకల్ ట్రైన్ ప్లాట్‌ఫారానికి వచ్చింది.

కశ్యప్ రైలు ఎక్కిన అరనిముషంలోనే రైలు నిశ్శబ్దంగా అక్కడనుండి కదిలింది.

ఒకేసారి బయటకు చూసిన నిషాంత్, అతడి పి.ఎ. నైనాలకు పోర్టికోలో కారుదిగి లోనకొస్తూ కనిపించిందో యువజంట. చాలా స్మార్ట్‌గా... క్యూట్‌గా ఉన్నారిద్దరూ. సివిల్ డ్రస్‌లోనే ఉన్నారు. కాని ఆ హుషారు, నడకతీరు చూస్తుంటే ఇద్దరూ కాప్స్ అని అర్థమయిపోతోంది.



E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్మోహనరావు



అధిక సంఖ్యాకుల ఆలోచనలు రాజ్యాంగ హక్కులను నిర్దేశించలేవు.

-దీపక్ మిశ్రా, భారత ప్రధాన న్యాయమూర్తి



భారత రాజ్యాంగం మనుషులను కుక్కలు, సింహాలుగా విడదీసి చూడదు. అందరినీ ఒక్కటిగానే చూస్తుంది.

-అసదుద్దీన్ ఒవైసీ
మజ్లిస్ ఎమ్.పి.

వాళ్ళు లోనకు వచ్చేశారు. "హలో...! ఐ థింక్ మిస్టర్ నిషాంత్ మీరే అనుకుంటాను" అంది వస్తూనే ఆమె.

"యాఁ... యాఁ... మీరు?" అడిగాడు నిషాంత్.

"ఉయ్ ఆర్ కమింగ్ ఫ్రమ్ క్రైమ్ బ్రాంచ్. అయామ్ మిస్ కామ్య. హి యీజ్ మిస్టర్ విశ్వాస్. మీ కేసు మేం టేకప్ చేశాం. సిటీ కమీషనర్‌గారి సూచనల మేరకు మీ కేసు విషయంలో సీక్రెసీ మెయిన్‌టెయిన్ చేస్తున్నాం. ఇంతక్రితం మీతో ఫోన్‌లో మాట్లాడింది కూడా నేనే" పరిచయం చేసుకుంది కామ్య. అంతే కాదు, తన ఐడెంటిటీ కార్ట్ తీసి చూపించింది.

నిషాంత్ డౌట్ క్లియరైంది.

"ఓ... థాంక్యూ ఆఫీసర్స్. థాంక్యూ. ప్లీజ్ కమ్. టేక్ యువర్ సీట్" అంటూ సోఫా చూపించి ఎదురుగా మరో సోఫాలో కూర్చున్నాడు నిషాంత్. వాళ్ళకి ఎడంగా నిలబడి ఉత్కంఠభరితురాలై చూస్తోంది పి.ఎ.నైనా. అసలీ కిడ్నాప్ వ్యవహారం ఎక్కడికి పోతోందో ఆమెకర్థంగావటంలేదు. గాభరాగా ఉందామెకు.

"సో... ఇది మీ ఆఫీస్. స్టాఫ్ ఎవరూ లేనట్టుంది" రిలాక్స్‌గా సోఫాలో కూర్చుంటూ అడిగింది కామ్య. పక్కనే విశ్వాస్ కూర్చుని చుట్టూ చూస్తున్నాడు.

"ఎస్ మిస్ కామ్య. స్టాఫంతా అయిదుగంటలకే వెళ్ళిపోతారు. ఈమె నైనా. నా పి.ఎ. తను ఒక్కతే నాకు హెల్ప్‌కోసం ఆగింది" అన్నాడు నిషాంత్.

"మనకి అట్టే టైమ్ లేదు. ఇప్పటికే కొంత కాలం వృథా అయిపోయింది. ఇలాంటి కేసుల్లో క్షణం లేటయినా, వృథా అయినా ప్రమాదమే. మీ వైఫ్‌ని సేఫ్‌గా తీసుకురావటం మా బాధ్యత.

మీరు కోపరేట్ చేస్తే కిడ్నాపర్‌ని త్వరగా పట్టుకోవచ్చు. సో. ఏం జరిగిందో మీరు వివరంగా చెప్పాలి" అంటూ జేబులోంచి చిన్న ప్యాడ్, పెన్ను తీసుకుని నిశితంగా నిషాంత్‌వంక చూసింది కామ్య. బాధగా చూస్తూ- ఓ వేడి నిట్టూర్పు విడిచాడు నిషాంత్.

"కొత్తగా చెప్పడానికేముంది మేడమ్. ఫోన్‌లోనే మీకు అంతా చెప్పాను. రెస్టారెంట్‌వద్ద నా వైఫ్ మిస్సయింది. తర్వాత తెలిసింది తను కిడ్నాప్ అయిందని" అన్నాడు.

అంతలో మేల్ కాప్ విశ్వాస్ కల్పించుకొంటూ- "వెయిట్ ఎ మినిట్" అన్నాడు.

అంతా అతనివంక చూశారు. "మీరు బిల్లు కౌంటర్‌లో పే చేస్తున్నప్పుడు మీ వైఫ్ సుమిత్రగారు మీ పక్కన లేరా?" అనడిగాడు విశ్వాస్.

"లేదు. తను నా పక్కనే ఉంటే ఈ కిడ్నాప్ జరిగుండేది కాదు. తను బయట వెయిట్‌చేస్తానని చెప్పి వెళ్ళింది. నేను బిల్లు పేచేసి బయటికెళ్ళి చూస్తే కారు వద్ద తను లేదు. అసలా పరిసరాల్లోనే లేదు. అందర్నీ అడిగిచూశాను. ఎవరూ నా వైఫ్‌ని చూళ్ళేదన్నారు"

"మీరు బిల్లు పే చేయటానికి, బయటికెళ్ళటానికి ఎంత సమయం పట్టింది?"

"జస్ట్ టూ ఆర్ థ్రీ మినిట్స్ అంతే"

ఆ సంభాషణ వింటున్న లేడీ ఆఫీసర్ కామ్య అప్పుడు కల్పించుకుంటూ-

"నిషాంత్‌గారూ! జస్ట్ త్రీ మినిట్స్. ఇంత షార్ట్ టైమ్‌లో మీ వైఫ్ కిడ్నాప్ అవటం ఆశ్చర్యంగా ఉంది. నమ్మలేకపోతున్నాం. ఆన్ ది వేలో మీరు చెప్పిన రెస్టారెంట్‌కి వెళ్ళి ఎంక్వైరీ చేశాం. అక్కడ మీ వైఫ్ మిస్సైన విషయాన్ని రెస్టారెంట్ వాళ్ళు ధృవీకరించారు. బట్ బైట షాపులవాళ్ళు ఎవరూ అక్కడ కిడ్నాప్ జరగటం చూళ్ళేదంటున్నారు. అంతా మిస్టరీగా ఉంది.

పట్టపగలు మధ్యాహ్నం రెండున్నర మూడుగంటల మధ్య... షాపులవాళ్ళే కాదు, వర్షానికి చాలామంది అక్కడ షెల్టర్ తీసుకునివున్నారు.

నిజంగా అక్కడ కిడ్నాప్ జరిగితే ఏ ఒక్కరైనా చూడకుండా ఉంటారా? ఇంపాజిబుల్ కదా.

ఆపైన కిడ్నాప్ జరుగుతుంటే మీ వైఫ్ సుమిత్రగారు ఊరుకుంటారా. అరిచి పెనుగులాడాలి. గొడవ జరగాలి. అవేం లేకుండా మూడునిమిషాల వ్యవధిలోనే ఆవిడ ఎలా కిడ్నాపైవుంటుంది. మీరు బాగా గుర్తు చేసుకుని అసలక్కడ ఏం జరిగిందో చెప్పాలి"

"ఎస్... ఎస్" అంటూ తలపంకించాడు నిషాంత్. "మీరడుగుతుంటే గుర్తొస్తోంది మేడమ్" అన్నాడు.

"చెప్పండి. ఏమైంది?" అని కుతూహలంగా అడిగాడు విశ్వాస్.

"నా వైఫ్ బయటికెళ్ళింది. నేను బిల్లు పే చేస్తున్నాను. అంతలో ఐదారు ఆటోలు పోర్టికోలోకొచ్చి ఆగాయి. ఆటోల్లో దిగినవాళ్ళు లోనకొచ్చేవరకు ఆగి నేను గ్లాస్ డోర్ తెరుచుకుని బయటికెళ్ళాను. చూస్తే నా వైఫ్ కారువద్ద లేదు. బహుశా ఏదో ఒక ఆటోలో కిడ్నాప్ చేసుండొచ్చు" అన్నాడు నిషాంత్.

"అప్పుడైనా ఆమె ప్రతిఘటించి అరవాలిగదా...! అసలయినా ఫైవ్‌స్టార్ హోటల్ రెస్టారెంట్‌కి ఆటోలు రావటమేంటి?" అంది కామ్య.

"ఫైవ్‌స్టార్ హోటల్ రెస్టారెంట్‌కి ఆటోలు రావటం విచిత్రమే... యూ ఆర్ రైట్... బట్ వచ్చాయి. చివరిగా వచ్చిన ఆటోలో కిడ్నాపర్ వుండి నా వైఫ్‌ని



## ఉండాల్సిందే

దక్షిణాదిలో తగిన ఆదరణ రావడంలేదంటూ అప్పట్లో నేరుగా వ్యాఖ్యానించి మరీ బాలీవుడ్ చెక్కేసి, విజయంవైపు అడుగులు వేసిన తాప్సీ, ఇప్పటికీ అభద్రతాభావం ఉందంటూ ఎప్పటిలాగే ఫ్రాంక్‌గా చెప్పింది.

'మన్మర్జియాన్'తో హడావిడి చేస్తున్న తాప్సీ, కొంత అభద్రతాభావం ఉండాల్సిందేనంటున్నది.

"భద్రతాభావం కలిగితే రిలాక్స్ అవుతాను. అప్పుడూ ఏదో చేయాలన్న ఆరాటం, తపన ఉండవు. చిత్ర పరిశ్రమలో రేపు ఎలా ఉంటుందో ఎవరికీ తెలియదు. అందుకే ప్రస్తుతం ఇక్కడున్న క్షణాలు ఆస్వాదిస్తున్నా" అంటూ చెప్పుకొచ్చింది.

సడెన్‌గా ఆటోలోకి లాగి మత్తుమందు స్ప్రే చేసి తీసుకుపోతే" అన్నాడు నిషాంత్.

"అప్పుడు కూడా అక్కడ ఖచ్చితంగా ఎవరో ఒకరి కంటబడివుండాలి. మాయచేసినట్టు అంత కామ్‌గా కిడ్నాప్ చేయగలిగాడంటే కిడ్నాపర్ ఎవడో గాని చాలా తెలివైనవాడైవుండాలి.

అంతేకాదు, చాలా రోజులుగా మిమ్మల్ని అబ్జర్వ్ చేస్తూ అవకాశం చూసి అనుకున్నది సాధించాడు. ఎనీవే... మీరూహించిందాంతో కిడ్నాప్‌కి ఫిఫ్టీ ఫిఫ్టీ ఛాన్సుంది. ఒకే. ఇంకేమన్నా చెప్పగలరా?" సూటిగా చూస్తూ అడిగింది కావ్య.

ఆమె చూపుల వాడికి కాస్త ఇబ్బందిపడుతూ సోఫాలో అసహనంగా కదిలాడు నిషాంత్.

"ఇంతకన్నా ఏం చెప్పాలో నాకు తెలీటంలేదు. జరిగింది అంతే" అన్నాడు నిషాంత్.

"కావచ్చు. మీకు గుర్తున్న ప్రతి విషయం మాకు చెప్పటం మంచిది. అది మీ దృష్టిలో ప్రాముఖ్యత లేని విషయమయినా సరే. మా ఇన్వెస్టిగేషన్ వేగంగా ముందుకు సాగాలంటే మీరు ఏదీ దాచకుండా చెప్పాలి. ఇంత జరిగిందంటే కిడ్నాపర్ మీకు తెలిసినవాడైవుండాలి. రెక్కీ జరిపి మరీ కిడ్నాప్ చేసుంటాడు. చెప్పండి. మీరు ఎవరినైనా అనుమానిస్తున్నారా?"

"ప్చ్..." అంటూ నిర్లిప్తంగా పెదవి విరిచాడు నిషాంత్.

"పోనీ మీకు శత్రువులెవరన్నా ఉన్నారా?" ఈసారి అడిగింది మేల్ కాప్ విశ్వాస్.

"నాకు తెలిసి శత్రువులెవరూ లేరు. బిజినెస్‌లో రైవల్స్ వున్నారు. కాని వాళ్ళంతా జంటిల్మన్స్. కిడ్నాప్‌కి తెగబడేంత మూర్ఖులు కాదు" అన్నాడు నిషాంత్.

"సో... కిడ్నాపర్ ఫోన్‌చేసి మీకు చెప్పేవరకు మీ వైఫ్ కిడ్నాప్ చేయబడినట్టు ఖచ్చితంగా మీకు తెలీదు కదూ?" సాలోచనగా అడిగింది కావ్య.

"ఎస్ ఆఫీసర్"

"కిడ్నాపర్ మగవాడే కదా?"

"ఎస్. మగవాడే"

"మీకు ఎన్ని గంటలకు ఫోన్ చేశాడు?"

"సాయంత్రం సుమారు నాలుగుగంటల ప్రాంతంలో చేశాడు. తనే నా వైఫ్‌ని కిడ్నాప్ చేసినట్టు చెప్పాడు. నా వైఫ్ అంటే నాకు ప్రాణం. ఈ విషయం తెలీగానే నా మనసు వికలమైంది. నాలుగ్గంటలకు మా బిజినెస్ ఎగ్జిక్యూటివ్స్‌తో జరగాల్సిన మీటింగ్‌ను కూడా క్యాన్సిల్ చేశాను" అన్నాడు నిషాంత్.

"ఒకే. బట్. వాడు చెప్పింది నిజమని మీరెలా నమ్మారు? వాడు కిడ్నాపర్ కాకపోవచ్చుగా?"

"లేదు లేదు. వాడు కిడ్నాపరే. ఎందుకంటే వాడు నా సెల్‌కి ఫోన్ చేసింది నా వైఫ్ ఫోన్ నుంచే.సుమిత్ర పర్సనల్ నంబర్ అది. ఫస్ట్ 3.30 ప్రాంతంలో నా సెల్‌కి నా భార్య సెల్ నుంచి కాల్ వచ్చింది.

సెల్ ఆన్ చేయగానే నా భార్య బాధాకరమైన మూలుగులు వినిపించాయి. అప్పుడామె నోటికి ఏదో అడ్డం ఉన్నట్లుంది. బహుశా అది టేప్ కావచ్చు.

కొద్ది క్షణాలకి టేప్ తీసినట్లుంది. 'సేవ్ మీ ప్లీజ్...' అంటూ ఏడుస్తూ రిక్వెస్ట్ చేసింది నా భార్య... ఐయామ్ ఇన్ ఏ హారిబుల్ కండిషన్... ఐ వాంట్ టూ కమ్ టూ యూ అంటూ బోరుమంది.

అంతే లైన్ కట్ అయింది. అప్పుడు కిడ్నాపర్ ఏం మాట్లాడలేదు.

సుమారు నాలుగు గంటల ప్రాంతంలో ఏదో ల్యాండ్‌లైన్ నుంచి కిడ్నాపర్ ఫోన్ చేశాడు. అప్పుడే కిడ్నాప్ జరిగిందని నమ్మాను..." చెప్పాడు నిషాంత్ దుఃఖంతో పూడుకుపోయిన గొంతుతో.

కాస్త ఎడంగా నిలబడి వచ్చిన పోలీస్ ఆఫీసర్స్ ఇద్దరూ మార్చి మార్చి అడుగుతున్న ప్రశ్నలు ఓపిగ్గా వాటికి సమాధానాలు ఇస్తున్న తన బాస్ నిషాంత్ మాటలు అంతా వింటూనేవుంది పి.ఎ. నైనా. అవి వింటుంటే ఒక ప్రశ్న తలెత్తింది ఆమెలో.

మేడమ్ సుమిత్రగారిని కిడ్నాప్ చేసింది వాడేనని నమ్మటానికి కారణం తన వైఫ్ ఫోన్‌నుంచి వాడు ఫోన్ చేయటం అంటున్నాడు కరెక్టే. కాని కిడ్నాపయిందని ధృవీకరించటానికి మరో ముఖ్యమైన ఎవిడెన్స్ ఉంది. అవి బాస్ సెల్‌ఫోన్లో ఫోటోలు.

ఆ ఫోటోలు కూడా బాస్ వైఫ్ సెల్ వాట్సప్ నుంచి వచ్చినవే. వాటిని వచ్చిన అధికారులిద్దరికీ చూపించ వచ్చు. కాని వాటిగురించే నిషాంత్ మర్చిపోయాడా...! లేక అవసరం లేదనుకున్నాడా! గుర్తుచేస్తే... గుర్తు చేయాలని నోటి చివరివరకు వచ్చిన మాటల్ని వెంటనే



# అదృష్టం పండింది

నవ్వులతో కుర్రకారును ఓ ఊపు ఊపేసి,మేఘాల్లో తేలి ఆడించిన 'లై' భామ మేఘా ఆకాష్ ఆశించిన స్థాయిలో పరుగు అందుకోలేకపోయింది.

రెండో చిత్రం 'ఛల్ మోహనరంగ' కూడా అంతగా వర్కౌట్ కాలేదు. తెలుగులో సరిగ్గా పట్టించుకోవడం లేదని అర్థమైపోయిన ఆకాష్ తమిళంలో తన ప్రయత్నాలు ఆరంభించింది. అదృష్టం పండింది.

మంచి కథ దొరికింది. తెలుగులో హిట్ కొట్టిన 'అత్తారింటికి దారేది' సినిమాను తమిళంలో రీమేక్ చేస్తున్నారు. శింబు హీరో. ఈ సినిమాలో మేఘా ఆకాష్‌కు మెగా ఛాన్స్ వచ్చిందట.



# మీటీరోల్

మామూలుగానే ప్రయోగాత్మక పాత్రలంటే ఇష్టం. అటువంటిది టచ్ ఉన్న సబ్జెక్టు. దాంతో '7'లో రెజీనా నటనలో రెచ్చిపోగలదన్నది అంచనా.

ఇంతకూ సంగతేమిటంటే తను చదువుకున్న సైకాలజీతో పాత్రకు వన్నెలద్దుతున్నది. ఈ రొమాంటిక్ థ్రిల్లర్‌లో రెజీనా సైకాలజీ స్టూడెంట్‌గా నటిస్తున్నది. పాత్ర పోషించడం సహజంగా ఉందని, ఇంతకు ముందు పాత్రలకంటే భిన్నమయిన మీటీరోల్ అని, ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా సినిమాకు సంతకాలు చేశానని చెప్తోంది.

# చిలిపి



**పెళ్ళికి ముందు వధూవరులకు కాళ్ళగోళ్ళు ఎందుకు తీస్తారు?**
కాలు తొక్కే సమయంలో పొరపాటున గుచ్చుకుంటాయని.

**పాలముంచినా, నీటముంచినా...!**
'పోయేది ప్రాణం'

**అరె... మా చంటివెధవ మీ పెన్ను తీశాడని ఎలా కనిపెట్టారు...**
తండ్రి బుద్ధులు కొడుకులకేగా వచ్చేది.

**పేషెంట్ ఎక్కువగా సుత్తేస్తుంటే డాక్టర్ చెయ్యగలిగింది?**
నోట్లోకి థర్మామీటర్ తోసెయ్యడమే!

**మీరు ఉదయాన్నే లేచి ఏంచేస్తారు?**
ఊడిపోయిన లుంగీ తిరిగి కట్టుకుంటాను.

**సీరియల్స్ అన్నీ ఒకేసారి పావుగంటలో చదవడం ఎలా?**
వెరీసింపుల్. ఇంతవరకు జరిగిన కథలన్నీ చదివేస్తే సరి.

**మీరు రచయితా? మీ కథలు దేనిలో వస్తుంటాయి?**
పోస్టులో వస్తుంటాయి.

**ఉపన్యాసకులు మాట్లాడేటప్పుడు మధ్య మధ్య బల్లలు గుద్దుతారెందుకు?**
నిద్రపోతున్న ప్రేక్షకులు లేచేందుకు!

**తేలు ఎక్కడ కుడితే విషము పైకి ఎక్కకుండా ఉంటుంది?**
తలమీద కుడితే.

**లౌడ్ స్పీకర్లు దేనికి?**
మీటింగ్‌కు ఎవరూ రాకపోయినా చుట్టుప్రక్కల ఇళ్ళల్లోనివాళ్ళన్నా వింటారని!



మింగేసింది నైనా. తన బాస్ నిషాంత్‌గురించి తనకు బాగా తెలుసు.ఆయన అడిగిందానికిమాత్రమే సమాధానం చెప్పాలి. స్వతంత్రించి అడిగినా చెప్పినా విపరీతమైన కోపం వచ్చేస్తుంది. కాబట్టి గుర్తుచేయకుండా ఉంటేనే మంచిదని మౌనంగా ఉండిపోయింది.

ఈలోపల కామ్య మరో ప్రశ్న నిషాంత్‌ను అడగటం గమనించి అటు చూసింది. "కిడ్నాపర్ మీకు బాగా తెలిసినవాడు కావచ్చు. అతడి వాయిస్‌ను మీరేమన్నా గుర్తుపట్టారా?" అడుగుతోంది.

"లేదు. నోటికి ఏదో అడ్డం ఉంచుకుని బేస్ వాయిస్‌లో మాట్లాడినట్టున్నాడు. వినడానికి వికృతంగా, అసహనంగా ఉంద"న్నాడు నిషాంత్.

"సో... కిడ్నాపర్‌ని తక్కువగా అంచనా వేయలేం. పూర్తిగా జాగ్రత్తలో ఉన్నాడు. మరోసారి ఆలోచించండి. వాడెవడో మీవల్ల నష్టపోయినవాడు కావచ్చు. మీమీద ఏదో కారణంగా కక్షపెంచుకున్న మీ ఉద్యోగి కావచ్చు లేదా మీ బ్యాంకుకి బాగా అప్పుపడి వాయిదాలు కట్టలేకపోతున్న వ్యక్తి కావచ్చు..."

"సారీ ఆఫీసర్స్. మీరు చెప్పినవాళ్ళలో ఎవడో ఒకడు కావచ్చు. కాని నాకు తెలీదు. నేను బిజినెస్ మ్యాన్‌ని. నాకు సెల్వం బ్యాంకుతోపాటు ఇతర వ్యాపారాలు చాలా ఉన్నాయి. క్షణం తీరికలేని బిజీ లైఫ్ నాది. సో... మీరు చెప్పేవాళ్ళలో ఎవరూ నా దృష్టిలో అనుమానితులుగా లేరు" నిషాంత్ గొంతులో ఒకింత నిస్పృహ ధ్వనించింది.

"సో... మీకు ఎవరిమీదా అనుమానం లేదు" అని అడిగింది కామ్య.

"ఎస్. యూ ఆర్ రైట్"

"ఒకసారి... అదే ఫస్ట్ టైమ్స్ మీ వైఫ్ సెల్‌నుంచి మీ సెల్‌కి చేసినప్పుడు మీ భార్య మూలుగులు... ఏడుపులు... అభ్యర్థన... రెండో కాల్ మీ ల్యాండ్ లైన్‌కి వచ్చింది.అప్పుడు కిడ్నాపర్ మాట్లాడి డిమాండ్స్ చెప్పాడు. అంతేనా...?"

"ఔను. మీరొచ్చేముందే ఫోన్‌చేసి మాట్లాడాడు"

"మీ సెల్‌కే చేశాడా?"

"లేదు. ల్యాండ్‌లైన్‌కి చేశాడు"

"ఏం డిమాండ్ చేశాడు?"

"డబ్బు"

"ఎంతో చెప్పాడా?"

"వందకోట్లు" చెప్పాడు నిషాంత్.

"ఓ మైగాడ్! మీరు ఒప్పుకున్నారా?"

"నా భార్యను రక్షించుకోవడానికి వేరే దారి కనిపించలేదు. అందుకే చివరికి యాభైకోట్లకు డీల్ ఓకే చేశాను" అన్నాడు నిషాంత్.

"యాభైకోట్లు ఇచ్చేస్తారా?"

"అవును. ఇచ్చేస్తాను"

"ఎక్కడికి రమ్మన్నాడు?"

"రాత్రి తొమ్మిదిగంటలకి. అంటే ఇంకో రెండు గంటలుమాత్రమే టైముంది. క్యాష్ తీసుకుని ఎగ్మోర్ రైల్వేస్టేషన్‌కి రమ్మన్నాడు. ఈ విషయం పోలీసులకు చెప్తే నా వైఫ్‌ని చంపేస్తానన్నాడు.

క్యాష్ అందిన గంటలోపే నా భార్య నా ఇంటివద్ద ఉంటుందని మాటిచ్చాడు.చాలు.డబ్బిచ్చేసి నా వైఫ్‌ని రక్షించుకుంటాను. ఇక ఈ విషయంలో పోలీసుల జోక్యం అనవసరమనుకుంటాను. ఇక మీరు బయల్దేరితే నేనెళ్ళి క్యాష్ రెడీచేసుకుని ఎగ్మోర్ వెళ్తాను"

"ఓకే మిస్టర్ నిషాంత్. ఇక మా జోక్యం అనవసరమని మీరు అనుకుంటే మా అభ్యంతరం ఏమీలేదు. బట్. వాడు డబ్బు తీసుకుని సుమిత్రగార్ని వదలకపోతే...? ఆమెను అడ్డం ఉంచుకుని ఇంకా ఇంకా అంటూ మరింత డబ్బుని డిమాండ్ చేస్తే...?"

కామ్య సందేహం వినగానే మరోసారి ఆలోచనలో పడ్డాడు నిషాంత్. ముప్పైసెకన్ల విరామంతర్వాత "అందుకవకాశం లేకపోలేదు"అన్నాడంగీకరిస్తూ.

"చూడండి మిస్టర్ నిషాంత్. ఎలాగూ ఈ కేస్‌లో మేం ఇన్వాల్వ్ అయ్యాంగాబట్టి మధ్యలో వదిలేయలేం. కిడ్నాపర్‌ని ట్రాప్‌చేసి పట్టుకోవడానికి ఇది చక్కటి అవకాశం. మేం చెప్పినట్టు వింటే మీ క్యాష్ మీ దగ్గరే ఉంటుంది. మీ వైఫ్ క్షేమంగా వస్తుంది"

"ఓకే. ఇప్పుడు నేను ఏం చేయాలి?" చివరకు అడిగాడు నిషాంత్.

"క్యాష్ తీసుకుని షెడ్యూల్ ప్రకారం మీరు టైమ్‌కి ఎగ్మోర్ స్టేషన్‌కు వెళ్ళండి. మా పోలీసులు సివిల్ డ్రెస్‌లో జనంలో కలిసిపోయి ప్లాట్‌ఫామ్‌మీద ఉండి అంతా గమనిస్తుంటారు. మొత్తం రైల్వేస్టేషన్ మా సర్వే లైన్స్‌లో ఉంటుంది.

ఆ స్టేషన్‌లో ఉండే సి.సి. కెమెరాలు అన్నీ సరిగ్గా పనిచేసేలా వెంటనే యాక్షన్ తీసుకుంటాం. మీరు కిడ్నాపర్ చెప్పినచోట క్యాష్ బ్యాగ్ వదిలి వెనక్కి వచ్చేయండి. అంతే... ఆ బ్యాగ్‌ని, పికప్ చేసుకున్న వాడ్ని స్పాట్‌లోనే మావాళ్ళు పట్టేస్తారు.

చివరి క్షణంలో కిడ్నాపర్ ప్రోగ్రామ్ మార్చి తన వెంట మిమ్మల్ని కూడా క్యాష్‌బ్యాగ్‌తో రైలెక్కమనొచ్చు. అలాగని మీరు తొందరపడి రైలెక్కొద్దు. వాడి సంగతి మావాళ్ళు చూసుకుంటారు" అంటూ వివరించింది కామ్య.

**ఇంకా ఉంది**

పర్సనల్ ఎజెండా

# కైరా అద్వానీ

అందచందాలతో, ప్రతిభాపాటవాలతో కెరీర్ పరుగు లంకించుకున్న కైరా అద్వాని తన ఫిట్‌నెస్, ఆహారం, పానీయాలు, జీవన శైలి గురించి వివరించింది.

► **నా వృత్తి:** ఫిట్‌నెస్‌ను డిమాండ్ చేస్తుంది.బోల్డెంత ఓపిక, శక్తి కావాల్సివుంటుంది

► **జీవనశైలిలో:** ఫిట్‌నెస్ తప్పనిసరిగా భాగంకావాలి. సుదీర్ఘ గంటలు పనిచేయాలి. కెమెరా ముందు అందంగా కనిపించాలి

► **అంతర్గతంగా:** తప్పనిసరిగా ఆరోగ్యంగా వుండాలి. ఇరవై నిమిషాలపాటు వ్యాయామాలు చేసినా మూడ్ బావుంటుంది. రోజులో ఓ గంట శారీరక వ్యాయామాలకు కేటాయించడంవల్ల రోజంతా మానసికంగా ఉత్సాహం, ఉత్తేజం లభిస్తాయి

► **నా వ్యాయామ కార్యక్రమాలు :** ప్రతిరోజూ జిమ్‌లో ఓ గంటసేపు గడుపుతాను.

అధిక ఇంటెన్సిటీ శిక్షణ తీసుకుంటాను. కొన్ని సార్లు డ్యాన్సింగ్, కిక్ బాక్సింగ్ చేస్తుంటా

► **నా ఫేవరెట్ వర్కవుట్ :** స్విమ్మింగ్. క్రమం తప్పకుండా చదువుకునేటప్పుడు స్కూల్ అవగానే రోజూ పూల్‌కు వెళ్ళేదాన్ని

► **వర్కవుట్ల తర్వాత :** నా ఫీలింగ్స్ అద్భుతంగా వుంటాయి. మంచి మూడ్ వుంటుంది. శారీరకంగా బాగా కనపడడమే కాదు, ఎమోషనల్‌గా, మానసికంగానూ మంచి భావాలతో వుంటాను

► **ఇష్టపడే ఆహారం :** ఇంట్లో వండిన పదార్థాలు. ముంబయిలో ఉన్నప్పుడు ఇంటి భోజనాన్నే తినేదాన్ని

► **నా డైట్ :** బ్రేక్‌ఫాస్ట్‌లో పండు, ఓట్స్ తింటాను. యాపిల్ లేదా కొద్దిగా కివి తింటా.తర్వాత బ్లాక్ కాఫీ తాగుతాను. మిడ్‌మార్నింగ్ వాల్‌నట్స్, కొబ్బరినీళ్ళు తీసుకుంటా. లంచ్‌లో ఇంట్లో వండిన భోజనానికే ప్రాధాన్యం. రెండు కూరలు తింటాను.

బెండకాయ, గుమ్మడి నా ఫేవరెట్స్.క్వినోవా లేదా నాచ్ని రోటితో పెసరపప్పు తీసుకుంటా.

సాయంత్రం స్నాక్స్‌లో బొప్పాయి ముక్కలు లేదా కొన్ని నట్స్, బ్లాక్ కాఫీ, డిన్నర్‌లో ఫిష్, గ్రీన్స్ లేదా పుట్టగొడుగులు, జుచ్చిని వుంటాయి.

మధ్యలో గ్రీన్‌టీ తాగుతాను

► **ఈ రోజుల్లో అనేకమంది:** ఆరోగ్యపూరితమైన జీవనశైలి అనుసరిస్తున్నారు.సినీ నటి మరొకటన్నది ఇక్కడ ముఖ్యం కాదు.ఎవరో ఒకరిని స్ఫూర్తిగా తీసుకుని వర్కవుట్లు చేయాలి. ఆరోగ్యపూరిత జీవనశైలిని అనుసరిస్తుండాలన్నది నా సలహా

# వారఫలం

**సెప్టెంబర్ 20 నుండి 26, 2018 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



## మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పా.** ఈ వారంలో మీకు గ్రహసంచారం అనుకూలంగా ఉన్నది.ఆత్మస్థైర్యం పెరుగుతుంది.తలపెట్టుకున్న పనులను పట్టుదలతో పూర్తిచేసుకోగల్గుతారు.మిత్రుల విందులలో పాల్గొనగలరు.ప్రేమ, పెండ్లి వంటి విషయాలలో ఒక అడుగు ముందుకు వేయగలరు. విద్యార్థులకు, నిరుద్యోగులకు అనుకూల సమయం. ప్రయాణాలు అనుకూలిస్తాయి. గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



## వృషభం

**కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.** మీకు పంచమములో వాహన పంచమాధిపతుల కలయికచే ఆలోచనాసరళిలో మార్పులు-సంతానమునకు తలపెట్టిన పనులుపూర్తగుటవంటివి ఉంటాయి. శనివారపు నియమాలకు ప్రాధాన్యతనిస్తూ వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలను తలపెట్టుకోండి. విద్యార్థులు 'హయగ్రీవాయనమః' అనే మంత్రమును రోజూ 5 లేక 10 నిమిషాలు జపించుకోండి. శని, ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



## మిథునం

**మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.** మీకు పంచమములో గురు-శుక్రులచే లక్ష్మీనారాయణ యోగం ఏర్పడిన కారణంచే గత కొంతకాలంగా ఎదుర్కొంటున్న ఇబ్బందులను అధిగమించే అవకాశాలున్నాయి. ఆర్థిక విషయాలందు స్వావలంబన దిశగా సాగుతారు. ఆరోగ్యం క్రమేపీ మేలవ్వగలదు. బంధుమిత్రులచే కొన్ని ఉపకారాలను పొందగలరు. సుబ్రహ్మణ్యారాధనను కొంత సాగించండి. ఈ రాశివారికి గురు, శుక్రవారాలందు అన్నిటా ఆచరణలు అవసరం.



## కర్కాటకం

**పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష.** రాహు-కేతువుల ప్రభావంచే స్థిరమైన ఆలోచనలు చేయలేకపోగలుగుతారు. ఊహించుకున్న వ్యక్తులచే ప్రయోజనాలు పొందగలరు. ఆదాయాలు-మీ అవసరాలకు సరిపడునట్లుగా ఉంటాయి. కొన్ని వివాదాలను ఏర్పరచు వ్యవహారాలను వాయిదా వేసుకుంటారు. సంతాన వ్యవహారాలందు సంతృప్తి నేర్పరచుకోగల్గుతారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలు సాధారణ స్థాయిలో సాగగలవు. శని, ఆది వారాలలో మరింత జాగ్రత్తలు పాటించుకోవాలి.



## సింహం

**మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా.** లగ్న ధనాధిపతుల సంబంధం ధన స్థానమున అగుటచే ఈ వారమంతా అభివృద్ధి దాయకంగా సాగుతుంది. సామాజికంగా గుర్తింపులు ఏర్పడతాయి. గత పెట్టుబడులకు రూపాంతరాలు ఏర్పరచగలరు.మీ నిర్ణయాలు సరైనవైనా ఊగిసలాటలకు గురయ్యే సందర్భాలు 1 లేక 2 ఉంటాయి. సంతానమును ప్రోత్సహించవలసి రావచ్చును-మానసికంగా ధైర్యమును ఏర్పరచవలసి ఉంటుంది. గురు, శుక్ర, శని, ఆది వారాలు అనువైనవి.



## కన్య

**ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా.** మానసిక ఒత్తిడులకు గురికావడం, తెలియని ఆందోళనలు, అనారోగ్యాలుంటున్నా మీ కర్తవ్యాలను ముందుకు నడిపించగల్గుతారు. ఇతరులచే ఆశించిన సహాయాలు పొందుట-ఇతరులను నమ్మి మోసపోవుట వంటివి ఉంటాయి. శారీరకంగా తరచుగా అలసటలకు గురికావటం వంటివి ఉంటాయి. వీరికి శివారాధనలు తప్పనిసరి అవసరం. శని, ఆది, బుధవారాలు అనువైనవి.



## తుల

**చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1,2, 3పా.** ఖర్చులు కొన్ని ఎక్కువ ఉంటాయి. సేవకాజనముచే ఊహించుకున్నంతగా సౌఖ్యములు పొందలేకపోతారు. ఆరోగ్యమునకై కొన్ని అదనపు చర్యలు తీసుకోగలరు. వృత్తి, ఉద్యోగ వ్యాపారాలు సాధారణ స్థాయిలో సాగుతాయి. వాహన, యంత్రాదుల విషయంలో రూల్స్‌కు ప్రాధాన్యతనీయండి.వివాహాది విషయాలలో శుభాలు ఏర్పడగలవు. క్రయ-విక్రయాలలో లాభాలు అనుకూలం.ఈ రాశివారికి శని, ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



## వృశ్చికం

**విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ.** శన్యేతర గ్రహాలు అనుకూలం. సత్సాంగత్యాలు ఏర్పడతాయి. అనుకున్నవి సాధించుకోగలరు.కళత్ర సంబంధ ఆరోగ్యం విషయంలో స్వల్ప చికాకులుంటాయి. ఆదాయాలలో తృప్తి కలుగుట, గతంలో చికాకులు సన్నగిల్లుట వంటివి ఉంటాయి. గృహ సంబంధ నిర్మాణాలు లేదా రిపేర్లు వంటివి చేపట్టుకోగలరు. శివారాధన మానకండి. ఈ రాశి వారికి గురు, శుక్ర, శని వారాలు అనువైనవి.



## ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా.** గతంతో పోల్చితే వారారంభం నుండి అనుకూలతలు పెరుగుతాయి. ఆర్థికంగా సామాన్య ఆదాయాలున్నా అవసరాలు తీరుతాయి. మిత్రాదుల ప్రేరణచే చేదు అలవాట్లు ఏర్పడకుండా జాగ్రత్తలు అవసరం. శత్రువర్గంవారితో వ్యవహరించవలసి రావచ్చును. భావోద్వేగాలను అదుపులో ఉంచుకోవాలి. కాలాతీతములు ఏర్పడకుండా నిత్య కృత్యములలో మెలకువలు అవసరం. ఈ రాశి వారికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



## మకరం

**ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా.** వీరికి ఈ వారం శుభాశుభ మిశ్రమ స్థితులు ఉంటాయి. లక్ష్యసాధన దిశగా సాగాలి. మనస్సును ఉత్సాహంగా ఉంచుకునేందుకు ఆధ్యాత్మికతలకు ప్రాధాన్యతలు ఇవ్వాలి. ప్రభుత్వ తరహా ప్రయోజనాలకై చేయు పనులు అనుకూలిస్తాయి. వివాదాలకు దూరంగా ఉంటూ లౌక్యంతో కొన్ని విషయాలలో సాగవలసి ఉంటుంది. వృత్తి,ఉద్యోగాలలో ఒకింత అనుకూలతలు పెంచుకో గలరు. ఇచ్చిపుచ్చుకోవడాలు అనుకూలం. ఈ రాశివారికి గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.



## కుంభం

**ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా.** ఈ వారంలో ఆదాయాలు అనుకూలమైనా ఊహించని ఖర్చులు కొన్ని ఎక్కువగా ఉంటాయి.ప్రభుత్వపరమైన చెల్లింపులలో జాగ్రత్తలు పాటించుకోవాలి. శారీరక బడలికలు-ఔషధ సేవలువంటివి ఉంటాయి.ప్రయాణాలుచేయవలసి రావచ్చును. స్నేహవర్గంచే ప్రయోజనాలు ఉంటాయి. మాతాపితరుల సేవా భాగ్యాలు ఏర్పడగలవు. విద్యార్థులకు,నిరుద్యోగులకు అనుకూల సమయం.స్పెక్యులేషన్లకు క్రయ-విక్రయాలకు దూరంగా ఉండండి. ఈ రాశివారికి శని, ఆది, సోమవారాలు ముఖ్యమైన పనులు చేపట్టుటకు చాలా అనువైనవి.



## మీనం

**పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి.** ప్రయత్నాలలో పట్టుదలతో సాగించవలసి ఉంటుంది. కుటుంబంలో ఒంటరితనాలు ఏర్పడకుండా లౌక్యాలతో, సంయమనాలతో సాగాలి. ఖర్చులు ఒకింత ఎక్కువ అవడం, ఆలోచనలు కొన్ని విపరీతంగా ఏర్పడడంవంటివి ఉంటాయి. మీ వ్యక్తిగత విషయాలకంటే ఇతరములైన వ్యవహారాలకు ఎక్కువ ప్రాధాన్యతనీయగలరు. ఇతరులను నమ్మి వస్తు వాహనాదులను ఇవ్వకండి.గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.

**కాలాన్ని మించిన నియంత లేదు.**

## ఊరంతా బొమ్మలే

తైవాన్‌లోని 'హుయిజా' గ్రామానికి ఓ ప్రత్యేకత వుంది. ఆ ఊరిలో వీధులన్నీ కార్టూన్ బొమ్మలతో కళకళలాడుతూ వుంటాయి.

ఈ బొమ్మల కథ వెనక్కు వెళ్తే ముగ్గురు అక్కాచెల్లెళ్ళున్నారు.

వాళ్ళు సెలవులకు నానమ్మ ఇంటికి వచ్చినప్పుడు బోర్‌కొట్టి,ఇంటి బయట గోడలపై కార్టూన్ క్యారెక్టర్ల బొమ్మలు వేశారు. ఈ బొమ్మలు ఊరివాళ్ళను ఆకర్షించాయి. దీంతో తమ ఇళ్ళకూ అలా బొమ్మలు వేయడం అనేది మొదలుపెట్టారు.

అలా కొద్ది రోజుల్లో ఊరిలోని వీధుల గోడలన్నీ బొమ్మలతో నిండిపోయాయి. ఆర్ట్ స్కూల్ విద్యార్థులతో, ప్రొఫెషనల్స్‌తో బొమ్మలు వేయించుకున్నారు.ఇప్పుడా ఊరికి పర్యాటకుల తాకిడి బాగాఉంది. ✦



# అనిల్

An apology is the sign of a secure leader

## స్నేహితుల అవసరం

పిల్లలు ఎదిగే క్రమంలో ప్రతి దశలోనూ వారికి స్నేహితుల అవసరం వుంటుంది. అది టీనేజ్ దశకు వచ్చేసరికి ఎక్కువ అవుతుంది.

అప్పటిదాకా అమ్మానాన్నలేలోకం అన్నట్లున్న పిల్లలు నెమ్మదిగా తోటి పిల్లల ప్రభావానికి లోనవుతారు.

ఇది సహజం.వారి మానసిక పరిణతి ప్రక్రియలో భాగంగా అవసరం కూడా.జీవితంఅంతాఅమ్మానాన్నలు పిల్లలకు తోడుగానే వుంటారు.

అయితే, ఓ వయస్సు వచ్చాక వారు సామాజిక అనుబంధాలు ఏర్పరచుకోవాల్సిన అవసరం వుంటుంది. సౌకర్యపూరిత పరిస్థితినుంచి, వాస్తవిక జీవితంలోకి వెళ్ళాలి. ఇందుకు స్నేహాలు చాలా అవసరం.

మంచి, సన్నిహిత స్నేహితులున్నప్పుడు ఎమోషనల్ పరిస్థితుల్లో వారికి ఆసరా అవుతారు.

కొన్ని విషయాలను పంచుకోవడానికీ స్నేహితులు కావాల్సిందే. ✦

## పనులు నేర్పాలి

ప్రీటీనేజ్‌కి చేరిన పిల్లలకు కొన్ని కొన్ని పనుల్ని తప్పనిసరిగా నేర్పించాలి. ఆహారం, వ్యక్తిగత పరిశుభ్రత వంటి విషయాల్లో వాళ్ళు పెద్దవాళ్ళ సాయం లేకపోయినా తమను తాము మేనేజ్ చేసుకోగలగాలి.

అవసరమైతే స్వయంగా ఆహారాన్ని తయారుచేసుకోగలగడం, డబ్బును ఆదా చేయడం, ఇంటిని, తన గదిని, పుస్తకాలను నీట్‌గా వుంచుకోవడం వంటి పనులు వాళ్ళకు నేర్పించాలి. శని, ఆదివారాల్లో ఇంట్లో వంట చేస్తున్నప్పుడు సాయంచేయాల్సిందిగా వారికి చెప్తుంటే అలవాటు అవుతారు.

మొదట్లో ఏ పని చెప్పినా తప్పులు చేస్తారు. సహజం.తప్పుచేశారని అసలు పని చెప్పకపోవడం, సాయం అడక్కపోవడం వంటివి చెయ్యవద్దు. ✦

## అర్థాలు తెలియవు

మనం మాట్లాడే మాటను రిపీట్ చేసే చిలుకపలుకులు వినసొంపుగా వుంటాయి. ప్రత్యేకంగా శిక్షణ ఇస్తే పలకరించడం, టాటా చెప్పడం, పిలవడంవంటివీ చేస్తుంటాయి.

చెప్పేవన్నీ చిలుకలకు తెలిసే మాట్లాడతాయా? అంటే సందేహమే. కొండమైనాలు,కోకిలలుకూడాచక్కగా పాడతాయి. అయితే, వేటికీ అస్సలు అర్థాలు తెలియవని ఇటీవలి యూరప్ పరిశోధనలు పేర్కొంటున్నాయి.

పలకమన్నట్లుపలకడం, రాగంతీస్తే, దాన్ని అనుకరించడం తప్ప వాటికి అర్థాలు తెలియవన్నది వాస్తవం. ✦

## భూకంపాలు ఎందుకు వస్తాయి?

భూకంపం అంటే భూమి లోపలి పొరల్లో ఎక్కడో ఒకచోట అకస్మాత్తుగా అలజడి వచ్చినప్పుడు ఏర్పడే కంపనాలు భూమి ఉపరితలానికి చేరడం. భూమి ఉపరితల భూభాగం పొరలతో నిర్మితమై వుంటుంది.

ఈ పొరల్లో అన్నింటికంటే పెద్దదైన భూమి అంతర్భాగంలో ఎక్కువ శక్తితో కలిగే అలజడివల్ల భూకంపాలు ఏర్పడతాయి.

భూమి లోపలి పలకల కదలికవల్ల కొన్నిప్రాంతాల్లో భూకంపాలు వస్తుంటాయి. కుక్కలు, పిల్లులు, పాములు, పశువులు దీన్ని గుర్తిస్తాయి. ✦

## జ్వరంగా వుందా?

పిల్లలకు అనేక కారణాలరీత్యా జ్వరంరావచ్చు. జ్వరం 99 డిగ్రీల సెంటీగ్రేడ్‌పైన ఉన్నప్పుడే జ్వరం మందుఇవ్వాలి.జ్వరంతోపాటు ఇతర లక్షణాలు వుంటేఆహారంవిషయంలో తగిన జాగ్రత్తలు తప్పనిసరి.

జ్వరం వుంటే అజీర్తిగా వుంటుంది కాబట్టి బలవంతంగాఘనపదార్థాలు పెట్టవద్దు. కొబ్బరినీళ్ళు, మంచినీళ్ళు, మజ్జిగవంటి పానీయాలు ఎక్కువగా ఇస్తుండాలి. ద్రవపదార్థాలు తీసుకోలేకపోతున్నా, మూత్రం తక్కువగా, పచ్చగా వస్తున్నా వెంటనే పిల్లల వైద్య నిపుణులను సంప్రదించాలి. ✦

## మాస్టారు

అక్షరాలు దిద్దిస్తున్నప్పుడు తెలియలేదు
నా జీవితాన్ని మలుపు తిప్పుతున్నారని...
కోపగించుకున్నప్పుడు తెలియలేదు
నాపై బాధ్యతను పెంచుకుంటున్నారని...
చేతిమీద కొట్టినప్పుడు తెలియలేదు
నా చేతలకి పదును పెడుతున్నారని...
ప్రశ్నలడిగినప్పుడు తెలియలేదు
ప్రపంచాన్ని పరిచయం చేస్తున్నారని...
పరీక్ష పెట్టినప్పుడు తెలియలేదు
నా ఆత్మవిశ్వాసాన్ని పరీక్షిస్తున్నారని...
కానీ, ఈ క్షణం తెలుస్తుంది నాలో ఒక విశాల
ప్రపంచాన్నే సృష్టించారని ఒక మహాశక్తిగా మలిచారని...
కాలం వెనక్కివెళితే మీతో మళ్ళీ దెబ్బలు తింటాం...

ఇట్లు
మీ విద్యార్థి




## బొమ్మల పజిల్

ఈ బొమ్మలో సరైన కోడికాలిని నింపి పూర్తిచేయాలి. ✦



# గంధర్వ కన్యలు

## చందమామ రావే







ఒక పల్లెలో పాపమ్మ అనే పేదరాలికి జోగూ, నాగూ అని ఇద్దరుపిల్లలు. చిన్నప్పుడే వాళ్ళకు తండ్రిపోవటంచేత పిల్లలను పోషించే భారమంతా ఆమెపైనే పడింది. అది చాలా చిన్నపల్లె.

దగ్గర్లో చిన్న అడవీ, దూరంగా పెద్ద కొండలూ కనబడుతుంటాయి.పాపమ్మ పొద్దస్తమానమూ ఆ అడవిలో మూలికల్నీ, ఔషధానికి పనికివచ్చే ఆకుల్నీ ఏరి, ఆ గ్రామంలోని వైద్యుడికి తెచ్చి ఇచ్చేది.

అతడిచ్చే తృణమో పణమో పుచ్చుకుని అలాగే కాలం గడుపుతుండేది. జోగూ, నాగూ పదహారు, పన్నెండు సంవత్సరాల వయసువాళ్ళయ్యారు. మూలికల్ని తవ్వడంలో, ఔషధాలకు ఉపకరించే ఆకుల్ని కోయడంలో, తల్లికి సాయపడేవాళ్ళు.

ఒకనాడు వైద్యుడు ఏదో మూలిక కావాలంటూ, దానికి సంబంధించిన గుర్తులను చెప్పి తీసుకు రమ్మన్నాడు. జోగూ, నాగూ అడవి అంతా గాలించినా అది దొరకలేదు.

దూరంగావుండే ఆ కొండల్లో అవి దొరుకుతాయని తల్లి చెప్పింది. మరునాడు ఉదయమే కాలినడకన వాళ్ళు బయలుదేరారు.

సూర్యుడు నడుమధ్యకు చేరేప్పటికి, వాళ్ళా కొండలమధ్యకి చేరారు. మంటలు రేపుతున్న ఎండలో, పొగలుగక్కుతున్న ఆ బండరాళ్ళమధ్య ఇద్దరూ మూలికలకోసం వెతికారు.

మెల్లగా సూర్యుడు అస్తమించేసరికి తెచ్చిన రెండుసంచుల్నీ వాళ్ళు మూలికలతో నింపారు.

జోగు చెమట తుడుచుకుని, ఒళ్ళు విరుచుకుంటూ "నాగూ! ఇక ఇంటికి బయలుదేరదాం" అన్నాడు. అప్పటికే ఓ బండకు వీపు ఆనించి ఆవసోపాలు పడుతున్నాడు నాగు.

"ఈ రాత్రికి ఇక్కడే నిద్దరపోతే ఏం?" అన్నాడు నాగు.

జోగు శరీరం గొంగళిపురుగు పాకినంతగా కంపరం ఎత్తింది.

"ఈ కొండలమధ్య రాత్రి ఎలా గడపడం! పురుగూపుట్రా! ఉ..లే!" అన్నాడు కోపంగా.

నాగుకు కునికిపాట్ల మధ్య ఎవరో కుదిపినట్ట యింది. "ఉహూ... నిద్దరొస్తోంది. బయలుదేర వచ్చులే, కాసేపాగు" అన్నాడు మత్తుగా.

జోగుకు తమ్ముడంటే అమితమైన ప్రేమ. వాడి ఒళ్ళు విరుపూ, కునికిపాట్లూ చూసి జాలి కలిగింది. కాసేపు ఆగే బయలుదేరవచ్చని తనూ పక్కగా మరో బండకు చేరగిలబడ్డాడు.

మనం నిద్రపోతున్నామని కాలమూ నిద్ర పోతుందా! ఉహూ! కాలానికి అలుపూ ఆయాసమూ లేదు. ఎవళ్ళకోసమూ నిలవకుండా దానిమానాన అది నడుస్తూనే ఉంటుంది.

సూర్యుడు దిగిపోయాడు.

చంద్రుడు పైపైకి ఎగబ్రాకాడు.

దూది ఎండవేసినట్టుగా వెన్నెల.

పగలల్లా ఎండలో పనిచేసిన జోగూ, నాగులూ కళ్ళుమూయటమే తడవుగా నిద్రలోకి జారుకున్నారు. తెల్లని వెన్నెలా, చల్లని పైరుగాలీ, చీమ చిటుక్కు మనేటంత నిశ్శబ్దం అన్నాదమ్ములిద్దరికీ జోలపాడేసింది.

పావురాలు రెక్కలు కదిలించినలాంటి చిన్న, మృదువైన శబ్దం! దానికే నాగు ఉలిక్కిపడి కళ్ళుతెరిచాడు. వాడికి రాత్రిళ్ళు అమ్మపక్కన లేందే నిద్రపట్టదు. అంత భయం.

"అన్నా! అన్నా!" అని మెల్లిగా జోగు భుజం గీకాడు. జోగు బిత్తరగా కళ్ళు తెరిచాడు.

"వెన్నెలకూడా వచ్చేసిందిరా నాగూ!" అన్నాడు జోగు భయంగా. ఇక రాత్రికి అక్కడే కాలం గడపాలనే భయం జోగును హడలకొట్టింది.

"అది కాదురా! ఏదో కదులుతున్నట్టు వినబడింది. సింహమో, పెద్దపులో" అన్నాడు నాగు.

"సింహాలూ, పులులూ ఇక్కడ లేవులే! కోతో, కొండముచ్చో అయివుంటుంది!" అన్నాడు జోగు భయంగా.

ఇద్దరూ ఆ వెన్నెట్లో చుట్టూ చూశారు. ఎదురుగా వున్న ఓ పెద్దరాయి వెనుక నుంచి ఈసారి పెద్దగా ధ్వని వచ్చింది. నాగు ఒక్క పరుగులో జోగు మెడ పుచ్చుకుని "అన్నా! అన్నా!" అన్నాడు.

అదే సమయంలో శ్రావ్యమైన చిన్న పెద్ద నవ్వులు ఆ రాతిపైనుంచి ప్రతిధ్వనించినాయి.

జోగు సగం భయం పోగా తల ఎత్తి అటుచూశాడు. నాగు భయం భయంగా కొంచెం తలఎత్తి సగం

కళ్ళు తెరిచాడు. ఇద్దరి దృష్టినీ ఆ నవ్వులూ, ఆ రాతి వెనక కదిలే అందమైన మొహాలూ ఆకట్టుకున్నాయి.

మరునిమిషానికి, ఆ రాతివెనుక నుంచి అనేకమంది గంధర్వకన్యలు వాళ్ళ దగ్గర దిగారు. అంద మైన మొహాలూ, కిలకిలమనే నవ్వులూ జోగునూ, నాగునూ స్థిమితపరిచి నాయి. జోగూ, నాగూ లేచి నిలబడ్డారు.

గంధర్వకన్యలు బొంగరాలలాగా వాళ్ళిద్దరి చుట్టూ తిరుగుతూ నాట్యం చేయసాగారు.

సోదరులిద్దరూ భయంపోయి, ఆనం దంతో చప్పట్లు చరిచారు. "ఎంత అందమైన పిల్లలు!" అన్నాడు జోగు.

"ఎంచక్కా ఆడుతున్నారు!" అన్నాడు.

ఆ మాటలతో నాట్యం ఆగిపోయింది. పాటలూ ఆగిపోయాయి.

గంధర్వకన్యలు అన్నదమ్ములచుట్టూ నిల బడి ఆ మాటా ఈ మాటా అనసాగారు.

"మా ఊరు వస్తారా? చాలా బాగుం టుంది!" అన్నది ఓ గంధర్వకన్య.

"ఓ! వస్తాం. అయితే దారేటు?" అని అడిగాడు నాగు. తొందరపడవద్దని జోగు తమ్ముడ్ని చేత్తోనే వారించాడు.

"అదే మా ఊరికి దారి!" అని ఓ గంధర్వకన్య వేలుతో చూపింది. జోగూ, నాగూ అటు చూశారు. ఒక అద్భుత దృశ్యం!

వాళ్ళ కళ్ళు ఆ అందానికి జిగేలుమన్నాయి.

"అది ఇంద్రధనుస్సులా ఉందే!" అన్నాడు జోగు.

"ఇంద్రధనుస్సు కాదు. మా ఊరుకూ, ఈ కొండ లకూ మధ్య వంతెన" అన్నది గంధర్వకన్య.

"వెళ్దామా?" అని అడిగాడు నాగు, జోగును.

"ఏమో!" అంటూ సంశయించాడు జోగు.

ఇదంతా వింటున్న గంధర్వకన్యలు అన్నదమ్ముల చేతుల్ని మృదువుగా పట్టుకుని, ఆ ఇంద్రధనుస్సులా వున్న వంతెనమీదుగా తమ దేశంలోకి తీసుకు పోయారు. అన్నదమ్ముల ఆనందానికి హద్దులు లేకుండాపోయినాయి.

వాళ్ళు విన్న శాస్త్రాల్లో, కన్నకలల్లో మాత్రమేవున్న, అన్ని అందాలూ, ఆనందాలూ అక్కడ వాళ్ళు చూడ గలిగారు. రోజులూ, నెలలూ, సంవత్సరాలే గడిచి పోతున్నా, వాళ్ళకు ఇంటిధ్యాసగాని, అమ్మ తలపు గాని కలగలేదు. గంధర్వకన్యల అందమైనమొహాలూ, కమ్మని పాటలూ, తియ్యని మాటలూ వాళ్ళ సర్వం మరిచిపోయేట్టు చేసినాయి.

ఓనాడు జోగూ, నాగూ ఆ గంధర్వలోకంలోని కొండల్లో ఈలలు వేసుకుంటూ షికారుకు వెళ్తు న్నారు. హఠాత్తుగా నాగు దృష్టిదారిపక్కన దుబ్బుగా పెరిగిన ఓ చిన్న చెట్టుమీద పడింది.

"అన్నా! ఇలాంటిచెట్టు మనం ఎక్కడో చూశామే!" అన్నాడు నాగు, జోగుతో.



జోగుకు వెంటనే గుర్తుకొచ్చింది. ఆ చెట్టూ, ఇంకా కొన్ని మూలికలకోసమే తనూ, తమ్ముడూ ఇంటి నుంచి బయలుదేరామని. తామూ తల్లీ గ్రామాలకూ కొండలకూ వెళ్ళడం, మూలికలు వెతకటం అంతా నిన్ననో, మొన్ననో జరిగినట్టుగా ఉంది.

"అమ్మ ఏమనుకుంటూ ఉన్నదో? రాత్రికి తిరిగి రాకపోతే బెంగపెట్టుకోదూ?"

జోగూ, నాగూ సాయంకాలానికల్లా మూలి కలున్న సంచీలతో ఇంటిని సమీపించారు.

వాళ్ళ ఇల్లు వాళ్ళే గుర్తుపట్టలేనంత గా మారిపోయింది. కప్పు కూలిపోవడానికి తయారుగా ఉంది. ద్వారబంధాలూ, తలు పులూ పుచ్చిపోయి, చెక్కలు ముక్కలుగా రాలిపోతున్నాయి. వాళ్ళు ఆశ్చర్యంతో అన్నీ చూస్తూ తలుపుతట్టారు.

"ఎవరుబాబూ!" అంటూ వణుకుతున్న గొంతుతో ఓ వృద్ధురాలు తలుపు తెరిచింది. ఓ క్షణం రెప్పవేయకుండా చూసి -

"మీరా! నా నాన్నలు!బాబులు! పన్నెండు సంవత్సరాలు గడిచినా, ఆ వెళ్ళిన రోజున ఎలా వున్నారో, అలాగే వున్నారు!" అంటూ కౌగిలించుకుంది.

జోగూ, నాగూ వెక్కివెక్కిఏడ్చారు. గంధర్వ కన్యల అందచందాలకు మోసపోయి కన్న తల్లికి కలిగించిన బాధ గ్రహించారు.

"ఇవిగో ఈ సంచుల్లో మూలికలున్నాయి. చాలా తెచ్చాం!" అంటూ తల్లిచేతికి వాటినిఅందించారు.

"ఇన్ని సంవత్సరాల తరువాత ఇంకా ఆ మూలి కల ఉపయోగం ఏముంటుంది నాయనా! అవి ఎండి పోయివుంటాయి. మీరు తిరిగివచ్చారు. అంతే చాలు!" అంటూ పాపమ్మ ఆ సంచులను అందుకుని లోపలకు చూసింది.





ఈ ఆలోచన ఇద్దరికీ బాధ కలిగించింది. సరాసరి గంధర్వకన్యల దగ్గరకు పోయి "ఇక్కడికి మేమువచ్చి ఎంతకాలమైంది?" అని అడిగారు.

గంధర్వకన్యలు నవ్వి -

"మీ దేశంలోమల్లే మా దేశంలో కాలం కొలిచేం దుకు గడియారాలూ అవీలేవు" అన్నారు.

"అయితే, మాదేశం వెళ్తాం!" అన్నారు ఇద్దరూ.

"ఏం! ఇక్కడ బాగాలేదా?" అన్నారు గంధర్వ కన్యలు.

"బాగానే ఉంది! కాని, మేము తీసుకుపోవలసిన మూలికలమాటే మరిచిపోయి ఇక్కడ కాలయాపన చేశాం. ఇక వెళ్ళాలి" అన్నారు నాగు, జోగు.

ఎంతచెప్పినా లాభంలేకపోగా, గంధర్వకన్యలు జోగూ, నాగుల్ని ఆ ఇంద్రధనుస్సులాంటి వంతెన మీదుగా తిరిగి ఈ లోకానికి దించారు.

ఆమెకు అక్కడ మెరుస్తున్న ముత్యాలూ, రత్నాలూ కంటబడినాయి. ఆశ్చర్యంతో సంచిలో చేయిపెట్టి ఒక గుప్పెడు బయటికి తీసింది.

ఎండిపోయిన ప్రతి మూలికకూ, ఆకుకూ నిండుగా ముత్యాలూ, రత్నాలూ గుచ్చబడివున్నాయి.

అంతవరకూ ఆ సంగతి తెలియని జోగూ నాగూ కూడా ఉప్పొంగిపోయారు. పాపమ్మ కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలినాయి. ఇద్దరు కొడుకులనూ గట్టిగా కౌగిలించుకుని ముద్దాడింది.

ముత్యాలూ, రత్నాలతో తిరిగివచ్చినందుకు అమ్మ ఆనందపడుతున్నదని జోగూ, నాగూ అను కున్నారుగాని, ప్రాణాలతో తిరిగివచ్చిన కన్నబిడ్డల్ని చూసుకుని తల్లి ఎక్కువగా ఆనందపడుతున్నదని, ఆ పసివాళ్ళకు తెలీదు కదా!

డి. హైమవతి

చిత్రం : రంగనాథ్

# 'ఊ' కొడతావా?

## సి.యమున

"కన్నయ్యా, రేపు నువ్వు చీకటితోనే లేవాలి" ప్రేమగా అడిగింది కుచేలమ్మ.

"బామ్మా, భలే అడిగావు. నేనే నిన్ను అడుగుదామనుకున్నాను పెందరాళే లేపమని"

"నువ్వు ఎంత మంచివాడవురా. రేపు వైకుంఠ ఏకాదశి అనేదే మర్చిపోలేదు సుమీ" మురిసిపోయింది కుచేలమ్మ.

"బామ్మోయ్, నేను లేపమంది దాని కోసంకాదు. నా హాలిడేని యూజ్‌ఫుల్‌గా వాడుకుందామని"

"అంటే చదువుకోవటానికా? పొద్దున్నే లేచి చదువుకోవటానికి ఇప్పుడు పరీక్షలు కూడాలేవుగా"

"ఉంది పరీక్ష, కాని క్లాస్‌వి కాదు"

"మరి"

"క్రికెట్ పోటీలో అగ్నిపరీక్ష. తొందరలోనే మా ఇంటర్ స్కూల్ క్రికెట్ పోటీలు. నేను కూడా సెలక్ట్ అయ్యాను కదా మర్చిపోయావా?"

"అదంతా నాకనవసరం. రేపు నువ్వు తెల్లవారు ఝామున లేచి నాకుతోడుగా గుడికి రావాల్సిందే"

"నీకు కావాలంటే అమ్మను తీసుకుపో... నేను మటుకు రాను" అని చెప్పాడు.

"అమ్మను తీసుకుపొమ్మని నీ సలహా అక్కర్లేదు. తనకు నిన్నటి నుండి జలుబు, దగ్గు. అంత పొద్దున్నే స్నానంచేసే పరిస్థితి తనకు లేదు"

"బామ్మా, నీ దేవుడుకోసం నా క్రికెట్‌ని వదులుకోను. ఈ మధ్య సెలవలే లేవు... వచ్చిన ఒక్క హాలిడేని వేస్ట్ చేసుకోను"

"ఏమిట్రా బామ్మతో ఆ మాటలు. గుడికి వెళ్ళి వచ్చి క్రికెట్ ఆడుకో" అంతా వింటున్న ఆశారాణి ఓపిక కూడగట్టుకుని కసిరింది.

"అక్కడకు వెళ్ళి వచ్చినతరువాత ఇంకా క్రికెట్ ఆడటమే... వెల్లకిలాపడటంతప్ప"

"అమ్మా, నీకున్న భక్తితో పడుతున్న, పెడుతున్న తిప్పలు చాలు. ఇంకా వాడికి కూడా అంటగట్టకు" అప్పటిదాకా వాళ్ళ సంభాషణను ఫాలో అవుతున్న కూర్మావతారం కుచేలమ్మకి నిక్కచ్చిగా చెప్పాడు-

"నీకు భక్తే కాదు, భయమూ లేదు. ఈ వయస్సులో అన్నా నీ పేరుమీద గౌరవం చూపు. కనీసము వాడి నన్నా సరియైన మార్గంలో నడవనీరా. బామ్మ మాట గౌరవించమని చెప్పు" మొత్తుకుంది కుచేలమ్మ.

"అత్తయ్యా, మీరు అంతలా బాధపడకండి. నేను వస్తాను, అవసరమైతే ఇంకో టాబ్లెట్ ఎక్స్‌ట్రా మింగుతాను" నీరసంగా అంది ఆశారాణి.

"నువ్వూరుకోవే. కన్నయ్య నా మాట వింటాడు. బాబూ కన్నయ్యా ఇంకేంచెప్పకు. ఈ బామ్మ ప్రోగ్రామ్‌కి 'ఊ'కొట్టి ఈ సీన్‌కి ఫుల్‌స్టాప్ పెట్టవూ. ప్లీజ్".

కాళ్ళు, కళ్ళతో 'వద్దని' సైగ చేస్తూనేవున్నాడు కూర్మావతారం. "బామ్మ సెంటిమెంట్‌తో కొట్టాలని చూస్తోంది. నేను మటుకు క్రికెట్‌లో షాట్స్‌కొట్టాలని చూస్తున్నా. సో, సారీ" అంటూ 'ఉహు'కొట్టేశాడు కన్నయ్య.



"ఏరా కృష్ణా, పిక్నిక్‌కి కారప్పూస, చెగోడీలు ప్యాక్ చేసి పంపమని పక్కనున్న స్వీట్‌షాప్‌లో చెప్పాను. బూందీ కూడా చెప్పనా?"

"చెప్పమ్మా చెప్పు. చెగోడీలు ఏమిటీ, అరిసెలు, బూందీ కూడా చేసి మూటగట్టు. అవి అక్కడ అందరికీ అమ్మి నా పిక్నిక్‌కి ఖర్చు అయ్యే డబ్బులు సంపాదిస్తాను" ఎగిరెగిరిపడ్డాడు కృష్ణ.

"అయ్యో, కన్నతల్లి ప్రేమను అర్థం చేసుకోకుండా ఏమిట్రా ఆ మాటలు..." అంటూ బుగ్గలు నొక్కుకుంది కుచేలమ్మ.

"నువ్వుండు బామ్మ... మధ్యలో కల్పించుకోకు. నా పి.జి. ముగిసి స్టూడెంట్ లైఫ్ ఐపోవచ్చింది. ఇన్నేళ్ళల్లో ఒక్కసారంటే ఒక్కసారన్నా స్టూడెంట్స్‌తో పిక్నిక్‌కి పంపారా? ఎక్కడికి వెళ్ళాలన్నా ఒక్కడే కొడుకు అని కట్టడి. ఇప్పుడేదో సరదాగా వెళ్దామంటే మూటలు మోసుకెళ్ళమంటోంది" విసురుగా సమాధానమిచ్చాడు కృష్ణ.

"ఒరేయ్ కృష్ణా ఉన్నావా... వెళ్ళిపోయావా... హమ్మయ్య ఉన్నావు కదా! బ్రతికాను..." ఆయాస పడుతూ వచ్చాడు కూర్మావతారం.

"మా బస్ బయలుదేరేది రాత్రి తొమ్మిదింటికి కదా. ఇంకో గంటపైనే టైమ్ ఉంది నాన్నా కంగారు పడకు" అన్నాడు కృష్ణ.

"కంగారుపడక ఏం చెయ్యాలిరా"

"అబ్బా, నాన్నా తిండి గురించి ఇప్పటిదాకా వీళ్ళు తిన్నారు. ఇప్పుడు కంగారని మీరు నాకు గుండె దడ తెప్పిస్తున్నారు. నా ప్రోగ్రామ్‌కి ఎసరుపెట్టరు కదా" అనుమానంగా అడిగాడు కృష్ణ.

"ప్రోగ్రామ్‌కి ఎసరుపెట్టే పరిస్థితేరా కృష్ణా. లేకపోతే నా ఉద్యోగమే ఊడే పరిస్థితి..." కళ్ళనీళ్ళతో చెప్పాడు కూర్మావతారం.

"ఏంటండీ, ఆ అశుభం మాటలు" కెవ్వుమంటూ చెంపలేసుకుంది ఆశారాణి.

"అశుభం కాదు. భవిష్యత్తు దర్శనం"

"ఏమిట్రా నీ అర్థంపర్థంలేని వాగుడు. కొంపతీసి ఏ జ్యోతిష్కుడినో కలిసివచ్చావా?" అనుమానంగా అడిగింది కుచేలమ్మ.



రాజ్యాంగం అసమ్మతికి చోటు కల్పించింది.
-జస్టిస్ డి.వై.చంద్రచూడ్, సుప్రీమ్‌కోర్టు జడ్జి




"జ్యోతిష్యం కాదు బ్రతుకు భయం. కళ్ళెదుటి నిజం..." అన్నాడు కూర్మావతారం.

"సీరియల్స్ చూసేది మేమైతే, నువ్వేంట్రా రెచ్చిపోయి తెగ డైలాగ్స్ చెపుతున్నావు. ఈ ముసలి గుండె తట్టుకోలేకపోతోంది. నీకు పుణ్యముంటుంది అసలు విషయంలోకి రారా తండ్రీ"

"నేను కష్టపడి కొనుక్కున్న రెండువందల గజాల స్థలానికి చుట్టూతా ప్రహరీ గోడ కట్టిద్దామనుకుని మనుషుల్ని మాట్లాడుకుని అడ్వాన్స్ కూడా ఇచ్చాను గుర్తుందా"

"నాన్న, మా జ్ఞాపకశక్తికి పరీక్షలు పెట్టటం పక్కన పెట్టి అస్సలు ఫిట్టింగ్ ఏమిటో తేల్చండి" విసుగ్గా అన్నాడు కృష్ణ.

"ఫిట్టింగ్ ఏమిట్రా నా కొడుకును పట్టుకుని..." గయ్యిమంది కుచేలమ్మ.

"నేను అన్నది నీ కొడుకును కాదు నా డాడీని" అని అంతకన్నా గయ్యిమన్నాడు కృష్ణ.

"కాస్త ఊరుకోండి అత్తయ్యగారు అసలు విషయం ఏమిటో ఆయన్ని చెప్పనీయండి"

"సెలవు పెట్టుకుని వెళ్ళి ఆ పని దగ్గర కూర్చుందామనుకున్నాను. కానీ మా ఆఫీసులో సడెన్ ఇన్స్పెక్షన్ అని అనౌన్స్ చేశారు. రేపు ఆఫీసుకు గైరుహాజర్ అయితే ఉద్యోగంనుండి ఊస్టింగ్ ఇచ్చి పంపుతామని బాస్ స్ట్రిక్ట్‌గా చెప్పాడు"

"నీ ప్రాబ్లమ్‌కి నన్నేం చెయ్యమంటావు" అంటూ నిలదీశాడు కృష్ణ.

"నువ్వు స్థలం దగ్గరికి వెళ్ళి పనివాళ్ళ సంగతి చూడు. నేను ఆఫీసుకు వెళతాను"

"వాట్, నో వే నాన్నా. వెళ్ళక వెళ్ళక వెళుతున్నా. నా పిక్నిక్‌ని నేను త్యాగం చెయ్యను" పక్కన వున్న బల్లను ఇరక్కొట్టి మరీ చెప్పాడు కృష్ణ.

"అయ్యో, ఎవరూ ఆవేశపడకండి. నేను వెళ్ళి ఆ గోడ పని చూస్తాను. మీరు ఆఫీసుకు వెళ్ళిపోండి" నమ్మకంగా చెప్పింది ఆశారాణి.

"నీకేం తెలుసనీ చూస్తావు. వాడంటే ఇంజనీర్ కాబట్టి చూడగలడు"

"ఆ చిన్న పనికి ఇంజనీర్ కావాలా...? నేను సరిపోను" అంది ఆశారాణి.

"నేను ఎవ్వరినీ నమ్మను. గతిలేక వాడిని అడిగాను. అదికూడా వాడు కాబోతున్న సివిల్ ఇంజనీర్ అవ్వబట్టి" అన్నాడు కూర్మావతారం.

"మీరు నన్ను పొగిడినా, బట్టర్ వేసినా లొంగేది లేదు. పిక్నిక్ వదులుకొనేది లేదు, నాన్నా"

"వాడిని వెళ్ళనీరా, చిన్న పనేగా. పనివాళ్ళ సంగతి నేను చూసుకుంటాను. ఈ ఇల్లు కట్టించింది కూడా నేనేగా" ధీమా వ్యక్తంచేసింది కుచేలమ్మ.

కళ్ళు వెళ్ళబెట్టి చూశారు ముగ్గురూ.

"ఎందుకురా, అలా చూస్తున్నారు? మా రోజుల్లోని ఎస్.ఎస్.ఎల్.సి.తో నేటి బి.టెక్. కూడా దిగదుడుపే అని అందరూ అనేదేగా. బయటకు పెట్టిన మీ కనుగుడ్లను వెనక్కు లాక్కోండి" మహా కాన్ఫిడెంట్‌గా చెప్పింది కుచేలమ్మ.

"బామ్మ, టూ మచ్‌గా మాట్లాడకు... నా ఇంజనీరింగ్ అంటే నీకు అంత జోక్ అయిపోయిందా?" కస్సుమన్నాడు కృష్ణ.

"ఉన్నది మాట్లాడితే ఉలుకెందుకురా? నీకు అడుగుకి ఎన్ని అంగులాలో తెలుసా? గజానికి ఎన్నిమీటర్లో చెప్పు" సవాలు విసిరింది బామ్మ.

"ఓస్, అదెంత సేపు. నువ్వడిగేది ఇంగ్లీష్‌లో అడుగు. ఇట్టే చెప్పేస్తాను" చేతిలోకి మొబైల్ తీసుకుని నెట్ ఆన్ చేసి చిటికేస్తూ స్టైల్ కొట్టాడు కృష్ణ.

"మీ చిటికెలు వేసుకోవటాలు, తొడ కొట్టడాలు పక్కకు పెట్టి నా గోడ ప్రోగ్రామ్‌కు 'ఊ' కొట్టరా" అని దీనంగా అడిగాడు కూర్మావతారం.

"కృష్ణా, టైమవుతోంది చూసుకో. ఇదిగో ఈ చిల్లర పెట్టుకో. పిక్నిక్‌లో బబుల్ గమ్స్ కొనుక్కోవటానికి పనికొస్తుంది" ఇన్‌డైరెక్ట్‌గా తన నిర్ణయాన్ని తెలియచేస్తూ హెచ్చరిక చేసింది ఆశారాణి.

అమ్మ హెచ్చరికను అర్థం చేసుకుని అరక్షణంలో సూట్‌కేస్ సర్దుకుని నాన్న ప్రోగ్రామ్‌కు 'ఊ' కొట్టకుండా 'నో' చెప్పి ఆ పై అందరికీ బై కూడా చెప్పి బయటకు నడిచాడు కృష్ణ.

కూర్మావతారం బోరుమన్నాడు. అది చూసి "వీడు మొండి ఘటంరా బాబు. నేను బ్రతికుండగా వీడి నోటి నుండి 'ఊ' కొట్టడం వినను" బాధగా అంది కుచేలమ్మ. తన ఉద్యోగంకన్నా గోడకట్టడానికి అడ్వాన్స్‌గా చెల్లించిన కూలీ పోగొట్టుకోవటమే బెటర్ అని లెక్కలేసుకుని గుండెను దిటవు చేసుకుని మర్నాడు ఆఫీసుకెళ్ళిపోయాడు కూర్మావతారం.

త్రివేండ్రంలోని కోవలం బీచ్ రకరకాల జనాలతో కళకళలాడుతోంది. కొంతమంది గుంపుగా,

## కొండంత అభిమానం

దక్షిణాదిన తనకు గల అభిమానుల్ని దృష్టిలో పెట్టుకునే 'సాహో' సినిమా చేస్తున్నానని చెప్తోంది శ్రద్ధాకపూర్. "ఇది సౌత్‌లో నా తొలి సినిమాకాబట్టి కొంచెం నెర్వస్‌గానే ఉంది. పాత్రను చాలా శ్రద్ధగా అర్థంచేసుకుని నటిస్తున్నాను.

అనుభవం వేరు, ప్రారంభం వేరు. ఓ పని చేస్తున్నప్పుడు అనుభవంతో చేస్తున్నామా? మొదటిసారి చేస్తున్నామా? అన్న సంగతిని ఇట్టే పట్టేయవచ్చు. ఎన్ని కోట్లు పోసినా సంపాదించుకోలేనిది అభిమానంమాత్రమే" అంటున్నది శ్రద్ధాకపూర్.





కాంగ్రెస్, ఇతర ప్రతిపక్షాలు కలిసి ఏర్పాటుచేసే మహాకూటమి ఒక బూటకం, ప్రజలు దానిని విశ్వసించరు. -అమిత్‌షా, బి.జె.పి. అధ్యక్షుడు



బి.జె.పికి వ్యతిరేకంగా దేశవ్యాప్త కూటమి సాధ్యంకాదు. ప్రధాని అభ్యర్థిని ప్రకటించలేం.
-కపిల్ సిబాల్
కాంగ్రెస్ నేత

కొందరు ఒంటరిగాను, మరికొందరు జంటగాను నడుస్తున్నారు. పిక్నిక్‌కు వచ్చిన రోజా, దీపక్ కాసేపు నడిచి, అలసి ఇసుకలో కూర్చున్నారు.

"దీపక్, ఆకాశం నీలంగా అందంగా ఉంది కదూ" గోముగా అడిగింది రోజా.

అస్తమిస్తున్న సూర్యుడితో ఎర్రగా ఉన్న ఆకాశాన్ని కళ్ళు నులుముకుని చూశాడు దీపక్.

"నీలంగా ఎక్కడుంది, ఎర్రగా కదా ఉంది రోజా" హెజిటేషన్‌తో అన్నాడు దీపక్.

వెనకనుండి పిలుస్తున్న దీపక్ మాటలు పట్టించుకోకుండా రయ్యిన లేచి వెళ్ళిపోయింది రోజా.

ఆమె అట్లా ఎందుకు వెళ్ళిందో అర్థం కాలేదు. అప్పటికీ ఆ చుట్టుపక్కలవాళ్ళని వెర్రిపట్టినట్లు ఆకాశం ఏ రంగులో ఉందని అడిగి చూశాడు. కొంత మంది విసుక్కున్నారు. మరికొంతమంది జాలిపడి "ఎరుపు బాబూ" అంటూ దయగా చెప్పారు. అర్థం కాని పజిల్‌లాంటి రోజా ప్రవర్తన గురించి ఆలోచిస్తూ తానూ హోటల్‌రూమ్‌కి వెళ్ళిపోయాడు దీపక్.

రాత్రి డైనింగ్ హాల్‌లో ఎదురుపడ్డ రోజా, దీపక్‌ను చూసి నవ్వులు విసిరి చెయ్యి పట్టుకుని ఓ మూలగా వున్న టేబుల్ దగ్గరకు తీసుకెళ్ళి కూర్చోబెట్టింది.

"సాయంత్రం బీచ్‌లో రుసరుసలాడిన రోజాయేనా ఈమె" అని ఒక్కక్షణం ఆశ్చర్యపోయాడు దీపక్. కాని ఆ మాట పైకి అంటే ఏం మూడుతుందో అనుకుని మనసులోనే నొక్కేశాడు. ఇద్దరూ ఫుడ్‌తోపాటు కబుర్లూ ఎంజాయ్ చేస్తున్నారు.

"ఈ బాదుషా ఎంత తియ్యగా, బాగుందో కదా" చేతిలోని జిలేబీని కొరికితింటూ ముద్దుముద్దుగా అడిగింది రోజా.

"అది బాదుషా కాదు జిలేబి" అని చెప్పబోయి సాయంత్రం అనుభవం ఇంకా బుర్రలో జోరీగలాగా రొదపెడుతుంటే రాబోయే మాటను జిలేబీతోపాటు మింగేసి "అవును, బాదుషా బాగుంది" అని తియ్యని అబద్ధం చెప్పాడు. రోజా కళ్ళు మెరిసిపోయాయి. మరింత ముద్దుముద్దుగా మాట్లాడి స్వీట్ డ్రీమ్స్‌కూడా చెప్పి తన రూమ్‌కేసి వెళ్ళిపోయింది.

రోజా అటు వెళ్ళిన మరుక్షణం మొబైల్ తీసి తన మనసులోని ప్రతి మాటా చెప్పుకునే తన చిన్ననాటి ప్రాణస్నేహితుడికి ఫోన్ చేశాడు.

"ఏంట్రా ఈ టైమ్‌లో ఫోన్" ఆవలిస్తూ బద్ధకంగా అడిగాడు అవతల ఫ్రెండ్. "నేను చెప్పింది వింటే నీకు నిద్ర దెబ్బకు ఎగిరిపోతుంది"

"ఏంది మావా, సంగతి? అక్కడ బీచ్‌లో తమన్నాగాని, రకుల్‌గాని ఎదురుపడ్డారా"

"అదే సంగతైతే నీకు ఫోన్ చేసే స్థితిలో నేను ఉంటానా"

"అబ్బా, మరేంట్రా"

"మా కాలేజీ టాపర్ రోజా లేదూ"

"నా పక్కనైతే లేదు"

"నీ కుళ్ళు జోకులు ఆపి నేచెప్పేది జాగ్రత్తగా విను" అంటూ మొత్తం చెప్పాడు దీపక్.

పెద్దగా నవ్వాడు బాల్య మిత్రుడు.

"ఏంట్రా ఈపిచ్చికథవిని నీకూ పిచ్చెక్కిందా?"

"ఒరేయ్ స్టుపిడ్. నీకు బుర్రలేదురా. ఆఅమ్మాయి నీ ప్రేమలో పడింది. ప్రేమికుడైన నీ సమక్షంలో ఆమెకు అన్నీ ఉల్టాపుల్టాగా అనిపిస్తున్నాయి"

"వాట్, నిజంగానా?"

"నిజ్జంగా"

"మరి ఆ అమ్మాయి 'ఐ లవ్ యు' చెపితే నేనేం చెయ్యాలిరా" అయోమయంగా అడిగాడు దీపక్.

"అది కూడా నేనే చెప్పాలా... టూ మచ్" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"అందం, చదువు, డబ్బు అన్నీఉన్న రోజా తనను ఇష్టపడుతోందా? అదే నిజమైతే తనేం చెయ్యాలి?" తరచి తరచి ఆలోచించుకున్నాడు.

ఒకవేళ రోజా తన ప్రేమే వ్యక్తపరిస్తే తను పుట్టి బుద్దెరిగినతరువాత చెయ్యని పనిని మొట్టమొదటి సారి చెయ్యాలని డిసైడ్ అయిపోయాడు.

త్రివేండ్రం నుండి కొచ్చి ఎక్స్‌ప్రెస్ హైదరాబాద్ కేసి దూసుకెళుతోంది. పిక్నిక్ ముగించుకుని వెనక్కి వెళుతున్న స్టూడెంట్స్ కేరింతలతో బోగీ దద్దరిల్లుతోంది. వాళ్ళకు దూరంగా ఎసి కోచ్ బయటకువచ్చి, డోర్ దగ్గర నుంచుని ఉన్నారు దీపక్, రోజా.

పరుగెడుతున్న పచ్చని కొబ్బరి చెట్లను చూస్తూ "ఐ లవ్ యూ దీపూ. డు యు లవ్ మి?" అని స్వీట్‌గా అడిగింది రోజా.

"ఊ" అన్నాడు దీపక్ గాలిలో తేలిపోతూ.

"నిజంగా"

"ఊ... నిజంగా ఒట్టు" అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని సుతారంగా ముద్దు పెట్టుకుని సమాధానమిచ్చాడు దీపక్.

అలా మొట్టమొదటిసారిగా 'ఊ' కొట్టిన బుజ్జిగాడు, కన్నయ్య అని ముద్దుపేర్లతో పిలవబడే 'కృష్ణ దీపక్'కి 'ఊ' కొట్టడం అక్కడితో, ఆ రోజుతో ఆగలేదు. రోజా చెప్పిన ప్రతిదానికీ 'ఊ' కొడుతూనే ఉన్నాడు. ఇన్నేళ్ళుగా 'ఊ' కొట్టరా బాబూ అని మొత్తుకున్న కుచేలమ్మ... ఆశారాణి మరియు కూర్మావతారం కృష్ణ దీపక్ 'ఊహు' కొట్టాలని బ్రతిమాలటం మొదలెట్టారు.



## ఫ్యాషన్ గాళ్

ఏ భాష అయితే, ఏ ప్రాంతం అయితే నాకేంటి అన్నట్లు అదాశర్మ ఎక్కడ అవకాశాలు దొరికితే అక్కడకు చెక్కేస్తున్నది. బాలీవుడ్‌లో కొత్త సినిమాకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చి, ఫ్యాషన్ గాళ్ పాత్రకు సర్వదా సిద్ధమవుతోంది. లేటెస్ట్ ఫ్యాషన్ పోకడలపట్ల అప్‌డేట్ అయ్యే ప్రయత్నాల్లో ఉంది.

"నాకు చిన్నప్పటినుంచి ఫ్యాషన్ సినిమాలు చూసే అలవాటుంది కాబట్టి, ఈ పాత్ర బాగా సూటవుతుంది. ప్రేక్షకులూ నాకు బాగా కనెక్ట్ కాగలరని భావిస్తున్నాను. నటనకు ఆస్కారం గల పాత్ర" అంటూ ఊదరగొట్టేస్తున్నది.

The thoughtful soul to solitude retires

## తక్షణ శక్తి

వాతావరణం చల్లచల్లగా ఉన్నప్పుడు ఖర్జూరాలు తింటుంటే శరీరానికి తక్షణ శక్తి లభిస్తుంది. ఐరన్, విటమిన్, మినరల్స్ పుష్కలంగా లభిస్తాయి.

రోగనిరోధకశక్తి పెరుగుతుంది. కాబట్టి, సీజన్లు మారుతున్నా శరీరం తట్టుకుంటుంది. ఖర్జూరలో యాంటీ ఆక్సిడెంట్స్ వుంటాయి.

బి1, బి2, బి3, బి5, ఎ విటమిన్లుంటాయి. పొటాషియం, ఐరన్ ఖర్జూర పండ్లలో అత్యధికంగా లభిస్తాయి.

ఉదయం నిద్రలేచాక, రాత్రి పడుకునే ముందు నాలుగు ఖర్జూరాలు తింటుంటే జీర్ణక్రియ మెరుగవుతుందని నిపుణులు సూచిస్తున్నారు.

ఎదిగే పిల్లలకు ఖర్జూర పండ్లు చాలా మంచి ఆహారం. రక్తహీనతగలవారు ఖచ్చితంగా తినాల్సిన పండ్లు ఇవి. చర్మం బాగా నిగారిస్తుంది. ◆

## మెనోపాజ్ దశలో

మహిళలు మెనోపాజ్ దశకు వచ్చిన తర్వాత కొన్ని సమస్యలు తలెత్తుతుంటాయి. వీటికి తోడు బరువూ పెరుగుతుంటారు. మెనోపాజ్ దశలోని అనారోగ్యాలకు బరువు కూడా ఓ కారణం అవుతుంటుంది.

వయసు నలభైఐదు సంవత్సరాలు దాటేకొద్దీ ఈస్ట్రోజెన్ హార్మోన్ విడుదల క్రమంగా తగ్గుతుంది. జీవక్రియ కూడా మందగిస్తుంది.దీనివల్ల పెరిగిన బరువు, ఉదరం వద్ద పేరుకుపోయిన కొవ్వు తగ్గడం కష్టం అవుతుంది.

కనుక, ఈ వయస్సులో, మెనోపాజ్ దశలో వ్యాయామాలు ఎక్కువసేపు చేయాల్సి ఉంటుంది.

వాకింగ్‌తోపాటు యోగా వంటివి చేస్తుంటే మంచిది. హార్మోన్ల ప్రభావం వల్ల మూడ్ స్వింగ్స్ వుంటాయి. కాబట్టి ఒత్తిడిని తగ్గించుకునే ప్రయత్నాలు తప్పనిసరిగా చేస్తుండాలి.

వీలైనంత చురుగ్గా వుంటుంటే మనస్సు, శరీరం బాగుంటాయి. ◆



Courtesy : VANITHA

## ఒత్తిడికి చెక్

ప్రతినిత్యం పనుల హడావిడి నడుమ ఎటువంటివారికి అయినా ఎంతో కొంత ఒత్తిడి తప్పదు.

ఎదురయ్యే ఇబ్బందులు కోపాన్ని తెప్పిస్తుంటాయి. ఒత్తిడిని, కోపాన్ని తగ్గించుకోవడానికి లోతుగా ఊపిరి పీల్చి వదిలేస్తుండాలి. దీనివల్ల కోపం తీవ్రత, ఒత్తిడి తగ్గుతాయి.

తలెత్తిన సమస్యనుంచి మనస్సును మళ్ళించుకోవాలంటే, ఏదో ఒక నచ్చిన సన్నివేశాన్ని ఊహించుకోవాలి.

దీనివల్లకొంత ఆహ్లాదపూరిత వైఖరి కలిగి, సమస్య తొలగిపోయి మనస్సు తేలికపడుతుంది.

హఠాత్తుగా వచ్చే ఆవేశానికి, కోపానికి ఇటువంటి ఊహలు మంచిమందులాంటివి.కోపం,ఆగ్రహం ఒత్తిడికి గురిచేయకముందే ఇటువంటి చర్యలుచేపట్టడం అన్ని విధాలా శ్రేయస్కరం. ◆

## దొండ భలే మెండు

దొండ గురించి చాలామంది పట్టించుకోరు.పైగా అవి తింటే చదివింది మర్చిపోతామన్న ఓ అపోహ కూడా ఉంది. కాని వీటిలో అనేక పోషకాలు, ఫలితాలు ఉంటాయంటున్నారు నిపుణులు.

ముఖ్యంగా డయాబెటిస్‌గలవారికి చాలామంచిది.శరీరంలో విడుదలయ్యే చక్కెరను నెమ్మదింపజేస్తుంది.

కొవ్వుగా మారే కణాలను దొండకాయ నియంత్రిస్తుంది. పీచు అధికంగా ఉంటుంది కాబట్టి, జీర్ణవ్యవస్థ సక్రమ పనితీరుకు ఉపకరిస్తుంది.

అందులో ఐరన్ చాలా ఎక్కువగా లభిస్తుంది. క్యాల్షియం, మెగ్నీషియం, పొటాషియం, మాంగనీస్,విటమిన్ సి, ఎ,బికాంప్లెక్స్ ఎక్కువగా లభిస్తాయి.

రోగనిరోధకశక్తిని పెంచుతుంది. శరీరంలో ఎక్కడైనా ఇన్‌ఫ్లమేషన్ ఉంటే తగ్గించడంలో దోహదపడుతుంది.

నాడీ వ్యవస్థ, కండరాలు, లిగమెంట్లు, టెండాన్లు దృఢంగా వుండేందుకు దొండ ఉపకరిస్తుంది.

డా॥ జి.సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com



## డా॥ జి. సమరం

**సి.ఎస్.** — నెల్లూరు

*మాకు పెళ్ళై రెండుసంవత్సరాలైంది. ఇంత వరకు అంగ ప్రవేశం జరగలేదు. మావారు ప్రతి రోజూ సెక్స్‌కి ప్రయత్నిస్తారు. అయినా యోని లోకి అంగం ప్రవేశించడంలేదు. చివరికి యోనిదగ్గరే వీర్యస్ఖలనమైపోతుంది. అంగం మెత్తబడిపోతుంది.*

*లోపం నాలో వుందా? మావారిలో వుందా? మావారి లింగం స్ట్రాంగ్‌గా లేదా?*

కొందరు స్త్రీలల్లో యోనిద్వారం కాస్త టైట్‌గా ఉంటుంది. సెక్స్‌లో పాల్గొనేముందు చేతివ్రేలితో యోని ద్వారాన్ని వెడల్పుచేసి అంగప్రవేశం జరిగే టట్లుగా సహకరించినట్లైతే సెక్స్ తేలికగా జరుగుతుంది. కొందరు అమ్మాయిలలో సెక్స్ కావాలని కోరిక ఉన్నప్పటికీ మనస్సులో అంతర్లీనంగా సెక్స్ అంటే తెలియని భయం ఉంటుంది.

సరిగ్గా అంగప్రవేశం సమయంలో యోని ద్వారం బిగుసుకుపోతుంది. ఎంతకీ తెరుచుకోదు. వాళ్ళల్లో ఉన్న భయమే ఇందుకు కారణం. ఏదైనదీ డాక్టర్‌కి చూపించుకుని చికిత్స పొందడం మంచిది.

మీవారి లింగం బాగానే ఉన్నట్లుగా భావించాలి. ఎందుకంటే వారికి అంగస్తంభనలు వున్నాయి, వీర్య స్ఖలనం అవడం ఉంది. అందుకని ముందు మీరు డాక్టర్ దగ్గరకు వెళ్ళి పరీక్ష చేయించుకోండి.

**బి.కె.** — రాజమండ్రి

*నా వయస్సు 60 సంవత్సరాలు. నాకు బి.పి. షుగర్‌లు లేవు. ఈ రోజువరకు నేను సెక్స్‌లో పాల్గొం టూనే వున్నాను. నాకు ఇంత వయస్సు వచ్చినప్పటికీ సెక్స్‌లో పాల్గొనడం ఏమైనా వ్యాధా? బ్రెయిన్‌లో ట్యూమర్స్ ఇందుకు కారణమా? ఎందుకిలా అడుగుతున్నానంటే ఇటీవల మా ఫ్రెండ్‌కి అనుకోకుండా సెక్స్ కోరిక విపరీతంగా పెరిగిపోయింది.*

*భార్యనే కాకుండా బయట స్త్రీలని కూడా అనుభవించాడు. చివరికి అతని ఆరోగ్యం చెడిపోయింది. పిచ్చివాడిగా మారాడు. చివరికి డాక్టరుదగ్గరికి తీసుకు వెళితే బ్రెయిన్‌కి ఎమ్.ఆర్.ఐ. తీసి మెదడులో ట్యూమర్స్ ఉన్నాయని, ఆ ట్యూమర్స్‌వలనే అతను అలా తయారయ్యాడని చెప్పాడు. చివరికి అతను ఆ ట్యూమర్స్‌వల్లనే మరణించాడు.*

*వృద్ధాప్యం వచ్చినప్పటికీ నాలో సెక్స్ తగ్గకపోవడంతో నా స్నేహితుని పరిస్థితే నాకు గుర్తుకువస్తుంది. నేను ఏమైనా అలా అయిపోతానా?*

ఆరోగ్యంగా ఉన్న వ్యక్తి 70 వచ్చినా, 80 వచ్చినా సెక్స్‌లో యాక్టివ్‌గానే ఉంటాడు. సెక్స్‌లో పాల్గొనడం ఎటువంటి అనారోగ్య పరిస్థితి కాదు. మీ స్నేహితునికి బ్రెయిన్‌లో ట్యూమర్స్ రావడంతో ప్రవర్తనలో వైపరీత్యం చోటుచేసుకునుంటుంది. ఆయన విషయం, మీ విషయం ఒకటికాదు, అందుకని భయపడకండి.

**సి.కె.ఆర్.** — కరీంనగర్

*నా వయస్సు 21 సంవత్సరాలు. గత ఆరు సంవత్సరాల నుండి రోజూ హస్తప్రయోగం చేసుకుంటున్నాను. ఇప్పుడు నా అంగంకింద ఉండే గోలీ ఒకటి పెద్దదిగా ఉంది. ఒకటి చిన్నదిగా ఉంది. హస్తప్రయోగం వల్ల ఈ ప్రాబ్లమ్ వచ్చిందా? పెళ్ళికి పనికివస్తానా, పనికిరానా? పెళ్ళిచేసుకుంటే పిల్లలు పుడతారా, పుట్టరా? ఆందోళనగా ఉంది. జవాబివ్వండి.*

హస్తప్రయోగంవల్ల టెస్టికల్స్ వాయడం ఉండదు. మీకు ఒక వృషణం వాపుగా కనబడటానికి వరిబీజం కూడా కారణం కావచ్చు. కాబట్టి డాక్టరుకి చూపించుకోండి. నిరభ్యంతరంగా పెళ్ళిచేసుకోవచ్చు.

దత్తు ఆ డబ్బుని అలాగే అలోక్ చేతిలో పెట్టేశాడు.

"లెక్క సరిగానే ఉంది కదా?" అన్నాడు అలోక్ ఆ కవర్‌బరువు చేతితో ఫీల్ అవుతూ. "ఉంటుందిలే! లేకపోతే మనం ఎక్కడకు పోతాం?

ఇక్కడేగా ఉండేది!" అంటూ "వస్తా బిప్లవ్‌దా" అని చెయ్యి ఊపి విజిల్ వేసుకుంటూ అలోక్ అక్కడనుండి వెళ్ళిపోయాడు.

జేబులోనుంచి ఫోన్ తీసి "హా దొరికింది. నీకు అందజేస్తాను. నువ్వు ఊరికే పరేశాన్ చెయ్యకు" అంటూ ఫోన్‌లో మాట్లాడుతూ వెళ్ళిపోయాడు.అతను వెళ్ళిపోయాక దత్తు అలా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయాడు చాలాసేపు.

# పరదేశీ ప్రేమకథ

సీరియల్

## గొర్లి శ్రీనివాసరావు

బిప్లవ్ కూడా ఏమీ మాట్లాడడానికి ప్రయత్నించ లేదు.ఎవరి ఆలోచనలలోవాళ్ళు మునిగిపోయారు.

కొంచెంసేపు అలా ఇబ్బందికరంగా కూర్చున్నాక "నేను మళ్ళీ కలుస్తాను" అని గోడకి చెప్పినట్లు చెప్పి వెళ్ళిపోయాడు దత్తు. వెళ్తున్న దత్తువైపు చూస్తూ డీప్‌గా ఆలోచనల్లో కూరుకుపోయాడు బిప్లవ్!

ఎక్కడా ఆగకుండా ప్రయాణించి భారతి, మదన్ మోహన్‌లు ఎక్కిన కారు. వాళ్ళు శాంతినికేతన్‌కి రాత్రి ఎనిమిది గంటలకు చేరుకున్నారు.

తిన్నగా హాస్పిటల్‌కి వెళ్ళిపోయారు.

ప్రఫుల్‌ని ఐసియులో ఉంచారు. అతనికి చేసిన సర్జరీ సక్సెస్ అయిందని బెనర్జీకి, అవనీష్‌కి చెప్పాడు డాక్టర్‌సేన్ గుప్తా. అబ్జర్వేషన్‌లో ఉంచుతున్నాము అని చెప్పి ఐసియులో ఉంచాడు.

భారతి, మదన్‌మోహన్‌లు హాస్పిటల్‌కి చేరుకునే సరికి అక్కడ వాళ్ళను రిసీవ్ చేసుకోవడానికి బెనర్జీ, అవనీష్‌లు ఉన్నారు. శర్మిష్ఠ కూడా వచ్చి ఉంది.

"ప్రఫుల్‌కి సర్జరీ జరిగింది. సక్సెస్‌ఫుల్‌గా జరిగిందని డాక్టర్‌గారు చెప్పారు. కాని అతన్ని అబ్జర్వేషన్‌లో ఉంచారు. ఐసియులో ఉన్నాడు. రండి చూద్దురుగాని" అంటూ వాళ్ళని వెంటబెట్టుకుని వెళ్ళాడు బెనర్జీ.

పరిచయాలు చేసుకోలేదు.

"ప్రఫుల్ పేరెంట్స్ మీరేనా" అన్న ప్రశ్న తర్వాత తమను పరిచయం చేసుకోవడానికి అంతగా ప్రాముఖ్యం ఇవ్వలేదు బెనర్జీ.

బెనర్జీ దారి చూపించగా భారతి, మదన్‌మోహన్‌లు ఐసియు దగ్గరికి వెళ్ళారు.బెనర్జీ డ్యూటీ డాక్టర్ దగ్గరకి వెళ్ళి మాట్లాడాడు. "ఎక్కువసేపు ఉండకండి. పేషెంట్ డిస్టర్బ్ అవుతాడు.మళ్ళీ మార్నింగ్ రావచ్చు" అన్నాడు డ్యూటీ డాక్టర్.

"శానిటైజ్డ్ యాప్రాన్స్ వేసుకుని ఇద్దరూ లోపలికి వెళ్ళారు.ప్రఫుల్ ఉన్న బెడ్ దగ్గరకు వెళ్ళేసరికి భారతికి దుఃఖం ఆగలేదు. కళ్ళవెంట ధారగా కన్నీరు కారుస్తూ "నాన్నా ప్రఫుల్! అమ్మను వచ్చానురా, కళ్ళు తెరువు నాన్నా" అంటూ పిలిచింది.

ఆమె గొంతు విని ప్రఫుల్ కదిలాడు. కళ్ళు తెరిచి చూశాడు. అతని కళ్ళకు అమ్మానాన్నల రూపం మసకగా తోచింది. మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

నవ్వాలని ప్రయత్నించాడు కానీ పెదవులు కొద్దిగా కదిలించగలిగాడు అంతే!

"బాబూ నీకేం కాదు. మేము వచ్చేశాం. ధైర్యంగా ఉండు. నీకు బాగైపోతుంది" అన్నాడు మదన్‌మోహన్, అతని బెడ్ దగ్గరకు వెళ్ళి.అతని చేయిని టచ్ చేశాడు. భారతి కూడా ప్రఫుల్ చేతిని టచ్ చేసింది.

అమ్మానాన్నల స్పర్శకు ప్రఫుల్‌కి చాలా ధైర్యం వచ్చింది. ఆ ఆనందంలో అతని కనుకొనల నుంచి కన్నీరు కారింది. దాన్నిచూసి మరింత వేదన కలిగింది భారతికి. ముందుకు వంగి అతని బుగ్గమీద ముద్దు పెట్టింది కన్నీరు తుడిచింది.

డ్యూటీలో ఉన్న సిస్టర్ వచ్చి అబ్జెక్ట్ చేసింది. "మేడమ్, మీరు అలా చేయకూడదు. ఇన్‌ఫెక్షన్స్ వస్తాయి. అర్థంచేసుకోండి ప్లీజ్.

ఆయన ఇప్పుడు సెడేషన్‌లో ఉన్నారు. మీరు డిస్టర్బ్ చేస్తేమళ్ళీ ఇబ్బంది పడతారు. ఆయన ఎంత బాగా నిద్రపోతే అంత త్వరగా రికవర్ అవుతారు. మీరు కోపరేట్ చెయ్యాలి, ప్లీజ్" అంది.

11

### జరిగిన కథ

సోహిణితో మాట్లాడడం శర్మిష్ఠకు ఇష్టం వుండదని గ్రహిస్తాడు ప్రఫుల్.

ఓ చెత్తలారీతో ప్రఫుల్ తొక్కుతున్న సైకిల్‌కి యాక్సిడెంట్ చేయిస్తాడు దత్తు. దగ్గర్లోవున్న ఓ హోమ్‌గార్డ్ ప్రఫుల్ లారీ టైర్ల కిందపడకుండా ఇవతలకు లాగి రక్షిస్తాడు. అయినా ప్రఫుల్ తలకు తీవ్రంగా గాయమవు తుంది.

హాస్పిటల్లో జాయినైన ప్రఫుల్‌ని చూసేందుకు బెనర్జీ, ఇంకొందరు స్టూడెంట్స్ వెళ్తారు.

తను తప్పు చేశానేమోనన్న భావన బిప్లవ్‌లో మొదలవుతుంది. శర్మిష్ఠ

ఇంకా చాలామంది స్టూడెంట్స్ హాస్పిటల్లో కోమాలో వున్న ప్రఫుల్‌ని చూసేందుకు వెళ్తారు. ప్రఫుల్ కోమాలో వున్నా అతని బ్రెయిన్ యాక్టివిటీని చూసి ఆపరేషన్ చేస్తున్న డాక్టర్లు అతని స్ట్రాంగ్ విల్‌నెస్‌కు ఆశ్చర్యపోతారు.

ప్రఫుల్‌కి యాక్సిడెంట్ చేయించిన అలోక్ మరికొంత డబ్బు కావాలని దత్తు దగ్గర పేచీపడతాడు.

మదన్‌మోహన్, భారతి కొడుకును చూసేందుకు శాంతినికేతన్ చేరుకుంటారు. అలోక్‌కు కొంత సొమ్ము ముట్టచెబుతాడు బిప్లవ్. ఇక చదవండి.



"అలాగే సిస్టర్" అంది భారతి. హ్యాండ్‌బ్యాగ్‌లో నుంచి టిష్యూ తీసి కళ్ళు తుడుచుకుని, "బాబూ మేము ఇక్కడే ఉన్నాం. నీకేమీ భయంలేదు. హాయిగా పడుకో. నీకు త్వరగా నయమవుతుంది" అని చెప్పి, "పదండి" అంది మదన్‌మోహన్‌తో.

"ప్రఫుల్, గుడ్ నైట్. హాయిగా పడుకో బాబూ" అన్నాడు మదన్‌మోహన్.

తర్వాత ఇద్దరూ అక్కడ్నుంచి బయటకు వచ్చేశారు. బయట బెనర్జీవాళ్ళు వెయిట్‌చేస్తూ ఉన్నారు.

"ఎలా ఉన్నాడు ప్రఫుల్ బాబు" అడిగాడు అవనీష్. "బాగున్నాడు. కదులుతున్నాడు. కళ్ళు తెరిచి మమ్మల్ని చూశాడు"అంది భారతి.చేతిలో ఉన్న టిష్యూని డస్ట్‌బిన్‌లో వేసింది. తర్వాత రెండు చేతులూఎత్తి బెనర్జీవాళ్ళకి నమస్కరించింది.

"మీ మేలు ఈ జన్మలో మరిచిపోలేము. మా బిడ్డను మీ బిడ్డలా కాపాడారు" అంది బెంగాలీలో.

"మీరు బెంగాలీనా"అడిగాడు బెనర్జీ ఆశ్చర్యంగా! "లేదు. నాకు బెంగాలీ అంటే చాలా ఇష్టం. బెంగాలీ సాహిత్యం చదివాను. ముందు తెలుగులో అనువాదాలు చదివాను. తర్వాత ఒరిజినల్ చదవాలని బెంగాలీ నేర్చుకున్నాను.





నాకు కొంతమంది బెంగాలీ ఫ్రెండ్స్‌కూడా ఉన్నారు. వాళ్ళతో రెగ్యులర్‌గా బెంగాలీలో మాట్లాడుతూవుంటాను" అంది భారతి.

"నాకు బెంగాలీ భాష రాదు. నన్ను బెంగాలీలో మాట్లాడించాలని చూడకండి" అన్నాడు మదన్‌మోహన్.

"హ్యాట్సాఫ్ టు యు.ఇంత టెన్షన్‌లో కూడా మీరు చక్కగా మాట్లాడగలుగుతున్నారు. మీ స్థిత ప్రజ్ఞతకు హ్యాట్సాఫ్"అన్నాడు అవనీష్.

"బాబుని చూసేవరకు మేము చాలా ఆందోళనగా ఉన్నాము.ఇప్పుడు వాడినిచూసిన తర్వాత మాకు కాన్ఫిడెన్స్ వచ్చింది, వాడికి నయమైపోతుంది అని" అన్నాడు మదన్‌మోహన్.

"పదండి మా ఇంటికివెళ్దాం" అన్నాడు అవనీష్.

"ఎందుకు మీకు శ్రమ.

మా మేనేజర్ ఇక్కడ ఏదో హోటల్ బుక్‌చేశాను అని చెప్పాడు" అన్నాడు మదన్‌మోహన్.

"ప్రఫుల్ బాబు మా ఇంట్లోనే పెంట్ హౌస్ అద్దెకు తీసుకున్నాడు. పేయింగ్ గెస్ట్‌గా మా ఇంట్లో ఉండడానికే హోటల్ ఖాళీ చేసి సామాను పంపాడు మా ఇంటికి. తను సైకిల్‌పై వస్తుండగా ఈ దారుణం జరిగింది" అన్నాడు అవనీష్.

"ఓహ్, అలాగా?" అన్నాడు మదన్ మోహన్.

"సరే పదండి అక్కడికే వెళ్దాం. మనవాడికి నచ్చితేనే ఆ ఇంటికి గెస్ట్‌గా వెళ్ళాలని నిశ్చయించుకుని ఉంటాడు" అంది భారతి శర్మిష్ఠవైపు చూస్తూ.

"ఈయన అవనీష్ ఛటోపాధ్యాయ్, చీఫ్ లైబ్రేరియన్ యూనివర్శిటీలో. ఈమె శర్మిష్ఠ. ఈయన కూతురు. ఎకనమిక్స్‌లో గ్రాడ్యుయేషన్ చేస్తూ ఉంది. ఈమెగాక మృత్యుంజయ్ అని ఒకఅబ్బాయికూడా ఉన్నాడు.అతనికి స్టాఫ్‌సెలక్షన్‌లో జాబ్ దొరికింది. ఢిల్లీ వెళ్ళాడు ఈ మధ్యనే.

నా పేరు బెనర్జీ. నేను ప్రఫుల్ చేస్తున్న పిజికోర్సుకి



ఏ పేరుతో పిలిచారనేదానికన్నా ఎస్సీల సంక్షేమమే మాకు ప్రధానం.

*-రామదాస్ అథవాలే, కేంద్రమంత్రి*



పెట్రోల్ ధరలు అంతర్జాతీయ అంశాల వల్ల పెరుగుతున్నాయి... వాటంతట అవే దిగివస్తాయి.

*-ముఖ్తార్ అబ్బాస్ నఖ్వీ, కేంద్రమంత్రి*

కోఆర్డినేటర్‌ని" అన్నాడు.

"నాపేరు మదన్‌మోహన్, ఈమె భారతి"అన్నాడు.

మళ్ళీ భారతిని, మదన్ మోహన్‌ని తమ ఇంటికి రమ్మని ఇన్వైట్ చేశాడు అవనీష్.

భారతి, మదన్ మోహన్ వాళ్ళ ఆహ్వానాన్ని మన్నించి వాళ్ళతో వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు. "నేను మిమ్మల్ని రేపు ఇక్కడ విజిటింగ్అవర్స్‌లో కలుసుకుంటాను. మీరు హాయిగా పడుకోండి. ఇక్కడ ఏమైనా అవసరం ఉంటే నేను రెస్పాండ్ అవుతాను. మా ఇల్లు ఇక్కడికి దగ్గరే"అన్నాడు బెనర్జీ.

"థాంక్యూ. ఇది చాలా చిన్నమాట. మీరు చేసే సహాయాన్ని కొలవడానికి మాటలుసరిపోవు" అన్నాడు మదన్‌మోహన్.

అవనీష్ బైక్‌పైన ముందు వెళ్తుంటే మదన్‌మోహన్ వాళ్ళ కారు ఆ బైక్‌ని ఫాలో అయ్యింది. శర్మిష్ఠను తమతోపాటు కారులో రమ్మని చెప్పింది భారతి.

ఆమెను తన పక్కనే కూర్చోబెట్టుకుంది భారతి. మదన్‌మోహన్ డ్రైవర్ పక్కసీట్లో ముందువైపు కూర్చున్నాడు.

"మా అబ్బాయి ఫోన్ చేసి చెప్పాడు ఇలా మీ ఇంట్లో పెంట్‌హౌస్ అద్దెకు తీసుకున్న విషయం.

నన్నుకూడా వచ్చి ఓవారం పదిరోజులు ఉండమన్నాడు. ఆ ఇంట్లో అందరూ మంచివాళ్ళు అని చెప్పాడు.కానీ ప్రత్యేకంగా ఎవరెవరు ఉంటారు అన్నది వివరించలేదు" అంది భారతి బెంగాలీ.

"అలాగా" అంది శర్మిష్ఠ.

"ప్రఫుల్ అసలు ప్యారిస్‌గాని, ఢిల్లీగాని వెళ్ళవలసింది. కానీ నా బలవంతంమీద ఇక్కడకు వచ్చాడు" అంది భారతి కళ్ళు తుడుచుకుంటూ.

"మీరేమీ వర్రీ అవకండి ఆంటీ, ప్రఫుల్‌కి బాగవుతుంది. డాక్టర్‌గారు సర్జరీ సక్సెస్ అయ్యిందని చెప్పారు" అంది శర్మిష్ఠ. భారతి దుఃఖపడుతుంటే ఆమెకు చాలా బాధ కలిగింది.

"ఊరుకోండి ఆంటీ! యాక్సిడెంట్ చేసిన చెత్త లారీ కోసం వెతుకుతున్నారు పోలీసులు. ఆ డ్రైవర్ తాగేసి ఉంటాడు అని అందరూ అనుకుంటున్నారు. అక్కడ డ్యూటీ చేస్తున్న హోమ్‌గార్డ్ సమయానికి అంబులెన్స్‌కి ఫోన్ చేయడంతో డాక్టర్లు సేవ్ చేయగలిగారు ప్రఫుల్‌బాబుని" అంది శర్మిష్ఠ.

ప్రఫుల్ పేరు పలికేటప్పుడు ఆమె గొంతులోని వణుకు భారతి దృష్టిని దాటిపోలేదు. ఒకసారి పరిశీలనగా చూసింది శర్మిష్ఠవైపు.

తనకు బెంగాలీ భాష అన్నా, బెంగాలీ మనుషులన్నా ఉన్న ఆకర్షణ కారణంగా తనకు దేవుడు బెంగాలీ కోడలిని ఇవ్వాలనుకుంటున్నాడేమో అనుకుంది భారతి.

శర్మిష్ఠరూపం అందంగా, ఆకర్షణీయంగా ఉంది. ఆమెలో లాలిత్యం, సొగసు, ఒక విధమైన హోమ్లీనెస్ చూసి ఆనందించింది ఆమె మనసు.

ఏది ఎలా జరుగుతుందో మనకేం తెలుస్తుంది, ఆ భగవంతుడికి తప్ప. కాని ఏది జరిగినా మంచికే జరగాలని మనసారా కోరుకోవడం తప్ప అనుకుంది భారతి. అవనీష్ ఛటోపాధ్యాయ్ ఇంటికి చేరింది కార్. లోపలికి సాదరంగా ఆహ్వానించాడు అవనీష్. తన భార్య ప్రమద్వరను పరిచయం చేశాడు.

"ప్రఫుల్ మాకు చాలా చాలా నచ్చాడు, అతనికి యాక్సిడెంట్ అయిందంటే నాకు చాలా బాధ కలిగింది. అతను త్వరగా కోలుకోవాలని మేము కోరుకుంటున్నాము" అని చెప్పింది ప్రమద్వర.

"థ్యాంక్స్" అంది భారతి.

"భోజనం చేద్దురుగాని, కూర్చోండి" అని ఆహ్వానించింది ప్రమద్వర.

మదన్‌మోహన్‌వైపు చూసింది భారతి ప్రశ్నార్థకంగా. తల ఊపాడు తనకు ఓకె అని.

"మీకు శ్రమ ఇస్తున్నామేమో" అంది భారతి.

ఆమె బెంగాలీలో మాట్లాడటంతో ప్రమద్వర చాలా సంతోషపడింది. ఇక ఆపకుండా ఆమెతో మాట్లాడుతూ ఆమెను తీసుకువెళ్ళి తను వండిన పదార్థాలు వడ్డించింది ప్రేమగా.

వేడివేడిగా పూరీలు చేసి వడ్డించింది. భారతి తాము లైట్‌గా తింటామని ఆమెకు నచ్చచెప్పింది.

భోజనం చేశాక వాళ్ళిద్దరినీ తీసుకుని శర్మిష్ఠ పెంట్‌హౌస్‌కి తీసుకెళ్ళింది. రూమ్ అంతా శుభ్రపరచి ఉంది. అన్ని సౌకర్యాలూ ఉన్న ఆ పెంట్‌హౌస్ చూసి "ప్రఫుల్ మంచి ఇల్లు సెలెక్ట్ చేసుకున్నాడు" అంది భారతి శర్మిష్ఠతో.

మధురంగా నవ్వింది శర్మిష్ఠ. ప్రఫుల్ పేరువస్తే ఈ అమ్మాయికి చాలా పరవశత్వం. ఏదో ఉంది వీళ్ళిద్దరి మధ్య అని తీర్మానించుకుంది భారతి.

"ఉదయం ఛాయ్ ఎన్నిగంటలకు కావాలి ఆంటీ" అంది శర్మిష్ఠ.

"నీకు ఎప్పుడు వీలైతే అప్పుడు ఇవ్వు. లేదంటే ప్రఫుల్ దగ్గర కెటిల్ ఉంటుంది.

వాడికి గ్రీన్ టీ తాగడం అలవాటు. మేము అదే చేసుకుంటాం. హాస్పిటల్‌లో మార్నింగ్ విజిటింగ్ అవర్స్ ఎప్పుడు?" అడిగింది భారతి.

"ఉదయం ఎనిమిది నుంచి తొమ్మిది వరకు. డాక్టర్స్ కూడా అవైలబుల్‌గా ఉంటారు. మీతో మాట్లాడతామన్నారు" అంది శర్మిష్ఠ.

"ఓకే శర్మిష్ఠా! గుడ్‌నైట్. నువ్వు కూడా బాగా టెన్స్ అయిపోయి ఉంటావు. టేక్ గుడ్ రెస్ట్" అంది భారతి.ఆమె వాత్సల్యపూరితమైన మాటలు వినగానే, శర్మిష్ఠ కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

మాట్లాడటానికి ఆమె గొంతు సహకరించలేదు. తలదించుకుంది. ఆమె కళ్ళల్లోనుంచి కన్నీటి బిందువులు జలజలా రాలి బుగ్గలపైకి దొర్లాయి.

చటుక్కున ముఖం పక్కకి తిప్పుకుని గబగబా వెళ్ళిపోయింది. ఆమె వెనకే వెళ్ళింది భారతి. శర్మిష్ఠ కొన్ని మెట్లు దిగి మధ్యలో ఆగిపోయింది.

మెల్లగా వంగి ఆ మెట్లపైన కూర్చుని ముఖం చేతులలో కప్పుకుని దుఃఖించసాగింది. అది చూసి వెనక్కి వచ్చేసింది భారతి.కొన్నిసార్లు ఒంటరితనం కోరుకుంటుంది మనసు. అలాంటప్పుడు డిస్టర్బ్ చేయడం సరికాదు అనుకుంది.శర్మిష్ఠ దుఃఖం చూస్తే మనసు మెలిపెట్టినట్లయింది ఆమెకు.

ఆ రాత్రి భారతి, మదన్‌మోహన్ కలతనిద్ర పోయారు. శర్మిష్ఠకు కూడా నిద్రపట్టలేదు. అలా దొర్లుతూనే ఉంది తన పక్కమీద.

ఆ రాత్రి నిద్రపట్టక ఇబ్బందిపడ్డ వాళ్ళల్లో బిప్లవ్ కూడా ఉన్నాడు. ఏదో ఆవేశంలో అన్నాడు గాని, దత్తు నిజంగానే అన్నంత పనికీ తెగబడతాడు అనుకోలేదు. తను మొదట్లో అనుకున్నట్లు ముఖాముఖీ ఎదురుపడి ప్రఫుల్‌తో కలబడి అతని కాళ్ళు, చేతులు విరిచి వేస్తే గర్వంగా ఫీలయ్యేవాడు.

అదీగాక మరెవరన్నా శర్మిష్ఠవైపు కన్నెత్తి చూడడానికి కూడా జడుసుకునేవాళ్ళు. ఇప్పుడు అంతా సీక్రెట్‌గా జరగడంవల్ల ఎవరి కారణంగా ప్రఫుల్ శిక్షించబడ్డాడు అన్నది ఎవరికీ తెలియదు.

పైగా దొంగదెబ్బ తీసినట్లు మనసులో ఒకటే అపరాధభావన. న్యాయంగా గెలిచి ఉంటే ప్రేమకోసం తలపడ్డారు అందులో బలవంతుడైనవాడు గెలిచాడు అనుకునేవాళ్ళు. తన ప్రేమకు గౌరవంకూడా ఉండేది. ఇలాంటి ఆలోచనలతో అతని మనసంతా అల్లకల్లోలమైంది.

దానికి తోడు దత్తు ఆరోజు సాయంత్రం అలోక్‌ని

వెంటబెట్టుకుని తన దగ్గరకువచ్చి డబ్బుకోసం డిమాండ్ చేయడం కూడా అతనికి నచ్చలేదు.

దత్తు ఎవరితో పని చేయించాడు అనేది తనకు అనవసరం. అతను అడిగినంత డబ్బు తను ఇచ్చాడు. ఇంకా డబ్బు పిండాలని దత్తు అనుకున్నాడా లేక అలోక్ తనను బ్లాక్‌మెయిల్ చేయాలనుకున్నాడా అనేది సందేహం కలిగింది బిప్లవ్‌కి.

ఇదివరకు చాలాసార్లు అలోక్ చేసే చెడ్డపనులకు తను అతనికి వార్నింగ్ ఇచ్చాడు, తన స్నేహితుల జోలికి వస్తే సహించను అని.

అప్పుడు తోకముడిచిన అలోక్, ఇప్పుడు ధైర్యంగా వచ్చి తనముందుకూర్చుని తనను డబ్బు డిమాండ్ చేయడం, తను ఎదురుచెప్పలేక అతను అడిగిన డబ్బు ఇచ్చి పంపడం అంతా ఏదో దిగజారుడు తనానికి నాందిలాగా అనిపించింది.

అనవసరంగా ఇలాంటి నీతి తక్కువ క్రిమినల్స్‌తో సంబంధం పెట్టుకోవలసివచ్చిందే అని పరితపించాడు బిప్లవ్. ఇలాంటి పరిస్థితి నుంచి ఎలా బయటపడాలో అర్థంకాలేదు. తన సమస్యకు సరైన పరిష్కారం ఎవరు చెప్పగలరో అతనికి అంతుచిక్కలేదు.

ఎక్కువగా స్నేహితులపైన ఆధారపడేవాడు. కానీ ఈసారి అది బెడిసికొట్టింది.

దత్తు క్యారెక్టర్‌ని సందేహించాలా! లేక అతని వివేకాన్ని సందేహించాలా! అనేది తేల్చుకోలేక పోయాడు. ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూ నిద్రకు దూరమయ్యాడు బిప్లవ్.

ప్రఫుల్‌కి యాక్సిడెంట్ అయిన విషయం విశ్వభారతి యూనివర్సిటీలో చాలామందికి అదే రోజు తెలిసిపోయింది.

ఎవరి నోట విన్నా ఒక పరదేశీ న్యూ అడ్మిషన్ స్టూడెంట్‌కి హఠాత్తుగా యాక్సిడెంట్ అయింది.

అతను ఎక్కడ ఉండేవాడు, ఎక్కడకు వెళ్తున్నాడూ వంటి విషయాలు కొంచెం తెలియడం, కొంచెం తెలియకపోవడంవల్ల రకరకాల వైల్డ్ ఊహాగానాలు చోటుచేసుకున్నాయి.

ఒక్కోసారి అలాంటి ఊహాగానాలు సత్యానికి బెత్తెడు దూరంనుంచి వెళ్తాయి అన్నదికూడా నిజం!

కళాభవన్‌లో అయితే ప్రతి విద్యార్థికీ ప్రఫుల్ యాక్సిడెంట్ విషయం తెలిసింది. అందులో మేరీ, ఆమె స్నేహితులు కూడా ఉన్నారు.

వాళ్ళకి ఒక డిస్టర్బింగ్ మెసేజ్ వచ్చింది.

ఆ మెసేజ్ మొబైల్‌లో రాలేదు. ఒక చిన్న పేపర్ పైనచేత్తో రాసిన మెసేజ్. 'టేక్‌కేర్' అని రాసి ఉంది.

దానికింద ఒక పుర్రెబొమ్మ వేసి 'డేంజర్' అని రాసి ఉంది. ప్రఫుల్ యాక్సిడెంట్ అయిన సందర్భంలో అది రావడం వాళ్ళకి కొంత ఆశ్చర్యం అనిపించింది. కాని దానిగురించి వాళ్ళు ఆరోజు ఆలోచించలేకపోయారు.

అదివాళ్ళకి ఇచ్చినది కూడా ఒక న్యూ అడ్మిషన్ స్టూడెంట్.

అయితే అతనికి అది ఇచ్చిన సీనియర్ ఎవరో అతను గుర్తుచెప్పలేకపోయాడు. హాస్పిటల్‌కి వెళ్ళి రావడం, ఇతర స్టూడెంట్స్‌తో మాట్లాడటం వంటి వాటితో మేరీవాళ్ళకు ఆ మెసేజ్ గురించి చర్చించుకోవడానికి కావలసిన సమయం చిక్కలేదు.

కాని ఆ రాత్రి డిన్నర్ తర్వాత హాస్టల్‌లో అమ్మాయిలు కూర్చుని ఆ మెసేజ్ గురించి చర్చించుకున్నారు. దాని అర్థం తమకు ఏదో డేంజర్ ఉంది అన్నట్లయితే, ఆ మెసేజ్ ఇచ్చినవాళ్ళు తమను రక్షించగలవాళ్ళా, లేక తమపై కక్ష సాధించాలని అనుకున్నవాళ్ళా?

ఒకవేళ అది రెండో గ్రూప్ అయితే గ్యారంటీగా అది అలోక్ గ్యాంగ్ పని అయివుంటుంది.

ఆ మెసేజ్‌కి, యాక్సిడెంట్‌కి ఏదైనా సంబంధం ఉంది అంటే వాళ్ళ కారణంగానే ప్రఫుల్‌కి యాక్సిడెంట్ జరిగిందా? అది వాళ్ళే చేయించారా? లాజికల్‌గా చూస్తే అవును అని సమాధానం వస్తోంది.

దాంతో మేరీ తప్ప తక్కిన అమ్మాయిలందరికీ భయం పెరిగింది. వాళ్ళంతా మేరీపైన ప్రెజర్‌పెట్టారు. "నువ్వే ఆ అలోక్‌ని కొట్టావు. కాబట్టి నువ్వు వెళ్ళి అతనికి అపాలజీస్ చెప్పు. అలా చేస్తే అన్నా అతని ఇగో శాంతిస్తుంది. అప్పుడు మనపై కక్ష సాధించాలని అనుకోడు" అన్నారు.

"అంటే ప్రఫుల్‌కి జరిగిన యాక్సిడెంట్ అతను చేయించారని మీరు నమ్ముతున్నారా?" అని ఎదురు ప్రశ్నించింది మేరీ.

"అవును. అలా జరిగివుంటుంది. ఒకవేళ అలా



## కోరి తీసుకున్న గ్యాప్

ఓ సినిమా తర్వాత మరో సినిమాకు గ్యాప్ ఇచ్చేసి గబుక్కున కొన్నాళ్ళపాటు తెరపై కనపడకుండా పోతుంటారు కొందరు నాయికలు.

ఇందుకు ఎవరికితోచిన కారణాల విశ్లేషణవారికి షరా. మామూలే. ఈ కోవలోకి చక్కదనాల చుక్క శృతి చేరింది. మహానటుడు కమల్‌హాసన్ కూతురిగా ఎంట్రీఇచ్చినా స్వయంశక్తితో ఎదిగిన తార. డేట్స్‌కు డిమాండ్ వున్నప్పటికీ గ్యాప్ తీసుకున్నది.

ప్రేమలో మునిగి తేలుతున్నందువల్లనే ఇలా గ్యాప్ తీసుకున్నదని జోరందుకున్న వార్తలకు బ్రేక్ పెట్టింది శృతి. "నటన మాత్రమే ముఖ్యం కాదు. ఇంకా చాలా విషయాలకు ప్రాధాన్యం ఇస్తాను. నా గురించి నేను తెలుసుకోవాల్సినవి చాలా వున్నాయి. అందుకోసమే కావాలని తీసుకున్న గ్యాప్ ఇది" అని వివరించింది.



## నచ్చక వదిలేశా

హిందీలో 'మీర్జ్యా', తెలుగులో 'రేయ్' చిత్రాల్లో తళుక్కుమన్న తార సయామీ ఖేర్ గుర్తుందో లేదో కాని ఈ అమ్మాయి ఇప్పుడు మరోమారు వార్తల్లోకి వచ్చింది 'మౌళీ' అనే సినిమాతో ముచ్చటగా మూడో భాష మరాఠీలోకి కాలుపెడుతున్నది.

"వివిధ భాషల సినిమాల నడుమ హద్దులు చెరిగి పోతున్నాయి. ఆసక్తిదాయకమైన కథలు తెరకు ఎక్కించేందుకు ఇది మంచి అవకాశం.

నా అవకాశాలను ఎవరూ అడ్డుకోవడంలేదు. నాకే నచ్చక వదులుకున్నా. ఇంకొన్ని అంగీకరించిన సమయానికి ఆరంభం కావడంలేదు" అంటూ తన స్వోత్కర్ష వినిపించింది సయామీఖేర్.

## జానేదో

'నిత్యామీనన్ అనగానే 'పొట్టిపిల్ల' అనేవారు, అనుకునేవారు అనేకమంది వుంటారు. అలా అన్నప్పుడు ఫీలవుతారా?'అనడిగితే నిత్య తన మార్కు నవ్వులు విసిరింది. "నాకు అసలా ఫీలింగే రాదు. నా గురించి నేనెప్పుడూ గొప్పగానే ఆలోచిస్తాను. ఆత్మవిశ్వాసంతో వుంటాను. పొట్టిగా వున్నావనో, లావయ్యావనో విమర్శించేవారిని చూస్తుంటే నాకు నవ్వు వస్తుంటుంది. నటన నా జీవితంలో భాగం. అంతే.

అదికాకుండా ఇంకా చాలా వున్నాయి. నేను సాధించాల్సినవి అనేకం వున్నాయి. అవన్నీ వదిలేసి ఈ చిన్నచిన్న విషయాలగురించి అస్సలు ఆలోచించను" అని కేర్‌నాట్ అన్నట్లు కబుర్లు చెప్పింది.



## అనవసర విషయాలు

ఎప్పటికప్పుడు అభిమానులతో టచ్‌లో వుండడం ఇలియానాకు అలవాటు. ఆ క్రమంలో ట్విట్టర్‌లో అభిమానులు అడిగిన అనేక ప్రశ్నలకు ఇల్లి ఇలా సమాధానాలు చెప్పుకొచ్చింది-

"నేను అనేకసార్లు బాడీ షేమింగ్‌కు గురయ్యా. మొదట్లో బాధపడినా తర్వాత అలవాటుపడిపోయాను. అమ్మ చేసిన ఆహారం ఏదైనా నచ్చుతుంది.

ఈ నవంబర్‌కి నాకు 32 సంవత్సరాలు వస్తాయి. ప్రతి విషయానికీ ఆందోళనచెందేదాన్ని. బాధపడేదాన్ని. దీన్ని అధిగమించడానికి ఎంతో ఆలోచించి చివరకు వైద్యుడిని కలిశాను.

ప్రతి విషయాన్నీ ఆలోచించి అలా జరిగితేనో, ఇలా జరిగితేనో అని భయపడేదాన్ని. వైద్యుడి సలహాతో 'అయితే ఏంటి' అనుకోవడం మొదలుపెట్టా. అనవసర విషయాలు పట్టుకుని వేలాడడం మానేశా" అంటూ వివరించింది ఇలియానా.

జరిగినా జరగకపోయినా కానీ వాళ్ళు మనల్ని హెచ్చరిస్తున్నారు కాబట్టి మనకు వాళ్ళతో శత్రుత్వం ఏమీ లేదు అని గట్టిగా చెప్పుకుంటే సరిపోతుంది. అందుకే నువ్వు అలోక్‌కి అపాలజీస్ చెప్తే మంచిదని మా అభిప్రాయం" అన్నారు వాళ్ళు.

"అది సరేగాని మీకు ఒక విషయం ఏమీ అనిపించడం లేదా. ప్రఫుల్ యాక్సిడెంట్ విషయంలో అలోక్ వాళ్ళ ప్రమేయం ఉందని అంటే వాళ్ళపై పోలీసులకు కంప్లయింట్ చెయ్యాలా వద్దా!" అంది మేరీ.

"చాల్లే ఊరుకో. నువ్వు మన సమస్యను పరిష్కరించకుండా మరో సమస్యలోకి మమ్మల్ని నెడుతున్నావు. నీతో మాట్లాడి వేస్ట్" అన్నారు వాళ్ళు.

వాళ్ళమధ్య జరిగిన డిస్కషన్ వాళ్ళమధ్యనే ఆగలేదు. అది నిప్పులేని పొగలా మెల్లమెల్లగా స్ప్రెడ్ అయింది హాస్టల్లో. అక్కడనుంచి బయటికి కూడా.

ఉదయాన్నే విజిటింగ్ అవర్స్‌లో డాక్టర్ సేన్ గుప్తాని కలిశారు భారతి, మదన్ మోహన్‌లు. వాళ్ళ వెంబడి అవనీష్, బెనర్జీలుకూడా ఉన్నారు.

శర్మిష్ఠకూడా వచ్చింది. ఒకసారి ప్రఫుల్‌ని చూడాలి అంటూ. ప్రఫుల్ కండిషన్ వివరంగా చెప్పాడు డాక్టర్ సేన్ గుప్తా. "ప్రఫుల్ ట్రీట్‌మెంట్‌కి బాగా రెస్పాండ్ అవుతున్నాడు.అతనికి అయిన ఫ్రాక్చర్స్ కూడా మరీ సీరియస్‌వి కావు. త్వరగానే హీల్ అవుతాయి.

కాకపోతే అతని రిబ్స్‌కి అయిన ఫ్రాక్చర్‌ల వల్ల అతని ఇన్టెస్టైన్స్ కొద్దిగా డ్యామేజి అయ్యాయి. అందువలన అతని డెయిట్ విషయంలో చాలా శ్రద్ధ తీసుకోవాలి. ఈజీగా డైజెస్ట్ అయ్యే ఫుడ్ పెట్టాలి.



స్పైసీ ఫుడ్ అవాయిడ్ చేయాలి. అతను చాలా లక్కీ అని చెప్పుకోవాలి. ఎందుకంటే అతన్ని ట్రైమ్‌కి తీసుకురాగలిగారు" అన్నాడు.

"థాంక్యూ డాక్టర్" అన్నాడు మదన్ మోహన్.

"మరో విషయం. ఇది యాక్సిడెంట్ కేస్ కావడం వల్ల మెడికో లీగల్ కేస్ గా ట్రీట్ చేశాము. పోలీసులకు సమాచారం ఇచ్చాము. మీతో మాట్లాడటానికి ఇన్స్పెక్టర్ వచ్చి వెయిట్ చేస్తున్నాడు. మీరు అతనితో కూడా మాట్లాడండి" అన్నాడు డాక్టర్ సేన్ గుప్తా.

"అలాగే" అన్నాడు మదన్ మోహన్.

బెనర్జీవాళ్ళను ఇన్స్‌పెక్టర్ వెయిట్‌చేస్తున్నరూమ్‌కి తీసుకెళ్ళాడు.అక్కడ వారి పరిచయాలయ్యాక ఇన్‌స్పెక్టర్ వాళ్ళని అడిగాడు, "మీ అబ్బాయికి ఎవరైనా శత్రువులు ఉన్నారా?" అని.

భారతి ఆశ్చర్యపోయింది. అప్పటివరకు అది హిట్ అండ్ రన్ కేస్‌లా ట్రీట్ చేసి ఉంటారు పోలీసులు అనుకుంది. ఏమిటీ ఈ కొత్తకోణం అన్నట్లు భర్తవైపు చూసింది. వాళ్ళిద్దరూ అయోమయంగా చూస్తుంటే బెనర్జీ మాట్లాడాడు.

"ప్రఫుల్‌బాబు న్యూ అడ్మిషన్. అతను వచ్చి పది రోజులు కూడా కాలేదు. అతను ఎవరితోనూ దుడుకుగా మాట్లాడేవాడు కాదు.అతనికి శత్రువులు ఉండే అవకాశం నాకైతే కన్పించడంలేదు"అన్నాడు.

"మీకేమైనా అనుమానం ఉందా ఇన్స్‌పెక్టర్ జీ" అన్నాడు మదన్‌మోహన్.

"అదేం లేదు. అన్ని కోణాలలోనూ చూడాలి కదా!" అంటూ దాటవేశాడు ఇన్‌స్పెక్టర్.

"మాకు ఏ అనుమానమూ లేదు" అంది భారతి చాలా స్పష్టంగా.

"సరే, మీకేమైనా వివరాలు తెలిస్తే నాకు చెప్పండి" అంటూ తన కార్డిచ్చి వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్.

"అదేంటి అతను అలా అంటాడు" అన్నాడు అవనీష్ ఆశ్చర్యంగా.

"అదే అర్థంకావడంలేదు. ఒక్క నిముషం కూర్చోండి. హోమ్‌గార్డ్‌ని పిలిపించాను. మీరు అతనితో మాట్లాడతామన్నారు కదా" అని మదన్‌మోహన్‌కి చెప్పి గది బయటికి వెళ్ళి హోమ్‌గార్డుని వెంటబెట్టుకుని వచ్చాడు బెనర్జీ.

పొట్టిగా, దృఢంగా ఉన్నాడు ఆ హోమ్ గార్డు. లోపలికి వచ్చిఅందరికీనమస్కారంచెప్పాడు చక్కగా రెండు చేతులు జోడించి. భారతి ముచ్చటపడింది. మన ప్రాంతంలో ఇలా సాంప్రదాయంగా చేతులు జోడించి నమస్కారం చెప్పడం ఎంతమంది చేస్తున్నారు. బెంగాల్‌లో ఇంకా ఈ కల్చర్ ఉన్నందుకు ఎంతో సంతోషంగా ఉంది అనుకుంది.

"మీరు మాఅబ్బాయిని కాపాడారు. మీ మేలు మరిచిపోలేము. మీకు ఎంత థ్యాంక్స్ చెప్పినా కూడా అది తక్కువే" అందిభారతి బెంగాలీలో.

**ఇంకా ఉంది**

ఏ వాతావరణంలో అయినా వెచ్చ వెచ్చగా టీ తాగడాన్ని టీ ప్రేమికులు అమితంగా ఇష్టపడతారు. అదే వాన జల్లులు చూస్తూ టీ తాగడమంటే మరింత అబ్బుర అనుభవం.

ఇష్టంకదా అని అదేపనిగా తాగుతుంటే, రోగ నిరోధకవ్యవస్థపై ప్రభావం చూపక తప్పదు.

జీవనశైలిలో కొద్దిపాటి మార్పులు చేసుకోవడంతోపాటు, ఓ కప్పు గ్రీన్‌టీ తాగడంవల్ల రోగ నిరోధక వ్యవస్థ దృఢంగా వుంటుంది.

గ్రీన్‌టీ 'ఎందుకు తాగాలి' అని ప్రశ్నించుకుంటే ఐదు కారణాలు కనపడతాయి.




# టీ టైమ్

## ➢ పూర్తిస్థాయి ఫ్లేవనాయిడ్లు :

గ్రీన్‌టీలో పాలీఫెనాల్స్ అంటే ఫ్లేవనాయిడ్లు, కెటెచిన్లు సమృద్ధిగా వుంటాయి.

వీటిలో యాంటీ ఆక్సిడెంట్ గుణాలు ఎక్కువగా వుంటాయి. యాంటీ ఆక్సిడెంట్లు ఫ్రీర్యాడికల్స్ నుంచి శరీరాన్ని పరిరక్షిస్తుంటాయి. వార్ధక్య లక్షణాలను కూడా నెమ్మదింపజేస్తాయి. వీటన్నింటివల్ల యవ్వనంగా కనిపిస్తారు.

## ➢ రోగనిరోధక వ్యవస్థ :

గ్రీన్‌టీలో కెటెచిన్లు, ఇజిసిజి వంటి రోగనిరోధక వ్యవస్థను దృఢపరిచే బయోయాక్టివ్ గుణాలు ఎక్కువగా వుంటాయి.

ప్రతిరోజూ ఓ కప్పు గ్రీన్ టీ తాగుతుంటే రోగనిరోధకవ్యవస్థ బలోపేతం అవుతుంది.

## ➢ బరువు తగ్గుదల :

మెటాబాలిజం మెరుగవడానికి గ్రీన్‌టీ సాయపడుతుంది. ఫలితంగా బరువు తగ్గుతారు.

ఆరోగ్యవంతమైన ఆహారం, వ్యాయామ కార్యక్రమాలకు గ్రీన్‌టీ జతచేస్తే అదనపు కిలోల్ని వదిలించుకోవచ్చు.

## ➢ తాజాదనం :

గ్రీన్‌టీలో కెఫైన్ లక్షణాలు కొద్దిగా వుంటాయి. ఇవి బాగా ప్రయోజనకరమైనవి. కాఫీ మాదిరి కాకుండా, కొద్ది మోతాదులో ఉండే కెఫైన్ గంటలకొద్దీ తాజాగా ఉంచుతుంది.

## ➢ ఆరోగ్య ప్రయోజనాలు :

క్యాన్సర్‌తో పోరాడడంనుంచి కొలెస్ట్రాల్ స్థాయిలను తగ్గించడందాకా, డయాబెటిస్‌ను నియంత్రించడంలో గ్రీన్‌టీ దోహదపడుతుంది.

మూడ్‌ను మెరుగుపరచడంలోనూ ఉపకరిస్తుంది. చురుకుదనాన్ని, జ్ఞాపకశక్తిని మెరుగుపరుస్తుంది.



ఏది తీసుకున్నా తగుమాత్రంగా వుండాలన్నది నిబంధన. గ్రీన్‌టీ కూడా ఇందుకు మినహాయింపు కాదు. ఉదయం నిద్ర లేస్తూనే పరగడుపున తాగకూడదు. అలా తాగితే లివర్‌పై ప్రభావం చూపుతుంది. దీనిలో తక్కువ మోతాదులోనే కెఫైన్ ఉన్నప్పటికీ, డీహైడ్రేషన్‌కు కారణం కావచ్చు.

గ్యాస్ట్రిక్ ఆమ్లాలు విడుదల కావడానికి ఉద్దీప్తం చేస్తుంది. ఉదరం అప్‌సెట్ అవుతుంది. సరైన పూర్తి ప్రయోజనాలు దక్కాలంటే, గ్రీన్‌టీలోని యాంటీ ఆక్సిడెంట్ ప్రభావాలుండాలంటే భోజనాల నడుమ మాత్రమే తాగుతుండాలి.

భోజనానికి రెండుగంటల ముందు లేదా రెండుగంటల తర్వాత తాగితే ఉత్తమ ఫలితాలుంటాయి.

భోజన సమయానికి చేరువలో తాగడంవల్ల కెటెచిన్లు ప్రతిస్పందించలేవు. క్యాల్షియం జీర్ణం కావడంలో, ఐరన్‌ను గ్రహించడంలో కూడా అడ్డంకి కాగలదు.

రోజుకు మూడునుంచి ఐదు కప్పులకు మించి తాగకూడదు.

అంతకంటే ఎక్కువ అయితే రక్తహీనత వంటి ఇతర ప్రతికూల ప్రభావాలు ఎదురవుతాయి. అలాగే పడుకునే ముందు తాగకూడదు.

ఇలా ఎన్నో ప్రయోజనాలు కలిగిన టీని తాగటంవల్ల ఆరోగ్యంతోపాటు ప్రతిరోజూ పనిలో ఉత్సాహం, ఉల్లాసంగాఉంటారు. మోతాదుకు మించకుండా ప్రతిరోజూ తాగితే ఎప్పుడూ ఆరోగ్యంగా ఉంటారు.

# మానసం



మెరీనా బీచ్‌లో సాయంకాలం చల్లటి గాలులు మెల్లమెల్లగా వీస్తున్నాయి. రోడ్డునుంచి సముద్రంబాగా దూరంగా ఉంది.అందు వలన రోడ్డుమీద వెళ్తున్న వాహనాల రొద అక్కడి వరకూ రావడంలేదు. విశాలమైన బీచ్.

జనాలతో కళకళలాడుతూ ఉంది. రోడ్డుపైన సాయంకాలంపూట వాకింగ్ చేసేవాళ్ళు, రోడ్డు పొడవునా ఉన్న అరుగులపై కూర్చుని కబుర్లు చెప్పుకునే వాళ్ళు, అక్కడక్కడా తోపుడుబండ్లపై చాట్‌లు, పానీ పూరీలు, ఇంకా రకరకాల చైనీస్ నూడుల్స్, తినుబండారాలు తయారుచేసి అమ్మే జనాలు మహా బిజీగా ఉన్నారు వాళ్ళ వ్యాపారాలు చేసుకుంటూ.

మానస ఒంటరిగా ఇసుకలో కూర్చొని సముద్రం వైపు చూస్తూ ఆలోచనలలో మునిగి ఉంది. చుట్టుపక్కల జనాల సందడి, చిన్న పిల్లల ఆటలు, సముద్రంలో క్రమంతప్పకుండా వస్తున్న కెరటాలలో కాళ్ళు తడుపుకుంటూ అల్లరి చేసే అమ్మాయిల ఉల్లాసం, ఏవీ కూడా ఆమెను తాకడం లేదు.

తన సమస్యలో కూరుకుపోయి ఆలోచనలను మదించుకుంటూ ఒక్కతే కూర్చుని ఉంది. ఇంటికి వెళ్తే తనకోసం కాపు కాసి ఉండే సమస్యలను ఎదుర్కోలేక ఇంటికి వెళ్ళడానికి ఆమె మనసు అంగీకరించడం లేదు. మరో వంక ఆఫీసులో పని ఒత్తిడికి ఆమె శరీరం మరింత అలిసిపోతోంది.

ఒక వంక మనసు, మరో వంక శరీరం రెండూ మొండికేస్తున్నాయి ఇక ఎంత మాత్రం అవి ఆమెకు సహకరించడానికి అంగీకరించడం లేదు.

ఇంటి బాధ్యత తను ఒక్కతే మోయవలసి వస్తోంది. తల్లికి అనారోగ్యం, తండ్రి ఇల్లు పట్టించుకోకపోవడం, తమ్ముళ్ళ బాధ్యత తనపైన ఉండటంతో ఆమెకు చిన్న వయసులోనే వందేళ్ళ జీవితం అనుభవంలోకి వచ్చేసింది.

మెరిట్ విద్యార్థి కావడంతో డిగ్రీ కాగానే మంచి కంపెనీలో ఉద్యోగం దొరికింది. అది మొదట్లో ఆమె సమస్యలు తీరడానికి పనికివచ్చినా తర్వాత మరిన్ని సమస్యలను పెంచింది.

అదే ఆఫీసులో చంద్రం పనిచేస్తున్నాడు. మానస కొత్తగా ఉద్యోగంలో చేరినప్పుడు పని నేర్చుకోవడానికి మేనేజర్ ఆమెని చంద్రం దగ్గరకు పంపించాడు.

మొదట్లో అతని గురించి ఆమెకు అంత మంచి



అభిప్రాయం ఉండేది కాదు. ఎప్పుడూ కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లు మాట్లాడేవాడు. తనకు ఏమైనా సందేహాలు వస్తే అడగడానికి చాలా మొహమాటపడేది. అయితే ఒకసారి మేనేజర్ ఒక అర్జెంట్ పని చెప్పాడు చంద్రానికి.

అది చేయడం కోసం అతనికి టైమ్ ఎక్కువ లేకపోవడంతో చంద్రం చాలా టెన్షన్ పడుతున్నాడు. అది గమనించిన మానస అతనికి కావలసిన సహాయాన్ని అతను కోరకుండానే అందించింది.

దాంతో చంద్రానికి ఆమెపైన మంచి అభిప్రాయం ఏర్పడింది. అప్పటినుంచి ఆమెతో తరచుగా మాట్లాడటం స్నేహంగా ఉండటం మొదలుపెట్టాడు.

మెల్లమెల్లగా చంద్రంపట్ల ఆమెకు కూడా సదభిప్రాయం ఏర్పడింది. బహుశా అతను అందరిలా ఆమెను ఒక స్త్రీగా కాకుండా తనతోటి ఉద్యోగిగా చూడడం వల్ల కావచ్చు.

లేదా అందరిలా ఆమె అందాన్ని కళ్ళతోనే తినేసేలా చూడకుండా హుందాగా ప్రవర్తించడంవల్ల కావచ్చు. లేదా అతనితో మాట్లాడుతుంటే తన వ్యక్తిగత విషయాల గురించికాకుండా వృత్తికి అవసరమైనంత వరకే మాట్లాడే అలవాటు వల్ల కావచ్చు.

లేదా ఈ అన్నింటివల్లా కావచ్చు. ఆమెకు అతనంటే ఆ సదభిప్రాయం ఏర్పడింది. చంద్రంతో మాట్లాడాలి అంటే ఆమె మనసు ఉరకలు వేసేది.

క్రమేపీ ఒకరిపై ఒకరికి అప్పటివరకు అంతర్గతంగా ఉన్న ఇష్టం బయటకు వచ్చినట్లుంది, వాళ్ళు బాగా దగ్గరయ్యారు మానసికంగా!

చంద్రంతో అప్పుడప్పుడు అలా బీచ్‌లో కలుసుకోవడం మొదలైన తర్వాత ఆమెకు కొద్దిగా రిలీఫ్ కూడా అనిపించడం మొదలుపెట్టింది.

ఈరోజు కూడా అతనితో కాసేపు కలిసి మాట్లాడి వెళ్దామని బీచ్‌కి వచ్చింది.

ఇద్దరూ కలిసి వచ్చేవారు గాని, లాస్ట్‌మినిట్‌లో మేనేజర్ పిలిచి అర్జంట్‌గా చేయవలసిన పని చంద్రానికి అప్పగించాడు. మానసను ముందు వెళ్ళమని తను త్వరగా వచ్చేస్తానని చెప్పాడు చంద్రం. ఆఫీసు నుండి బీచ్‌కి రావడానికి పెద్ద టైమ్ పట్టదు. మానస బీచ్‌కి వచ్చి తాము ఎప్పుడూ కూర్చునే చోట కూర్చుని చంద్రం కోసం ఎదురుచూస్తూ ఉంది.

ఆమె ఫోన్‌లో మెసేజ్ టోన్ వస్తే స్క్రీన్ వైపు చూసింది. చంద్రం నుంచి మెసేజ్. "బాస్ దగ్గర ఉన్నాను. ఇంకో పదినిముషాలు పడుతుంది. సారీ ఫర్ ద డిలే" అని ఉంది.

చంద్రం ఎప్పుడూ ఆమెను నవ్విస్తూ ఉంచడానికే ప్రయత్నిస్తుంటాడు. అతను ఆమెతో ఉన్నప్పుడు ఆమెకు తన బాధలు, సమస్యలు గుర్తుకురావు. లోకమంతా అందంగానూ, తాను నడుస్తున్న దారి పూలబాటలాగానూ, తనజీవితం నందనవనంలాగానూ తోస్తూ ఉంటుంది.

అతను లేనప్పుడు మాత్రం ఆమె మనసంతా చిందరవందరగా సమస్యల వలయంలా ఉంటుంది. సముద్ర ఘోష జనాల సందడిలో పెద్దగా తెలియడం లేదు. కానీ,ఆ ఘోష మాత్రం ఆమెను తాకుతూనే ఉంది.నిజానికి అది తన హృదయాంతరాళంలోనుంచి వచ్చినట్లు అనిపిస్తూ ఉంటుంది ఆమెకు.

సముద్రానికి 'రత్నగర్భ' అని కూడా పేరు. దానిలో ఎన్నో వెలకట్టలేని సంపదలు దాగి ఉంటాయని అంటారు. అయినా ఎందుకని ఆ సముద్రానికి ఆ ఘోష! ఏం బాధలను ఎవరితో మొరపెట్టుకుంటూ ఘోష పెడుతూ ఉంటుందో కదా అనుకుంది మానస.

ఆ ఘోషకు కారణం ఉందో లేదో కూడా తెలియదు. కానీ తన బాధలకు మాత్రం చాలా కారణాలు ఉన్నాయి అనుకుంది. తనకు ఉన్నన్ని సమస్యలు తన ఈడు అమ్మాయిలెవరికీ ఉండవు అనుకుంది. ఆ బాధలను తట్టుకునే మానసిక స్థైర్యం తనకి చంద్రం వల్ల మాత్రమే లభిస్తుంది.

తను ఏమైనా సంతోషంగా ఉంది అంటే దానికి ఏకైక కారణం చంద్రం ఒక్కడే అనుకుంది.

ఆ రోజు పున్నమి కావడంతో సముద్రంపైన చంద్రోదయం అయింది. నిండు చందమామ పెద్దగా ఆకాశంలో వెలుగుతున్నాడు.

ఆ చంద్రుడి కాంతి సముద్రంపైన మెరుస్తూ నల్లటినీళ్ళపైన తెల్లటి పాపిడిలా కనిపిస్తోంది. అది చంద్రుడు తనను చేరడానికి నడిచివస్తున్న దారిలా అనిపించి మనసులోనే నవ్వుకుంది.

"ఏమిటి, నీలో నువ్వే నవ్వుకుంటున్నావు" అన్నాడు చంద్రం. అతను సరిగ్గా అప్పుడే వచ్చి ఆమె పక్కనే కూర్చు న్నాడు.

"నువ్వొచ్చావు, నవ్వొచ్చింది" అంది మానస. క్షణకాలం ఆమె కళ్ళు వెన్నెల కాంతిలో మెరిశాయి. కాని తను అప్పటి వరకు ఆలోచించిన సమస్యలు అప్పుడే ఆమెని వీడిపోవడానికి ఇష్టపడక ఆమె మనసుని పట్టుకునే ఉన్నాయి. దాంతో ఆమె ముఖంలో చీకటి దోబూచులాడింది.

"బాగుంది. కవిత్వం రాస్తున్నావా ఈ మధ్య" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"నా బతుక్కి అదొక్కటే తక్కువ.నీకు తెలుసుగా నా పరిస్థితి. ఎన్నాళ్ళు నేను ఈ వలయంలో కొట్టుకుంటూ ఉండాలో తెలియడంలేదు" అంది మానస.

గొర్లి శ్రీనివాసరావు

# కామెడీ కథల పోటీ ఫలితాలు

వివిధ వయస్సులలో, వివిధ సందర్భాలలో, వివిధరకాలుగా నవ్వగలిగిన ఏకైక ప్రాణి మనిషి ఒక్కడే. నవ్వడం భోగం- నవ్వకపోవడం రోగం. నవ్వుతో మనసుల్ని జయించవచ్చు. నవ్వు, నవ్వించు అన్న కాన్సెప్టే ఈ కామెడీ కథల పోటీ ఉద్దేశం. అందుకే ప్రతి ఏటా ఈ పోటీని నిర్వహిస్తున్నాం. లబ్ధప్రతిష్ఠులైన రచయిత(త్రు)లతోపాటు కొత్తవారు కూడా ఈ పోటీలో పాల్గొని విజయవంతం చేశారు. బహుమతి కథలతోపాటు బాగున్నవాటిని సాధారణ ప్రచురణకు తీసుకున్నాం. ప్రకటించిన విధంగా ఒక్కొక్క కథకి ₹ 10,000 చొప్పున మొత్తం 10 కథలకు

**లక్ష రూపాయల బహుమతులను అందించాం.**

## ₹ 10,000 చొప్పున బహుమతి పొందిన విజేతలు

ఇల్లు మారి చూడు!! - కె.కె.రఘునందన

"బ్రో..చే.. 'వా...' రెవరు రా?!"- తులసి బాలకృష్ణ

మూగనోము - ఇంద్రగంటి నరసింహమూర్తి

కిరాక్ పార్టీ - తిరుమలశ్రీ

రుబ్బురాయి-ఐశ్వర్యారాయి - ద్విభాష్యం రాజేశ్వరరావు

మొగుడు ముచ్చుమొహంగాడు - పసుపులేటి తాతారావు

గ్రూపు జోలికెళ్ళద్దురో - పి.లక్ష్మీశారద

లచిందేవి లైను తప్పింది... - ఆకురాతి భాస్కర్‌చన్ద్ర

వంటింటి రామాయణం - స్వర్ణ ప్రసాద్

కథ సుఖాంతం - గంటి భానుమతి

బహుమతి పొందిన విజేతలకు అభినందనలు. పోటీలో పాల్గొన్న రచయిత(త్రు) లందరికీ కృతజ్ఞతలు. త్వరలో బహుమతి కథల ప్రచురణ ప్రారంభిస్తాం. సాధారణ ప్రచురణకు తీసుకున్న కథల గురించి ఆ యా రచయిత(త్రు)లకు వ్యక్తిగతంగా తెలియజేయడం జరిగింది. -ఎడిటర్

"ఏమైంది ఇప్పుడు?" అన్నాడు చంద్రం, తన వెంట తెచ్చిన వేడి వేడి వేరుశనగపప్పుల పొట్లాం ఒకటి ఆమె చేతిలో పెడుతూ. తన పొట్లాం విప్పి ఒక్కోటి తినడం మొదలుపెట్టాడు.

"ఏమవ్వలేదు అని అడుగు బాగుంటుంది. అమ్మకి టెస్టులు చేయించాను. షుగర్ ఎక్కువ, కొలెస్టరాల్ ఎక్కువ, ట్రైగ్లిజరైడ్స్ ఎక్కువ, ఇలా ఏవి ఎక్కువ ఉండకూడదో అవన్నీ ఎక్కువ. ఏవి ఎక్కువ ఉండాలో అవన్నీ తక్కువ.

ఇలాగే ఉంటే అమ్మకి ఆ ప్రాబ్లమ్ వస్తుంది, ఈ ప్రాబ్లమ్ వస్తుంది అని డాక్టర్ బెదిరిస్తున్నాడు" అంది.

"ఓ, అలాగా! అయ్యో!" అంటూ తినమన్నట్లు సైగచేసి తనుకూడా తినడం కొనసాగించాడు.

"తమ్ముడు మళ్ళీ ఉద్యోగ పరీక్షలలో విఫలం అయ్యాడు.

వాడికి ఇంటర్వ్యూ కాల్ వస్తోంది కాని విజయలక్ష్మి వరించడం లేదు" అంది మళ్ళీ దిగులుగా.

కానీ చంద్రం తింటూ ఉండటం చూసి తనుకూడా పొట్లాంవిప్పి ఒక్కోటి తినడం మొదలుపెట్టింది. "విజయలక్ష్మి ఎవరు పక్క వీధిలో అమ్మాయా, లేక ఎదురింట్లో అమ్మాయా?" అడిగాడు చంద్రం.

అతని పెదవులపైన నవ్వుకనబడటం లేదు. గొంతులో హాస్యమాడుతున్న సూచనలు లేవు.

కానీ కన్నుల్లో కొంటెతనం మాత్రం మానస చూపులను దాటిపోలేదు.

అతని జబ్బమీద గిచ్చి "ఆహా కాదులే, విజయలక్ష్మి అంటే మీ చెల్లెలు. మరిచిపోయావా సొంత చెల్లెలి పేరు" అంది గడుసుగా.

"ఓ, అదా! ఎప్పుడో కలిసింది నన్ను. కానీ ఈ మధ్య కనబడడం లేదు కదా అందుకే మరుపుకి వచ్చిందిలే.

సరే ఇంకా ఏంటీ సమస్యలు?" అన్నాడు చంద్రం.

"వేస్ట్, నీకు నా సమస్యలు చెప్పడం శుద్ధ దండగ వ్యవహారం" అంది లేచి నుంచుని.

"ఏం వెళ్ళిపోదామా?" అన్నాడు చంద్రం తను కూడా పైకి లేస్తూ.

"లేదు మహారాజా! ఇలా వేంచేస్తే మీ కోసం ఇక్కడ వెన్నెల దారి పరిచాడు మీ నామధేయంతో గగనంలో నవ్వులు రువ్వుతున్న చందురూడు" అంది అతనికి చెయ్యి అందిస్తూ.

"ఈమధ్య నువ్వేదో కవితలవాట్సప్ గ్రూప్‌లో చేరినట్లు నాకు అనుమానంగా ఉంది. చీటికీమాటికీ కవితలు పెడుతున్నావు" అన్నాడు చంద్రం సీరియస్‌గా ఆమె చెయ్యి అందుకుని ఇసుకలో ఆమె పక్కపక్కనే నడుస్తూ.

కెరటాలతో ఆడుకునే జనాలు కొద్దిగా పలచబడ్డారు.

సముద్రంలో నీరు నల్లటిరంగుతో ఎత్తూపల్లాలు లేని సామ్యవాదాన్ని ప్రకటిస్తూ ఉంటే, ఆ నల్లటి నీటిలో కెరటాల నురుగు తెల్లతెల్లగా కనిపించి ఆహ్లాదపరిచింది. మల్లెలచెండులు జడలో తురుముకున్న జాణలా సముద్రం సింగారాలు పోతోంది.

అప్రయత్నంగా మానస జడవైపు చూశాడుచంద్రం. నల్లగా ఒత్తుగా ఉన్న వంకీల జుత్తు. మల్లెల దండ కొనివ్వాలి ఈమెకి అనుకున్నాడు.

"వింటున్నావా?" అంది ఏదేదో మాట్లాడుతున్న మానస. చంద్రంనుంచి జవాబు లేకపోయేసరికి.

"ఆ ఆ వింటున్నాలే. కానీ ఏమిటో నల్లటినీళ్ళు అంటే నాకు భయం.

నన్ను నీళ్ళకు దగ్గరగా తీసుకువెళ్ళకు" అన్నాడు చంద్రం.

"ఎందుకు భయం" అంది మానస ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"మన దృష్టికి కనబడనివి అక్కడ ఉంటాయేమో అని నల్లటి చీకటి అన్నా, చీకటిలో సముద్రంఅన్నా నాకు భయం" అన్నాడు చంద్రం.

"సాయంత్రంవరకు చూసిఎంజాయ్ చేసిందే కదా!చీకటిలో నల్లగా కనబడితే అంతలా దూరం పెట్టాలా?

మనకు తెలిసినవాళ్ళనే తీసుకో, నవ్వుతూ ఆనందంగాఉంటే వాళ్ళదగ్గర గడపడానికి అభ్యంతరంఉండదు కానీ వాళ్ళే ఏదో అవసరంలో ఉంటే వాళ్ళెవరో తెలీనట్లు ప్రవర్తిస్తామా చెప్పు" అంది మానస.

"డౌటేలేదు నిన్నేదో కవితల వాట్సప్ ఆవహించింది. కదిపితే కవితలు.

ఐనా నిన్నటివరకు ఉన్న విషయాలే ఈరోజు కూడా ఉంటే అది నీకు అంత ఇబ్బంది కలుగచేస్తుందేం మరి" అమాయకంగా ప్రశ్నించాడు.

అతని మాటలు ఆమెను ఆలోచనలలోకినెట్టేశాయి.అతను తనలో లోపాల్ని ఎత్తి చూపినట్లుగా అనడం లేదు.

తననుతనే సరిదిద్దుకునేలా ఒక దారి చూపిస్తు న్నాడు. ఆ నల్లటినీటిలో నీటితో తెల్లటిదారిలా!

ముసిముసిగా నవ్వింది. "ఏమో నువ్వు చెప్తే ఏవీ సమస్యలే కావనిపిస్తుంది. నేనొక్కదాన్నే ఉంటే ప్రతిదీ సమస్యే అనిపిస్తుంది.

నిజం చెప్పాలంటే నీళ్ళంటే నాకూ భయమే. కానీ చిత్రంగా నువ్వు పక్కన ఉంటే నేను దేనికీ భయపడే అవసరం లేదనిపిస్తుంది..." అంది అతనికి ఎదురుగా నుంచుని అతని కళ్ళల్లోకి చూస్తూ.

అతని కన్నుల్లో చంద్రుని కాంతులు కనిపించాయి ఆమెకి. నవ్వనక్కరలేకుండానే ప్రసన్నమైన వదనం అతనిది. ఆమెకు అతనితో ఉంటే మరే అవసరం ఉండదు అనిపించింది."అర్థమైంది. ఈరోజు పున్నమి కదూ అందుకే అలా అనిపిస్తుంటుంది" అన్నాడు చంద్రం నవ్వుతూ.

"అంటే నాకు పిచ్చి అని కదూ నువ్వు చెప్పేది?" బుంగమూతి పెట్టింది మానస.

"ఊహు అలా కాదు, నేను చెప్పేది. పున్నమి చంద్రుడు మనకు ఆహ్లాదాన్ని కలిగిస్తాడు.

అందుకే మనకు అన్నీ అందంగా కనిపిస్తాయి. సమస్యలు చిన్నవిగా కనిపిస్తాయి. కోపం తెచ్చుకోబుద్ది కాదు. అలా అనిపించడం వల్ల నువ్వు నా గురించి ఓ నాలుగుమాటలు చెప్తున్నావు" అన్నాడు.

"ఓహో, లేకపోతే రోజూ నిన్ను తిడుతూ కూర్చుం టున్నానా" అంటూ అతని చేయి పట్టుకుని కెరటాల వైపుకి నడిచింది.

వెనకనుంచి చాలామంది గట్టిగా అరిచారు. "చూసుకోండి, చూసుకోండి" అంటూ.

మాటలలో తాము సముద్రానికి చేరువగా వచ్చా మని కాస్త ఆలస్యంగా గమనించారు చంద్రం, మాన సలు. పెద్ద కెరటం ఒకటి అంత ఎత్తున ఎగిసి వాళ్ళ వైపు వేగంగా ఉరికి వస్తోంది.

"ఊపిరి బిగబట్టు" అన్నాడు చంద్రం మానసను ఒడిసిపట్టుకుని తన దగ్గరకు లాక్కుంటూ.

మానస కళ్ళల్లో చిన్నపాటి బెదురు. వెంటనే కళ్ళు మూసుకుని చంద్రాన్ని గట్టిగా వాటేసుకుంది.

అరక్షణంలో వాళ్ళ శిరసులమీదుగా వెళ్ళిపోయింది పెద్ద కెరటం. ఒడ్డున ఉన్న జనాలంతా హాహాకారాలు చేశారు. చిక్కటి చీకటిలో తామిద్దరూ మునిగినా వాళ్ళకి చీకటంటే ఉన్న భయం వాళ్ళను ఏమీ చేయ లేకపోయింది.

మానస మనసు మామూలుగా కన్నా బాగా ఉంది. చంద్రం కౌగిలిలో బందీఅయ్యాక తనమనసు మరిం తగా ఉల్లాసంగా ఉన్నట్లు గమనించింది ఆమె.

కెరటం నీరు వెనక్కి వెళ్ళడానికి పట్టిన ఇరవై సెకన్లూ బీచ్‌లోని జనం అరుస్తూనే ఉన్నారు. నీరు వెనక్కి మళ్ళాక నిటారుగా నిలబడి మానసను కౌగిట బిగించి పట్టుకున్న చంద్రం కనబడ్డాక ఆ అరుపులు ఉత్సాహంతో కేరింతలుగా మారాయి.

మరోమారు కెరటాలకు తమను ముంచేసే అవ కాశం ఇవ్వకుండా మానసను ఒక్క ఉదుటున పైకి ఎత్తి వడివడిగా బీచ్‌వైపు నడిచాడు చంద్రం.

తన చేతులు రెండూ అతని మెడచుట్టూ వేసి, అతనిమెడపై ముద్దుపెట్టుకుంది మానస.తన సమస్య లకు పర్మినెంట్ సమాధానం ఏమిటో ఆమెకు అర్థ మైంది. ఆమె ముద్దుకి స్పందిస్తూ చంద్రం మానసను మరింత గట్టిగా కౌగిలించుకున్నాడు.

"సముద్రం ఎందుకు ఘోషపెడుతుందా అని నేను ఎప్పుడూ ఆలోచిస్తూ ఉంటాను. నాకు చాన్నాళ్ళుగా దొరకని సమాధానం ఇప్పుడు దొరికింది?" అంది మానస. "ఎందుకు?" అన్నాడు చంద్రం.

"చంద్రుడు క్షీరసాగర మధనసమయంలో పుట్టాడు అంటారు తెలుసుగా?" అంది మానస.

"ఆ తెలుసు" అన్నాడు చంద్రం, ఆమెను బీచ్‌లో దించుతూ. ఒళ్ళంతా తడిసిపోయి ఉన్న మానస బట్టలను పిండుకుంటూ, తనను విచిత్రంగాచూస్తూ మాట్లాడుకుంటున్న జనాలను ఓరకంట గమనిస్తూ అంది. "తనను వీడి చంద్రుడు వెళ్ళిపోయాక సము ద్రానికి తను కోల్పోయినదేమిటో తెలిసింది. ఆకసాన ఉన్న చంద్రుణ్ణి అందుకోలేక ఘోషిస్తూ ఉంటుంది"

"ఊ, ఊ బాగా చెప్తున్నావు. అసలు డౌటే లేదు. నువ్వు ఖచ్చితంగా ఏదో కవితల గ్రూప్‌లో రోజుకి పదికన్నా ఎక్కువ కవితలు పెడుతున్న ట్లున్నావు" అన్నాడు బిగ్గ రగా నవ్వుతూ. జనాలు విచి త్రంగా చూస్తూ ఉన్నారు వాళ్ళ వైపు. వాళ్ళకి అర్థం కాలేదు వీళ్ళు గొడవపడ్డారా! లేక ప్రేమించుకుంటున్నారా! అని.

"ఆ సముద్రఘోష వినీ వినీ మనసు కరిగి చంద్రుడు పున్నమి రోజుల్లో సముద్రం దగ్గరకివస్తాడు. అప్పుడు ఆనందం ఆపుకోలేక ఆ చంద్రుడిని కౌగి లించుకోవడానికి తన కెరటాల చేతులను పై పైకి చాస్తుంది సముద్రం" అంది.

"ఎలా, ఎలా?" అన్నాడు చంద్రం.

"ఇలా, ఇలా" అంది మానస తన చేతులుచాస్తూ.

ఆమె కనులలో తనపైన కురుస్తున్న ప్రేమకు చలించిపోయి చంద్రం ఆమెను తన బాహువులతో మళ్ళీ బంధించాడు. ఆమె మనసులోని బాధలన్నీ మటుమాయం అయిపోయాయి.



ప్రపంచమంతా ఆర్థికరంగంలో నిస్తేజం చోటుచేసుకుంటే భారత్ మాత్రం అభివృద్ధిలో వెలిగిపోతోంది.

-వెంకయ్యనాయుడు, ఉపరాష్ట్రపతి



దేశ హద్దులతో ప్రమేయంలేని సమాచార బదలాయింపు జరగాలి.

-సుందర్ పిచాయ్, గూగుల్ సి.ఇ.ఓ.

## శుభపరిణామం

ఒకనాటి కమర్షియల్ సినిమాల్లోనే తమ సంథా చాటేశామని, ఇప్పుడు తారలకు ఇస్తున్న ప్రాధాన్యం తమకు మరింత మంచి పరిణామం అని తమన్నా ఉత్సాహంగా చెప్తున్నది. చేతినిండా సినిమాలతో ప్రస్తుతం తమ్మి వెరీ బిజీ.

'ఒకప్పుడు మా ఉనికి చాటాల్సిన పరిస్థితిఇప్పుడు లేదు. ఎంతో స్వేచ్ఛతో పూర్తిస్థాయి పాత్రల్లో నటించే అవకాశాలు మా ముందున్నాయి.

ఇది మంచి పరిణామం. మాకు బాధ్యత, సవాల్ పెరిగాయి. మేము చేయాల్సింది ఇంకెంతో ఉంది" అని చెప్పింది తమన్నా.



# నేనెవరో తెలుసా!

ఇప్పుడు ప్రపంచాన్ని భయపెడుతున్న ఆలోచన 'ఐసిస్'. ప్రపంచం మొత్తాన్నీ తమ అధీనంలోకి తెచ్చుకుంటామంటూ ప్రపంచ పటపు రూపురేఖలు మార్చి,తాము కోరుకుంటున్న ప్రపంచం లోని ఏ భాగంలో ఏముంటుందో వివరంగా చెపుతున్నారు. పలురకాలుగా ప్రచారం చేస్తున్నారు.

ఇది మతపరంగా జరపాలనుకుంటున్న విస్తరణ. వారి ప్రస్తుత ఆలోచనకు గతంలో నిర్మించబడిన ఒక మత సామ్రాజ్యం స్ఫూర్తి. అది అటు ఐరోపా, ఇటు ఆఫ్రికా ఖండ దేశాలన్నింటికీ విస్తరించింది. మధ్యధరా సముద్రతీరాన్ని ఆధారంగా చేసుకుని నిర్మించబడినది. నేటి ఐరోపాఖండ దేశాలు ఒకప్పుడు ఆ సామ్రాజ్యంలో అంతర్భాగమే.

అలా మతం ఆధారంగా సామ్రాజ్యాల నిర్మాణం అంత మంచిది కాదని, మిగిలిన వర్గాలవారు తప్పకుండా తిరగబడతారన్నది చరిత్ర.

ఒకే మతస్థులైనా మతాన్ని మించినది ఏదో విప్లవానికి మూలమవుతుందని కూడా చెపుతోంది చరిత్ర. ఆ చరిత్రలో చెప్పినట్టే తొలి ప్రపంచ యుద్ధ సమయంలో ఈ మతఆధారిత సామ్రాజ్యంపై మిత్ర పక్షాలు విజయం సాధించి దానిని తిరిగి కోలుకోనివ్వకుండా చేయాలనుకున్నాయి.

ఆ సమయంలో ఆ సామ్రాజ్యపు సైనికదళాలలో పనిచేసిన ఒక అధికారి భిన్నమైన ఆలోచన చేశాడు. మతంపేరిట సామ్రాజ్య నిర్మాణం సరైనది కాదు అన్నాడు. తాను ఆ సామ్రాజ్యపు మతానికి చెందినవాడినే అయినా మతం ఆధారిత పెత్తనాన్ని అంగీకరించలేనన్నాడు. అదే సమయంలో తమ మత పెద్దల అంశంలో పాశ్చాత్య దేశాల జోక్యం, వారి వలసపాలనను అంగీకరించేదిలేదన్నాడు.

అందుకే తాను సొంతంగా కొన్ని బలగాలనుతీసుకుని ఒక నగరంలో స్థావరం ఏర్పరుచుకుని, ఐరోపా వలస పెత్తనాన్ని ప్రశ్నించాడు.తిరగబడ్డాడు. ఓడించాడు. ఫలితంగా ఒక కొత్త దేశాన్ని ఏర్పాటుచేయగలిగాడు. నేడు ఆఫ్రికా ఖండంలో భౌగోళికంగావున్నా, ఐరోపాతోని సాంస్కృతికంగా అధికంగా అనుబంధం కలిగివున్న ఒక దేశంగా అది స్థిరపడింది. తన దేశాన్ని చీల్చితమ గుప్పిట్లో పెట్టుకోవాలన్న ఐరోపా శక్తుల కుట్రను సాహసంతో భగ్నం చేసి, తన దేశ ప్రజల సహాయంతో ఒక గణతంత్ర రాజ్యంగా రూపొందించాడు.

మతపరమైన అంశంతో రాజ్యాలు ఏర్పడితే ప్రమాదమన్న అంశం ఆయన చాలా ముందుగానే గుర్తించాడు. అందుకే తాను నిర్మించబోతున్న కొత్త దేశం పూర్తిగా లౌకిక విధానాలను అమలుచేస్తుందని ప్రకటించటమే కాదు మతఛాందసవాదాన్ని ఆ దేశపు చాయలలోకి రానివ్వని విధానాలు అమలుచేశాడు.

అటువంటిచక్కని విధానాలు అనుసరించినందునే నేటికీ ఆయనను ఆ దేశం పునర్నిర్మాణ నేతగా కొలుస్తున్నది. పాతపాలనలో అమలు అయిన భాషా లిపిని మార్చి అందరికీ అర్థమయ్యే, అందరి ఆమోదం పొందిన లిపిని అమలులోకి తెచ్చాడు.

చట్టం ముందు స్త్రీ, పురుషులిరువుర్నీ సమానం చేశాడు. మహిళలకు ఓటుహక్కు కల్పించటం 1930ల్లోనే చేశాడు. నాటికీ పలు ఐరోపాఖండ దేశాలలో కూడా మహిళలకు ఓటు హక్కు లేదు. దేశప్రజలందరికీ ఉచిత ప్రాథమిక విద్యను నిర్బంధం చేశాడు. ఇది నేటికీ ప్రపంచ దేశాలలో అమలు కానిది.

ప్రజల విశ్వాసం చూరగొన్న నేత కాబట్టేఆయన అమలుచేస్తున్న సంస్కరణలకు ప్రజలు ఆమోదం తెలియచేశారు. జాతి అంశాలకు ప్రాధాన్యతని ఇవ్వాలన్నాడు. ఆ దేశంలో నివసించే ఇతరులు ఎవరైనా సరే తాను ప్రకటించిన జాతీయ భాషను బహిరంగ ప్రదేశాలలో మాట్లాడాలన్న నిబంధన విధించాడు.

వ్యక్తిగత అంశాలు, ప్రార్థనా విధానాలు, ఇతర అంశాలన్నీ మీ ఇంటివరకే. వీధిలోకి వచ్చిన తర్వాత మీరంతా ఈ దేశ పౌరులు. ఈ జాతి అంటే గర్వపడేలా వుండాలన్నది ప్రజలకు ఆయన ఇచ్చిన సందేశం.ఇతర ఉపజాతులను సూచించే ఇంటి పేర్లు కూడా జాతీయతను సూచించే విధంగా, జాతీయభాషలోకి మార్చుకోవాలన్న నిబంధన అమలుచేశారు.

స్వయంగా తాను తన ఇంటి పేరును కొత్తగా పెట్టుకున్నాడు. "కుటుంబంలో శాంతియుత వాతావరణం వుండాలి. అదే దేశంలో ప్రశాంత వాతావరణం తెస్తుంది. దేశాలన్నీ ప్రశాంతంగా వుంటే ప్రపంచం ప్రశాంతంగా వుంటుంది" అన్నది ఆయన అందించిన ప్రముఖ సందేశం. దానికోసమే తన పాలనా సమయమంతా కృషిచేశాడు. ఆయన అధికారంలో వున్నది కేవలం 15 సంవత్సరాలే. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత 'నూతన జాతి నిర్మాణం' అనే నినాదంతో ప్రజలను కూడగట్టి 1923లో ఆ దేశానికి తొలి అధ్యక్షుడు అయ్యాడు.

తాను అధికారంలో వున్న కాలంలో కొంత వ్యతిరేకత, తిరుగుబాటు ఎదుర్కొన్నాడు.

అయినా ప్రజల మద్దతుతో వాటిని అణచివేసి ఒక నవీన గణతంత్ర దేశాన్ని నిర్మించాడు.

20వ శతాబ్దంలో ఒక కొత్త దేశపు నిర్మాణం ఎలా జరగాలో చేసి చూపించిన నేత ఆయన.

విదేశీ కంపెనీలు ఆ దేశ ఆర్థిక వ్యవస్థను నియంత్రిస్తున్నవి ఆ కాలంలో. దేశంలో చమురు ఉత్పత్తి లేదు.అయినా వెరవక తన ఆర్థిక సంస్కరణలను అమలుచేశాడు.

విదేశీ సంస్థలను జాతీయం చేశాడు. పత్తిపంటను ఎక్కువగా ప్రోత్సహించాడు. విదేశీ బ్యాంకులకు పోటీగా ఒక జాతీయ బ్యాంక్‌ని ప్రారంభించాడు. దేశంలో రైల్వేవ్యవస్థను నిర్మించాడు.

పారిశ్రామిక విప్లవానికి రైల్వేలు చాలా ముఖ్యమన్నది ఆయన ఆలోచన. ఆ దేశ పునర్నిర్మాణం జరుగుతున్న సమయంలోనే ప్రపంచంలో అతిపెద్ద ఆర్థికమాంద్యం వచ్చింది. అన్ని దేశాలను కుదిపినట్టే ఆ దేశాన్నీ కుదిపేసింది.

ఆ సమయంలో కూడా అటు పెట్టుబడి ఇటు సోషలిస్ట్ విధానాలలో ఏదో ఒకదానివైపు గుడ్డిగా మొగ్గక జాతీయ ప్రయోజనాలను అందించే మధ్యే ఆర్థిక విధానాన్ని అనుసరించి ఆ ఆర్థికమాంద్యాన్ని తట్టుకుని దేశాన్ని గట్టెక్కించగలిగాడు.

సాదాసీదా కుటుంబంలో పుట్టి, సైనికదళంలో చేరాడు. అది చక్రవర్తి సైనికదళం.

'ఆ రాజ్యపాలనకు వ్యతిరేకి' అని ఆ సమయంలోనే అతన్ని అరెస్టుచేశారు. ఆ తర్వాత ఒక రహస్య సైనిక బృందంలో చేరి క్రమంగా ఎదిగాడు.

సైనికదళాలలో వుంటూనే యుద్ధరంగంలో తన ప్రతిభను ప్రదర్శించి, గుర్తింపు పొంది తన నాయకత్వ పటిమతో ఆ దేశానికి 'జాతిపిత' అయ్యాడు.

**1981 ఆయన శతజయంతి సంవత్సరం. ఆ సంవత్సరాన్ని ఐక్యరాజ్యసమితి, యునెస్కోలు సంయుక్తంగా ఆయన పేరుకు అంకితంచేశాయి. వలసపాలనను ఎదిరించిన తొలి జాతీయవాదిగా ఐక్యరాజ్యసమితితో కొనియాడబడ్డాడు.**

**మనుషులంతా ఒక్కటే అనే ఆలోచనతో తన పరిపాలన సాగించి, అంతర్జాతీయ గుర్తింపు పొందిన వ్యక్తి ఆయన. ఇంతకీ...**

***1. ఆ నేత పేరేమిటి?***

***2. ఆయన నిర్మించిన దేశమేది?***

**ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 29 సెప్టెంబర్ 2018 తేదీలోగా పంపించండి. కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹500/- నగదు బహుమతిని అందజేస్తాం.**

14.9.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు:
1. రావిశాస్త్రి, 2. అల్పజీవి.
**₹500/- బహుమతి పొందిన విజేత :**
జి.విశ్వనాథరావు, 21/బి-31,
శ్రీకృష్ణదేవరాయ కాలని, 8వ రోడ్,
ఆదోని 518 301, కర్నూలు జిల్లా.

"ఏం టయ్యా ధనుంజయ్... సత్యకుమార్‌గారి హత్యజరిగి అప్పుడే పదిహేనురోజులపైనే అయ్యింది. ఇప్పటివరకు హంతకుడెవరో, ఏ మోటివ్‌తో హత్యచేశాడో పసిగట్టలేకపోయారు.

ఇలా అయితే ఎలాగయ్యా... అవతల డీఎస్పీగారు నా తాటతీస్తున్నారు. నీకింద పనిచేసేవాళ్ళు ఇంత దద్దమ్మలేంటయ్యా... అంటూ నన్నుహేళన చేస్తున్నారు" ఆవేశంతో కారాలు మిరియాలూ నూరసాగాడు లోహితుడు.

నున్నగా గీకించుకున్న తిరుపతి గుండుమీద జుట్టు మొలుస్తున్న చిహ్నంగా ఆకుపచ్చగా తయారైన తలకట్టు, రాక్షసుడికిమల్లే ఉన్న దట్టమైన కనుబొమ్మలు, జీవితంలో ఏనాడైనా నవ్వుతాడా అన్నట్లుగా ధుమధుమలాడుతున్న మూర్ఖపుముఖమూ, కదిలితే పిట్లిపోయేంత బిగుతుగా ఉన్న యూనిఫామ్, చేతులకి కట్టుకున్న అనేకానేక పుణ్యక్షేత్రాలకి చెందిన వివిధ రకాల కాశితాళ్ళూ...

వింతగొలిపే రూపంతో తమముందు కూర్చుని హుంకరిస్తున్న అతడినిచూస్తే నువ్వు ముంచుకొస్తోంది ధనుంజయ్, సోమయాజులుకి. "వెంకటరమణ మూర్తీ... మమ్మల్ని క్షమించు తండ్రీ..." మనసులోనే స్వామిని వేడుకుని దండాలు పెట్టుకున్నారిద్దరూ.

"నేనిలా గొంతు చించుకుంటూ ఉంటే అలా బెల్లంకొట్టిన రాళ్ళలా ఉలకరు పలకరు.. ఏమిటి మీ ఉద్దేశ్యం. అసలు మిమ్మల్ని కాదు... మీకు పోలీసు ఉద్యోగం ఇచ్చినవాళ్ళని అనాలి. ప్రతివాడూ ఎగేసుకుని పోలీసైపోదామని వచ్చేవాడే" రంకెలేయడం మొదలెట్టాడు లోహితుడు.



"సారీ సర్... నా ప్రయత్నం నేను చేస్తున్నాను... ఏ క్లూలూ దొరకలేదు" అని వినయంగా చెప్పాడు ఎస్సై ధనుంజయ్.

"దొరకవయ్యా... మీరింత చచ్చుదద్దమ్మలైతే ఎలా దొరుకుతాయి? అయినా క్లూలు తమంతట తాము దొరకవయ్యా... మనమే దొరకపుచ్చుకోవాలి. అది మీలాంటి దద్దమ్మలవల్ల కాదని నాకు తెలుసు" మండిపడ్డాడు లోహితుడు తనదైన ధోరణిలో.

నిజంగా ఆ పైఅధికారులు తమని 'దద్దమ్మ'లు అని అన్నారో లేదోగాని లోహితుడు పదేపదే ఆపదం వాడుతూ తమని కించపరుస్తూంటే సహన యోగ్యంగా లేదు ధనుంజయ్‌కి.

ఆవేశాన్ని పళ్ళబిగువన అణచుకుంటున్నాడు.



# శైని

## కె.కె. భాగ్యశ్రీ

"ఆధారాల సంగతి సరేగాని, అనుమానితులెవరన్నా ఉన్నారా?

ఈ కేసుకి సంబంధించి ఎవరినన్నా అరెస్టు చేశారా?"ప్రశ్నపరంపర సంధించాడు లోహితుడు.

సోమయాజులు ఏదో చెప్పబోతూ ఉంటే అతడి కాలు నెమ్మదిగా తొక్కాడు ధనుంజయ్. ఆ సంజ్ఞ అర్థమైనవాడిలా మౌనం వహించాడు అతడు.

"లేదు సార్... ఎవరిని అడిగినా సత్యకుమార్ మంచివాడని, పదిమంది మేలుకోరేవాడని చెప్తున్నారే తప్ప... ఎవరూ అతడి గురించి చెడ్డగా మాట్లాడడం

### ఆత్రుతగా ఉంది

శరీరాన్ని చక్కగా, సన్నగా తీర్చిదిద్దుకోవడంతో పాటు నటనకూ బాగా సానపెడుతున్నది రాశీఖన్నా. ఈ ఏడాది 'తొలిప్రేమ' హిట్‌కొట్టేసి, 'శ్రీనివాస కల్యాణం'తో మంచి మార్కులు పొందిన రాశీఖన్నా ప్రస్తుతం విజయ్‌దేవరకొండతో ఓ సినిమా చేస్తోంది. ఈ చిత్రంగురించి బోల్డెంత ఉత్కంఠగా ఉందంటున్నది.

"సినిమాలపట్ల ఎంతో ఇష్టంగల విజయ్ దేవరకొండతో కలిసి నటించబోయే సినిమాకోసం ఆత్రుతపడుతున్నాను. అటువంటి వ్యక్తితో నటించడం నా అదృష్టం" అంటున్న రాశీఖన్నా ఎన్టీఆర్ బయోపిక్‌లో జయప్రద పాత్రకోసం తనను ఎవ్వరూ సంప్రదించలేదని చెప్పింది.





6

## జరిగిన కథ

సత్యకుమార్ హత్య జరిగిన ప్రదేశంలో ఎటువంటి క్లూ దొరకలేదని హెడ్‌కానిస్టేబుల్ సోమయాజుల వద్ద వాపోతాడు ఎస్.ఐ. ధనుంజయ్. తన బాయ్‌ఫ్రెండ్ వినీత్‌ని కలుస్తుంది సుష్మ.

వినీత్ చెప్పింది విని భయపడుతుంది. రిస్క్ అయినా నీకోసం చేస్తున్నానంటుంది. సెక్యూరిటీ గార్డ్‌ని విచారిస్తారు ధనుంజయ్, సోమయాజులు.

సుహాసిని చాలా మంచి మనిషని ఆ విచారణలో చెబుతాడు అప్పలకొండ. తన చిన్నన్న తనకేమన్నా బహుమతులు పంపితే, ఇంట్లో మాత్రం అది సుహాసిని కొని ఇచ్చి నట్లుగా చెబుతుంటుంది సుష్మ. అది పెద్ద తప్పుగా భావించదు అభిజ్ఞ.

భర్తపోయాక కంపెనీ వ్యవహారాలన్నీ చూడటం మొదలుపెడుతుంది వైశాలి. భర్త పర్సనల్ కప్‌బోర్డు లాక్ ఓపెన్ చేయాలంటే దాని 'కీ' తన వద్ద లేదని పి.ఎ. మణి, వైశాలితో చెబుతాడు. ఇక జరిగేది చదవండి.

లేదు. అలాంటివాడికి శత్రువులెవరుంటారు అనుమానించడానికి" చెప్పాడు ధనుంజయ్.

"అలా అయితే చికాకేనయ్యా... ఆఫీసులోనూ, కుటుంబసభ్యులందరినీ ఇంటరాగేట్ చేశావా?"

"ఆఫీసువాళ్ళల్లో కొందరిని, ఆయనకి బాగా కావలసిన బంధువులని అడిగాను సార్... కాని, లాభం లేదు... ఎవరికీ ఏమీ తెలియదనే అంటున్నారు.. ఇంకా ఇంకొందరిని విచారించవలసి ఉంది.

హత్య జరిగిన రోజు డ్యూటీలో ఉన్న గెస్ట్‌హౌస్ వాచ్‌మేన్ అందుబాటులో లేడు. ఆ తరువాతకూడా అతడు కనబడడంలేదు.

ఇంకా ఆఫీసు వ్యవహారాల్లో సత్యకుమార్ గారికి రైట్‌హ్యాండ్‌గా చెప్పబడే మణినికూడా ప్రశ్నించాలి... వాళ్ళని అడిగితే మరికొంత సమాచారం దొరకవచ్చునేమో!" అన్నాడు ధనుంజయ్ సాలోచనగా తలూపి.

"విచారించండయ్యా... ఇంకా ఎన్నాళ్ళీ నత్తనడక ఇన్వెస్టిగేషన్...అయినా అంత ముఖ్యమైనవాళ్ళని ఇన్నాళ్ళపాటు ప్రశ్నించకుండా ఉండడం ఏమిటి!" చిరాకుపడ్డాడు లోహితుడు.

"కాదు సార్... మణిగారు అప్పుడు ఊళ్ళో లేరు... వాచ్‌మేన్ కూడా పత్తాలేడు... సో... వాళ్ళని ప్రశ్నించడం లేటైంది..."

తన ప్రయత్నలోపం ఏమీ లేద న్నట్లు చెప్పాడు ఎస్సై ధనుంజయ్.

"ఇంతకీ సత్యకుమార్‌కొచ్చే ఫోన్‌కాల్స్ పరిశీలించావా?" అడిగాడు లోహితుడు.

"పరిశీలించానుసార్... అతడి కాల్‌హిస్టరీ వెరిఫై



**కాంగ్రెస్ పార్టీలో వున్న నా స్నేహితుల రక్తంలో బ్రాహ్మణుల డి.ఎన్.ఎ. వుంది.**

-రణదీప్ సుర్జేవాలా, కాంగ్రెస్ నేత



**కోట్లు ఖర్చుచేసి గెలిచిన తర్వాత అవినీతికి పాల్పడకపోతే ఇంట్లో అతని భార్యకూడా నిలదీస్తుంది.**

-అయ్యన్నపాత్రుడు, ఎ.పి. మంత్రి

చేశాం. ఎవరినీ శంకించేవరకు ఏ రకమైన ఆధారాలు లేవు.

అతడు చేసిన కాల్స్ అన్నీ కంపెనీకి సంబంధించిన మనుషులకి, ఆయన భార్య అయిన వైశాలిగారికి, ఇంకా ప్లంబర్లు, కార్పెంటర్స్ వగైరా వగైరాలకి తప్ప... అనుమానితులెవ్వరూ లేరు" నిజాయితీగా చెప్పాడు ధనుంజయ్.

"సరేనయ్యా... ఏం చేస్తావో... ఎలా చేస్తావో నాకు తెలియదు... యాజెర్లీ యాజ్ పాజిబుల్... దోషులెవరో తేలాలి" అంటూ తాను తెచ్చిన తిరుపతి ప్రసాదం పొట్లాలని స్టాఫ్ అందరికీ పంచిపెట్టమని ఆదేశించి గుండునోసారి తడుముకుని టోపీ పెట్టుకుని నిష్క్రమించాడు లోహితుడు.

"బతికాం సార్..." అంటూ నిట్టూర్చి... "సార్ నాదో సందేహం... అడగమంటారా?" అన్నాడు సోమయాజులు.

ఏమిటన్నట్లు చూశాడు ధనుంజయ్.

"వైశాలి గారి ఫిర్యాదు మేరకు మనం సుహాసిని గారిని పిలిచి ఇంటరాగేట్ చేశాం కదా... మరి... ఆ విషయం సార్ దగ్గర దాచారెందుకు?" అనుమానంగా చూశాడు సోమయాజులు.

"కావాలనే దాచాను యాజులుగారూ... సుహాసిని గారి మీద వైశాలికున్నది కేవలంఅనుమానంమాత్రమే. ఆమెకిందులో భాగముంది అని వైశాలిగారు నిర్ధారించలేదు. మన దర్యాప్తులోకూడా ఏమీ తేలలేదు.

అలాంటప్పుడు ఈ విషయం పైవాళ్ళకి చెప్తే... వాళ్ళు ఆమెని ఇంకా ఇంకా వేధిస్తారు. ఒక పరువుగల ఆడదాన్ని పదేపదే రచ్చకీడ్వడం తగని పని అనిపించింది. అఫ్‌కోర్స్ నేను నా డ్యూటీకి అన్యాయం చేస్తున్నాననిపించినా సరే" దీర్ఘంగా చెప్పి నిట్టూర్చాడు ధనుంజయ్.

సోమయాజులు అభినందనపూర్వకంగా చూశాడు ధనుంజయ్ వైపు.

"యు ఆర్ రియల్లీ గ్రేట్ సార్..." అన్నాడు మనస్ఫూర్తిగా.

"అలా ఆకాశానికి ఎత్తేటంతటి గొప్పదనం నాలో లేదండీ... సుహాసినిగారిలో నాకు నా తోబుట్టువు కనబడింది. అఫ్‌కోర్స్... ఆడవాళ్ళందరినీ నేను అలాగే భావిస్తాను. వృత్తిరీత్యా కొంచెం కరుకుగా ప్రవర్తించవలసి వస్తుంది కాని, స్త్రీలపట్ల నాకు తేలికభావం మాత్రం లేదు" మృదువుగా పలికాడు ఎస్సై ధనుంజయ్.

"అందరూ మీలాగా ఆలోచిస్తే... ఈ దేశంలో ఆడవాళ్ళని అగౌరవపరచడం తగ్గుతుంది సార్" గద్గదమైంది సోమయాజులు స్వరం.

"మీరు మరీ సున్నితం యాజులుగారూ... డోంట్ బి ఎమోషనల్..." ధనుంజయ్ చెప్పాడు సోమయాజులు భుజం తడుతూ.

"అభీ... ఇంటర్నల్స్ అయిపోయాయి కదా! ఎక్కడికన్నా వెళ్దామా?" అని ఆ రోజు సాయంత్రం త్వరగా ఇంటికొచ్చిన కూతురిని అడిగింది సుహాసిని.

"ఎక్కడికమ్మా?" అనాసక్తంగా అడిగిందిఅభిజ్ఞ.

"మూవీ... గుడికి... షాపింగ్"

నిజానికి సుహాసినికి ఎక్కడికీ కదలాలని లేదు. ఇంట్లోనే ముడుచుకు కూర్చోవాలని ఉంది. కాని, అలా ఈ నాలుగు గోడలు చూస్తూ కూర్చుంటే ఆనాటి పరాభవం తలపులలో మెదులుతూ మనశ్శాంతిని హరిస్తోంది.

కనీసం కూతురితో బయటికి వెళ్ళి కాసేపు తిరిగొస్తేనన్నా ఊరట దొరుకుతుందేమో అని... ఆమె భావన. అంతలోనే నవ్వొచ్చింది.

తన పిచ్చిగాని, ఎక్కడికి వెళ్ళినా మనసు మనతోనే ఉంటుంది కదా! మాంత్రికుడి ప్రాణం చెట్టు తొర్రలోని చిలుకలో దాచినట్లు... ఈ పిచ్చి మనసుని ఇంట్లోనే వదిలేసి వెళ్ళగలిగే ఏర్పాటు ఉంటే ఎంత బాగుంటుంది! తన ఊహ తనకి సిల్లీగా తోచి తనలో తనే నవ్వుకుంది సుహాసిని.

"ఏంటమ్మా... నవ్వుకుంటున్నావూ?" అడిగింది అభిజ్ఞ తల్లిపెదవులమీద ఈ మధ్యకాలంలో కనుమరుగైన నవ్వుని గమనిస్తూ.

"ఏం లేదురా... ఏదో గుర్తొచ్చి... చెప్పు... ఎక్కడికెళ్దాం?" అడిగింది సుహాసిని.

"ముందు గుడికెళ్దాం... అక్కడినుంచి సినిమాకి అట్నుంచటే హోటల్‌కి... సరేనా... తల్లివదనంలో నిండుగా విరిసిన దరహాస కుసుమాన్ని పరవశంగా చూస్తూ చెప్పింది అభిజ్ఞ.

'సుహాసిని' సార్థక నామధేయురాలు. చంద్రబింబంలాంటి కూతురి మోము నవ్వులు వెదజల్లే సుమవనంలా పరిమళిస్తున్న భావనతోనో ఏమో... ఆమె తల్లిదండ్రులు ఆమెకు ఆ పేరు పెట్టారు.

'నీ నవ్వుకే నేను పడిపోయాను తెలుసా!' అంటూ సుహాసినితో అంటూ ఉండేవాడు తరచుగా.

'అబ్బా! నానవ్వు అంతబాగుంటుందా!'

బాగుండడమా! అద్భుతం... నీకొకటి తెలుసా సుహా... ఎంత అందమైనవాళ్ళకైనా ముఖంలో నవ్వు లేకపోతే ఆ అందం వాసనలేని పువ్వులాగా అనిపిస్తుంది. తీరైన ముఖబింబానికి నిండైన చిరునవ్వే సోయగాన్నిస్తుంది తెలుసా!

ఇది తెలియకే... చాలామంది ముఖం మొటమొటలాడించుకుంటూ, తిరుగుతారు. కాని, నువ్వలా కాదు... ఎప్పుడూ నవ్వుతూనే కనిపిస్తావు.

విరిసిన వెన్నెలలాగా, కురిసే పూలజల్లులాగా, స్వచ్ఛమైన మంచుముత్యాల్లాగా... నీ అధరాలమీద మెరిసే ఆ చిరునవ్వుని చూస్తూ ప్రాణం వదిలేయవచ్చును తెలుసా?" అంటూ ఆరాధనగా పలికే తేజస్విని చూస్తే మనసు ఆనందతరంగమై ఎగిసిపడేది.

'అదేమిటి తేజా అలా అంటావు! నేనెవరితోనూ కలవనని, సీరియస్‌గా ఉంటానని అందరూ నన్ను వెక్కిరిస్తారు... నువ్వేమిటి నా పెదవులపైన నిత్యం చిరునవ్వు ఉంటుందని అంటావు!' అంతలోనే సందేహం వెలిబుచ్చే తనని చూసి తేజస్వి నవ్వేవాడు.

'కొందరికి కొన్ని ఇష్టం ఉండవు. ఎవరితోనూ కలవకపోవడం అనేది నీ వ్యక్తిగత విషయం. కాని, నీకిష్టులైనవారి దగ్గర, నీ సన్నిహితుల దగ్గర ఎప్పుడూ నవ్వుముఖంతోనే ఉంటావు... ఆ నవ్వు చూసే కదా నేను మనసు పారేసుకున్నదీ...' అంటూ తనని అల్లుకుపోయేవాడు.

సాధారణంగా ప్రేమించుకున్న జంటలు ఒక్కటయ్యేందుకు పెద్దలు, కులమతాలు, ఆచారవ్యవహారాలు, కట్నకానుకలు... ఇలాంటివన్నీ అవాంతరాలుగా నిలుస్తాయి. కాని, తన విషయంలో అలాకాదు. తేజస్వి తనని ప్రేమించాడని చెప్పగానే మొదట కంగారుపడింది. ఆ తరువాత అతడి ప్రేమను అర్థంచేసుకుని ఆనందపడింది.

**ఒక గుప్పెడు ఇసుకలోని ఒక్కొక్క రేణువుని లెక్కపెట్టాలన్నా, బిర్రుగా వున్న తాటిమీద నదిని దాటాలన్నా మనకి ఎంతో ఏకాగ్రత, శ్రద్ధా అవసరమవుతాయి. మనం చేసే ప్రతి పనికీ అంత ఏకాగ్రతా, శ్రద్ధా వుండాలి.**

అతడితోపీకల్లోతు ప్రేమలోకూరుకుపోయింది.

ఎప్పుడూ క్లాసులో టాపర్‌గా నిలిచే తనకు పై చదువులు చదవాలన్న కోరిక బలంగా ఉండేది. కాని, తల్లిదండ్రులు దాన్ని ఖండించేవారు.

'ఎన్ని చదువులు చదివినా... ఆడపిల్లకి తలొంచి తాళి కట్టించుకోక తప్పదు. అనుకోకుండా బంగారం లాంటి సంబంధం కాళ్ళ దగ్గరకు వచ్చింది. చదువు చట్టుబండలు అంటూ చేతికి చిక్కిన భాగ్యాన్ని జార విడుచుకోకు' హితబోధ ప్రారంభించారు తల్లిదండ్రులు, తేజస్వి వచ్చి తమని కలిసి సుహాసినిని పెళ్ళి చేసుకుంటానని చెప్పినప్పుడు-

'అది కాదమ్మా... చదువు నాకల... దాన్ని సాకారం చేసుకోవడానికి ఎంతగానో శ్రమించాను. తేజస్వి నన్ను అర్థం చేసుకుంటాడు. మీరు మధ్యలో అడ్డు తగలకండి...' మృదువుగా చెప్పి అమ్మానాన్నల నోరు మూయించింది సుహాసిని.

అయితే వాళ్ళని సమాధానపరిచినంత సులువు కాలేదు తేజస్వి కన్నవారిని ఒప్పించడం.

'చూడమ్మాయ్... మా తేజా ఇష్టపడ్డాడని మీ వాళ్ళు పెద్దకట్నం ఇవ్వలేకపోయినా మీ పెళ్ళికి ఒప్పుకున్నాం... పెళ్ళయిన ఆడవాళ్ళు చదువులు, ఉద్యోగాలు అంటూ వీధులు పట్టిపోవడం మా ఇంటావంటా లేదు. కాబట్టి... నువ్వుకూడా ఆ ఊసు మానేసి, చక్కగా మొగుడికి వండిపెట్టుకుంటూ ఇంటిపట్టున ఉండు...' అన్నారు దర్పం ప్రదర్శిస్తూ.

సుహాసిని డీలా పడిపోయింది. చదువంటే ఆమెకు ప్రాణం. ఎంత చదివినా తీరని విద్యాదాహం ఆమెది. పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసి తగిన ఉద్యోగం సంపాదించుకోవాలన్నది ఆమె చిరకాల స్వప్నం. చూడబోతే ఆ కల కల్లగా మిగిలిపోయేట్లు ఉంది.

చదువుకోసమని తననెంతగానో ప్రేమించిన తేజస్వికి దూరం కాలేదు. అలాగని ప్రాణ సమానమైన చదువునూ వదులుకోలేదు.

ఏంచేయాలి! ఏం చేయాలి! అంటూ సుహాసిని విచికిత్సలో పడి కొట్టుకుంటున్నప్పుడు తేజస్వి ఆమెకు ధైర్యం చెప్పాడు.

పాతతరానికి ప్రతినిధులైన పెద్దల మాటలు పట్టుకుని నీరుకారిపోవద్దని, ఆమె లక్ష్యాన్ని చేరుకునేందుకు తనవంతు సహకారమందిస్తానని బాస చేశాడు.

అమ్మాయి మనసు అర్థంచేసుకునే అల్లుడు దొరికాడని సుహాసిని కన్నవారు సంబరపడితే... పెళ్ళి కాకుండానే పెళ్ళానికి లొంగిపోవడం ఏమిటని తేజస్వి తల్లిదండ్రులు గగ్గోలుపెట్టారు.

వాళ్ళకి సర్దిచెప్పటానికి తేజస్వి నానా అగచాట్లూ పడ్డాడు. అయినా వారు లొంగలేదు. కోడలి చదువుకి తమ అంగీకారం తెలియజేయనూ లేదు.

సుహాసినిని వదులుకోవడం ఇష్టంలేని తేజస్వి వాళ్ళకి దూరమయ్యేందుకు సిద్ధమైనాడు. "నాకోసం మీరు మీ అమ్మానాన్నలని విడిచిపెట్టడం నాకు ఇష్టంలేదు తేజా... కోడలొచ్చి కుటుంబాన్ని రెండుగా చీల్చేసిందన్న నింద నేను మోయలేను.

దయచేసి నువ్వు మీవాళ్ళు చెప్పినట్లుగా విని ఇంకో అమ్మాయిని పెళ్ళిచేసుకో" తన కోసమని తనవాళ్ళతో విభేదించిన తేజస్విని వారించింది సుహాసిని.

'పిచ్చి సుహా... నేను విడిచిపెడుతున్నది వాళ్ళని కాదు. వాళ్ళలోని మూర్ఖత్వాన్ని. ఆడవాళ్ళు అంతరిక్షాలకు ఎగిరిపోతున్న ఈ తరుణంలో... ఇంకా ఈ పాతచింతకాయ భావాలేమిటి చెప్పు!

ఇప్పుడు నీ విషయంలో అనేకాదు... వారి మనస్తత్వాలు ఎప్పుడూ ప్రగతికి అవరోధాలే. నేను ఎప్పుడూ ఆ తరహా భావాలకి వ్యతిరేకినే. కాకపోతే ఈసారి నువ్వు కారణం అయ్యావు అంతే!" ఆమెను ఊరుకోబెట్టాడు తేజస్వి.

'అది కాదు తేజా... ఇంత చిన్న కారణానికి కుటుంబం విడిపోవడమేమిటో చెప్పు! చూసినవాళ్ళ కెంత సిల్లీగా అనిపిస్తుంది!' ఇంకా ఏదో చెప్పబోయి సుహాసినిని వారించాడు తేజస్వి.

'ఎవరికో ఏదో అనిపిస్తుందని మన ఇష్టాలని త్యాగం చేయకూడదు సుహా... ఇవాళ ఈ విషయంలో నిన్ను వ్యతిరేకించిన మావాళ్ళు రేపొద్దున్న కోడలు చదువుకుని, మంచి పొజిషన్‌లో ఉంటే ఎంతో గొప్పగా ఫీలయ్యే అవకాశం లేకపోలేదు.

ఈ ఎడబాటు మళ్ళీ కలవడంకోసమే అని నమ్ముతున్నాను నేను. మరింకేం మాట్లాడక నీ చేయందుకునే అదృష్టాన్ని నాకివ్వు...' అంటూ ఆరాధనగా



## ఆ ధైర్యం ఉంది

పెళ్ళి తర్వాత సమంత కెరీర్ మరిన్ని హంగులు, రంగులు అద్దుకుంటున్నది. కోరినవాడితో పెళ్ళి ఇచ్చిన ఉత్సాహం, ఊపుతో అటు కెరీర్‌లో, ఇటు జీవితంలో 'యూ టర్న్' తీసుకుంటున్నది.

"పెళ్ళనేది ఆడవాళ్ళకు ధైర్యం ఇవ్వాలి కాని వారి కలలకు, కెరీర్‌కు నియంత్రణ కాకూడదు. నాలో పెళ్ళి ఇచ్చిన ధైర్యం ఎక్కువగా ఉంది. మా మామగారి నీడలో ఉంటున్నందుకు అదృష్టవంతురాలినని అనుకుంటున్నాను. చైతన్య పర్‌ఫెక్షనిస్ట్. ఎంతో బాగా చూసుకుంటాడు" అంటూ మునిముసినవ్వుల నడుమ, మెరిసే కళ్ళతో చెప్పింది.



## గ్లామర్‌కే ప్రాధాన్యం

ఆదిలోనే ముద్దులకు హద్దు చెరిపేసి, పదేపదే పెదవులు అందించి, జంకులేకుండా నటించేసిన షాలినీ పాండే గ్లామర్ పాత్రలకు సై అంటున్నది.

తెరపై వెలుగొందాలంటే అన్నిరకాల పాత్రలూ చేసి తీరాల్సిందేనన్నది ఆమె దృఢాభిప్రాయం.ఏవో కొన్ని పాత్రలకే పరిమితం అన్నధోరణి ఉంటే కెరీర్ గ్రాఫ్ సాఫీగా సాగదంటున్నది.

వైవిధ్యభరితమైన గ్లామరస్ పాత్రలు మంచి ఇమేజ్ తెచ్చిపెడతాయని, ప్రస్తుతం తన దృష్టంతా గ్లామర్ పాత్రలపైనేనని చెప్తోంది షాలినీ పాండే.

మరి మొదట్లోనే ముద్దులు జుర్రేసి ఇప్పుడు గిరి గీసుకుంటానంటే చెల్లదు కదా!




ఆమె కళ్ళలోకి చూశాడు తేజస్వి.

'నీలో ఈ పాజిటివ్ థింకింగ్ నాకు నచ్చుతుంది తేజా... నిజానికి అదృష్టం నీది కాదు... నాది.

నీలాంటి మంచి మనసున్నవాడితో ఆజన్మాంతం కలిసి ఉండా లని కోరుకుంటాను.. నువ్వు భావించి నట్లే మనమందరం ఒకటవ్వాలని ఆ భగవంతుడిని కోరుకుంటున్నాను' అంది సుహాసిని అతడి ఔన్న త్యానికి పొంగిపోతూ...

అలా తేజస్వి తల్లిదండ్రుల అంగీకారం లేకుండానే వాళ్ళ వివాహం జరిగిపోయింది. పెళ్ళికి ముందురాసిన ఆ సెట్ రిజల్ట్స్ వచ్చాయి. సుహాసినికి మంచి ర్యాంక్ వచ్చింది. ఆంధ్రా యూనివర్సిటీలో ఫ్రీ సీట్ వచ్చింది. సుహాసిని పీజీలో చేరినదగ్గరనుంచీ తేజస్వి అందించిన సపోర్ట్ అంతా ఇంతా కాదు.

మోరల్గా, ఫిజికల్గా కూడా ఆమెకు ఎంత గానో చేదోడువాదోడుగా ఉండేవాడు. ఎప్పుడూ చదువు తప్ప వేరే లోకంలేని ఆమె, ఇంటి పనులు చేయడానికి అవస్థపడుతూ పరుగులు తీస్తూ ఉంటే ఆమె వెనకే ఉండి అన్నిపనులలోనూ సాయం చేసేవాడు తేజస్వి.

సుహాసిని పిజి సెకండ్ ఇయర్లో ఉండగా ఆమె కన్సీవ్ అయ్యింది. పరీక్షలు చూస్తే దగ్గరపడ్డాయి. డెలివరీ డ్యూడేట్కి ముందే పరీక్షలుండడంతో కష్ట పడి చదవాల్సిన అవసరం ఏర్పడిందామెకి. ఏమాత్రం అశ్రద్ధ చేసినా ఇన్నాళ్ళూ పడ్డ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరులా మిగిలిపోతుంది.

అప్పుడు కూడా తేజస్వి ఆమెకి ఎంతో సేవచేశాడు. నెలలు నిండేవరకు కూడా వాంతులు, వికారంతో బాధపడుతున్న సుహాసినికి కన్నతల్లిలా సకలోప చారాలూ చేశాడు. వేవిళ్ళతో కడుపులో ఏమీ ఇమిడేది కాదు.అందుచేత ఆమె నీరసించిపోకూడదని ఆరారా ఆమెచేత కొబ్బరినీళ్ళు, బార్లీ జావ తాగిస్తూ ఆమెను కళ్ళలో పెట్టుకుని కాపాడుకున్నాడు.

అతడి చలవ వలన ఆమె పిజి డిస్టింక్షన్లోపాసైంది. అభిజ్ఞ పుట్టాక కూడా అతడు సుహాసినిని ఎంతో శ్రద్ధగా చూసుకున్నాడు. అభిజ్ఞకి నాలుగేళ్ళు వచ్చే సరికి సుహాసిని ఎంఫిల్, పిహెచ్డి కూడా పూర్తి చేసింది. ఆమె అదృష్టంకొద్దీ ఆమెకు మంచి గైడ్ దొరకడం వలన ఆమె తన థీసిస్ని విజయవంతంగా సబ్మిట్ చేయగలిగింది.

ఆ వెంటనే గవర్నమెంట్ జూనియర్ కాలేజ్లో ఫిజిక్స్ లెక్చరర్గా ఉద్యోగం వచ్చింది. తన కెరీర్ ఇంత సాఫీగా ఏ ఒడిదుడుకులకీ లోనవ్వకుండా సాగిపోవడానికి కారణమైన తేజస్వి అంటే సుహాసినికి పంచప్రాణాలూనూ.

ఈ లోకంలో ప్రేమించి పెళ్ళాడిన ఏ భర్తాకూడా తన భార్యకి అందివ్వలేనంత ప్రేమానురాగాలను ఆమెమీద కురిపించాడు తేజస్వి.

"నా బంగారం చదువుల సరస్వతి" అంటూ పొంగిపోయేవాడు సుహాసినిని చూసుకుని.

ఆమెనే కాదు, అత్తమామలనూ కన్నకొడుకులా ఆదరించాడు. వారి మంచిచెడ్డలను దగ్గరుండి చూసుకునేవాడు. అయితే అతడి కన్నవారికి మాత్రం ఎంత ప్రయత్నించినా చేరువకాలేకపోయాడు. ఎన్నో సార్లు సుహాసినిని తీసుకుని ఆ గడపలోకి వెళ్ళి అవ మానాలపాలై తిరిగివచ్చాడు.

తమ మాట వినకుండా నచ్చిన అమ్మాయితోనే జీవితం అనుకుని తమకుదూరమైన అతడు ఎప్పటికీ తమకి కన్నకొడుకు కాబోడని తెగేసి చెప్పారు వాళ్ళు.ఏమీ చేయలేని నిస్సహాయతతో సుహాసిని తల్లిదండ్రులలో తనవారిని చూసుకుంటూ, వాళ్ళని దైవాలుగా పూజిస్తూ జీవితం గడుపుతున్నాడు.

సుహాసిని సాహచర్యం... ముద్దుమాటలతో తనని అలరించే అభిజ్ఞ పసితనం... ఇవన్నీ తేజస్విని మరో లోకంలో తేలియాడేలా చేశాయి.

తన బాధలను మరిపించే దివ్యౌషధంగా పనిచేసే కూతురి చిరునవ్వు అతడిని సేదతీర్చేది.

కాని, విధికి వీరంటే కన్ను కుట్టింది. ఆ రోజు ఉదయాన్నే ఆఫీసుకి వెళ్ళిన తేజస్వి సాయంత్రానికి జీవంలేని కట్టెగా తిరిగొచ్చాడు. చలనంలేని అతడి శరీరాన్ని చూసి తట్టుకోలేకపోయింది సుహాసిని.

**ఇంకా ఉంది**

## లక్స్ పాప

ఎన్నేళ్ళయినా 'లక్స్ పాప' ఫ్లోరా సైనిని ప్రేక్ష కులు మరువనేలేదట. ఈ విషయాన్ని ఆమే స్వయంగాచెప్పుకున్నది. 'నరసింహనాయుడు'లో బాలకృష్ణతో కలిసి ఈ పాట పాడింది.

"ఆ పాట ఇంతటి ఇమేజ్ సృష్టించడం అబ్బు రంగా వుంది. ప్రేక్షకులు నన్ను ఇప్పటికీ గుర్తు పెట్టుకున్నారు. ఇటీవల 'స్త్రీ'లో నా పాత్రకు ప్రశంసలు వెల్లువలు వస్తున్నాయి.

అందుకు ఎంతో కృతజ్ఞురాలిని. ఈ నా ప్రయాణం ఎంతో బావుంది. తెలుగు సినిమా నా ఫస్ట్ లవ్. మరిన్ని తెలుగు చిత్రాలు చేయా లన్నది నా కోరిక" అంటూ వివరించింది.



గుణవంతాః క్లిశ్యంతే ప్రాయేణ పరవేదనామ్।
బంధనమాయంతిశుకాః యథేష్టా సంచారిణాః కాకాః॥

మంచివారికే కష్టాలు అధికం. దుర్మార్గులు ఎప్పుడూ సుఖంగా వుంటారు. ఎలాగంటే చిలుకను పంజరంలో బంధిస్తారు. కాకులు స్వేచ్ఛగా తిరుగుతుంటాయి.




ఒక నాస్తికుడు వివేకానందుని ఇలా ప్రశ్నించాడు.
"దేవుని పూజిస్తారు కదా? ఆయన మీకేం ఇచ్చాడు?" అని వివేకానందులు ఇలా బదులిచ్చారు.
"దేవుని పూజించటంవల్ల నాకు ఏమీ లభించలేదు. అంతేకాక ఎన్నో పోగొట్టుకున్నాను. నా అహంకారం, అజ్ఞానం, అశాంతి, కోపం, ద్వేషం, ఈర్ష్య, ఆత్మన్యూనతా భావం, అసహనం, అభద్రత, లోభం, భయం అనేవి పోయాయి. నీవు దేవుడిని పూజించకు. వీటిని వేటినీ పోగొట్టుకోకు"
భగవంతుడు, మనలోని బలహీనతలను దూరం చేసి, ఆత్మశక్తితో అన్నింటినీ సాధించుకునేట్లు చేస్తాడు.
అంతేకాని, అన్నీ ఉచితంగా అమర్చిపెట్టడు.

"దేవా! నేను మార్చలేని విషయాలను శాంతంగా అంగీకరించే హుందాతనం ఇవ్వు.
మార్చగలిగేవాటిని, మార్చేందుకు ధైర్యాన్నివ్వు.
ఈ రెండింటి మధ్య తేడా తెలుసుకోగలిగే విచక్షణాజ్ఞానాన్ని ఇవ్వు" అని ప్రతి వ్యక్తీ భగవంతుని ప్రార్థిస్తే జీవితాలు ప్రశాంతంగా సాగిపోతాయి. లోకమంతా శాంతిమయం అవుతుంది.

ఓ మనిషీ! గుర్తుంచుకో. నీవు పడే ఒత్తిడిలో ఎక్కువ భాగం పరిస్థితులకు నీవు స్పందించే తీరు మీద ఆధారపడింది.
అంతేకాని జీవితం తీరుమీద కాదు. నీ ప్రవర్తనలో మార్పు తెచ్చుకుంటే, దాదాపు ఎక్కువశాతం ఒత్తిడి తొలగిపోతుంది.

భార్యాభర్తల మధ్య ఎప్పటిలాగానే గొడవ జరిగింది. భర్త పద్ధతిగా కొన్ని రోజులు నోరు మూసుకుని వుండిపోయాడు.
అతని మౌనాన్ని భరించలేక, మాట్లాడమని నసపెట్టటం మొదలుపెట్టింది భార్య.
అయినా అతనిలో స్పందనలేదు.
ఆమెకు కోపం నషాళానికెక్కింది. చివరి అరుపు అరిచింది.
"ఇప్పుడు 10 లెక్కపెడతా. మాట్లాడితే సరే. లేకుంటే పుట్టింటికి పోతా. మళ్ళీ ఎప్పటికీ రాను" అంది.
లెక్కపెట్టటం మొదలు "ఒకటి, రెండు...
భర్త మౌనం వీడలేదు.
మూడు, నాలుగు,ఐదు. పరిస్థితిలో మార్పు లేదు. ఆరు, ఏడు, ఎనిమిది"
నిశ్శబ్దంగా వింటున్న భర్తను చూస్తూ "ఊ, ఊ, ఊ" అంటూ దీర్ఘాలు తీయసాగింది.
చూసి, చూసి ఓర్పు పట్టలేక ఆత్రుతతో భర్త. "ఆపేశావేం, లెక్కపెట్టు" అన్నాడు.
"హమ్మయ్య, మాట్లాడేశారు కదా. ఇంక పుట్టింటికి వెళ్ళాల్సిన అవసరంలేదు" అంటూ లేచి వెళ్ళింది భార్య. ◆

★ చదువుతో సంస్కారం : అన్ని శాస్త్రాలలో పండితుడైన సాంబయ్య, రాజుగారికోటలోని దేవాలయంలో పూజారిగా వున్నారు. రాజుగారికి ఏ కష్టం వచ్చినా ఈయన సలహా తీసుకునేవారు.
సాంబయ్యకు ఓ కొడుకు పుట్టాడు.
అతని జాతకం చూస్తే 'గజదొంగ' అవుతాడని తెలిసింది. ఈ విషయం పూజారి ఎవ్వరితోనూ పంచుకోలేదు.
పిల్లవాని చిన్నతనంనుండే "మంచి గుణాలు ఎలా పెంచుకోవాలి. చెడ్డగుణాలకు ఎలా దూరంగా వుండాలి. తప్పులు చేస్తే అనుభవించవలసిన ఘోరమైన శిక్షలు ఏమిటి" మొదలైన విషయాలు పిల్లవాడి మనసులో నాటుకునేట్లు పెంచాడు.
ఎప్పుడూ ఒంటరిగా పిల్లవాడిని ఎక్కడికీ పంపేవాడు కాదు. కాలం గడిచింది. సాంబయ్య వృద్ధుడయ్యాడు. పిల్లవాడు యుక్తవయస్సుకొచ్చాడు. అన్ని శాస్త్రాలూ నేర్చుకున్నాడు. రాజుగారు, పిల్లవాడిని పూజారిగా గుడికి పంపమని ఆదేశమిచ్చారు.
సంశయిస్తూనే భగవంతునిపై భారంవేసి పిల్లవాడిని కోటలోకి పూజ చేయటానికి పంపాడు. పిల్లవాడు మణులు, రత్నాలచే అలంకరించబడిన దేవతామూర్తులను చూశాడు. వెంటనే అతని మనసులో "వాటిని దొంగిలిద్దాం" అనిపించింది.
వాటిని తాకేలోపు తండ్రి చెప్పిన శాస్త్రాలు గుర్తుకొచ్చాయి. దొంగతనం ఎంత తప్పో గుర్తుకొచ్చింది ఆ పిల్లవాడికి.
శిక్షలు ఏం పడతాయో జ్ఞాపకం వచ్చి భయంవేసింది. దాంతో మనసుకు నిలకడ కలిగింది. చక్కగా పూజచేసి, కోట బయటకు బయలుదేరాడు.
కోట కావలి ద్వారంవద్ద భటులు అతని చేతిలోని మూటను చూసి ఏమిటని ప్రశ్నించారు.
చిన్నపూజారి "తవుడు బస్తా" అన్నాడు.
భటులకు ఏం చేయాలో తెలీలేదు.
రాజుగారికి విషయం చెప్పారు.
రాజుగారు పెద్దపూజారికి కబురుపెట్టారు-
పెద్దపూజారి కొడుకును అడిగారు.
"ఎందుకు తవుడు దొంగతనం చేశావు?" అని.
కొడుకు చెప్పాడు "ఇంట్లో ఆవులకి తవుడు అయిపోయింది. పూజచేసి వస్తుంటే తవుడు బస్తా కనిపించింది, పట్టుకొచ్చాను" అని.
పూజారిగారు విషయం అర్థమై రాజుగారికి క్షమాపణ చెప్పి, పక్కకు తీసుకువెళ్ళి పిల్లాడి జాతక దోషాన్ని గురించి వివరించాడు.
"ఈవేళ జరిగిన సంఘటనతో ఆ దోషం తొలగిపోయింది మహారాజా!" అని చెప్పుకున్నాడు.
"ఇంకెప్పుడూ నా కొడుకు ఇలా చేయడు" అని నిశ్చయంగా చెప్పాడు. రాజుగారు, చిన్నపూజారిని క్షమించారు. చిన్నపూజారి ఆ తరువాత ఎప్పుడూ ఇలాచేయలేదు. తండ్రిలానే గొప్ప పండితుడిగా, భక్తుడిగా పేరు తెచ్చుకున్నాడు.
నీతి : చేసే పనిలో తప్పు ఒప్పుల గురించిన అవగాహన లేకపోతే, మనిషి తప్పుడు పనులు చేస్తూనే వుంటాడు. సరైన అవగాహన కలిగించే విద్యను, దానిద్వారా వచ్చే జ్ఞానాన్ని అందిస్తే, చెడ్డపనులకు దూరంగా వుంటారు. మంచి జీవితాన్ని చాలా చక్కగా గడుపుతారు.

# మీరు అందంగా వుంటారు

తీరైన అందం, చక్కని శిరోజాలు ప్రతి మహిళా వయస్సుతో నిమిత్తం లేకుండా కోరుకునే అంశాలు. ఇందుకు సంబంధించి ఎవరేం చెప్పినా వెంటనే నమ్మేస్తారు. అలాగే ఏ చిట్కాలు చెప్పినా చటుక్కున పాటించేస్తారు.

అయితే అసలు వాటిలో వాస్తవాలెంత? ఏ విధంగా సరైన చర్యలు చేపట్టాలి? అన్న అంశాల్లో సరైన అవగాహన అవసరం. అందుకోసం సమగ్ర విశ్లేషణ కావాలి.

## పొడిబారకుండా ఎలా కాపాడుకోవాలి?

పొడిచర్మానికి,తేమతగ్గిన చర్మానికి నడుమ వ్యత్యాసం వుంటుంది. పొడిచర్మం నూనె లేక పోవడంవల్ల ఏర్పడితే, డీహైడ్రేషన్ చర్మం నీటిలోపంవల్ల ఏర్పడే సమస్య. ఎక్కువ వేడి నీటిస్నానాలు చేయడంవల్ల శరీరంనుంచి సహజ నూనెల్ని కోల్పోవాల్సివస్తుంది.

స్నానం చేయగానే కొద్దినిమిషాల్లో మాయిశ్చరైజర్ అప్లయ్ చేయడంవల్ల సత్ఫలితాలుంటాయి. జిడ్డు చర్మంగల వారైతే, అనేక ఆయిల్‌ఫ్రీ మాయిశ్చరైజర్లు లభిస్తాయి.వాటినుంచి బాగా సూటయ్యే దాన్ని ఎంపికచేసుకోవాలి. ఎక్కువ పొడిచర్మం గలవారు ఆయిల్-ఆధారిత నైట్‌క్రీమ్స్ వాడుకోవాలి.





## మొటిమల్ని నివారిస్తాయా?

కొన్ని పండ్లు, కూరగాయలు తింటుంటే మొటిమలు రావా? అవుననే చెప్పాలి. ఆకుపచ్చ కూరగాయలు, పండ్లు, చేపలు, గ్రీన్‌టీ మొటిమలనుంచి కాపాడతాయి.

ఎక్కువగా నీరు తాగడం కూడా అవసరం. ఇవి శారీరక వ్యవస్థలోని వ్యర్థాలను వెలికినెట్టేస్తాయి.

ఆహారంలో ప్రోబయాటిక్ పదార్థాలు తీసుకుంటుంటే మరింత ఉపయోగకరంగా వుంటుంది.

వేపుడుపదార్థాలు మొటిమల్ని పెంచుతాయనడంలో అర్థం లేదు. ఇతర కారణాల దృష్ట్యా వేపుడు పదార్థా లను దూరంగా వుంచాలి.

ఎక్కువగా డెయిరి ఉత్పత్తులు తింటున్నా మొటిమలు వస్తాయి.



## హానిచేస్తుందని ఎలా గుర్తించాలి?

ఫలానా ఉత్పత్తి శిరోజాలకుకాని చర్మానికి కాని హానిచేస్తుం దని ఎలా గుర్తించాలన్నది ఓ ప్రశ్న. పడని ఉత్పత్తిని దేన్నైనా వాడితే చర్మం వెంటనే ఎలర్జిక్ స్పందన చూపుతుంది. దురద, ఎర్రబారడం, ర్యాష్ వంటివి ఇటువంటి స్పందనకు సాధారణ లక్షణాలు.

కొన్నిరకాల కాస్మోటిక్ ఉత్పత్తుల్ని వాడుతున్నప్పుడు మంటగానో, గుచ్చుకున్నట్లో వుంటే మానేయాలి. ఇది సహజ స్పందన కాదు.

ఆ ఉత్పత్తికి ఎలర్జీ వుందని అర్థం. శిరోజాలకు సూటయిందా? లేదా? అని తెలుసుకోవాలంటే జుట్టు స్పృజించి చూస్తే అర్థం అవుతుంది. వేళ్ళను శిరోజాలగుండా పోనివ్వడం కష్టంగా వున్నా, జుట్టు నిస్సారంగా, మెరుపులేకుండా, రఫ్‌గా వున్నా సదరుఉత్పత్తులు సరిపడలేదని అర్థం.

## రంగువేసిన శిరోజాల రక్షణ ఎలా?

కలర్‌చేసిన శిరోజాలకు ప్రతిసారీ కండిషనింగ్ అవసరం. దీనివల్ల మాయిశ్చరైజర్ పట్టి వుంటుంది. కలర్డ్ శిరోజాలకు ప్రత్యేక జాగ్రత్త అవసరం.

కలర్డ్ శిరోజాలకు ఉద్దేశించిన ప్రత్యేక షాంపూ, కండిషనర్లను మాత్రమే ఉపయోగించాలి. దీని వలన రంగుపోకుండా ఎక్కువ రోజులు వుంటుంది. అదే సమయంలో జుట్టు ఆరోగ్యంగా వుండేందుకు అవసరమైన పోషకాలను కూడా అందిస్తుం



## ప్రతిరోజూ షాంపూ చేయవచ్చా?



చాలా రకాల షాంపూలు తమవి సహజసిద్ధమైనవని ప్రచారం చేసుకుంటుంటాయి. కాబట్టి ప్రతిరోజూ వాడవచ్చునని అంటుంటారు.

కాని, అది సరైన ఆలోచన కాదు. వాటిలో అసలంటూ రసాయనాలు లేకుండావుండవు. ప్రతిరోజూ వాష్ చేసుకోగల కండిషనర్లు కొన్ని వుంటాయి. ఎక్కువ ఆయిలీ హెయిర్‌గలవారు, విపరీతంగా వ్యాయామాలు చేసేవారు లేదా స్వేదం ఎక్కువగాగల వాళ్ళు తప్పదు కాబట్టి రోజూ జుట్టు వాష్ చేసుకోవాల్సిందే.

సాధారణ జుట్టుగలవారు ప్రతి రోజూ తలస్నానం చేస్తుంటే సహజ నూనెలు కోల్పోయి, జుట్టు పొడిబారిపోతుంది. చిట్లిపోతుంటుంది. కావాలనుకుంటే రోజుమార్చి రోజు తలస్నానం చెయ్యవచ్చు కాని, జుట్టు శుభ్రంగా, ఆరోగ్యంగావుండాలంటే వారానికి రెండుసార్లు చేస్తే సరిపోతుంది.

## సన్‌ట్యాన్ :

సూర్యరశ్మికి కమిలిపోయిన చర్మాన్ని సరిచేసుకోవడానికి అనేక రకాల ఉత్పత్తులు అందుబాటులో వున్నాయి. సహజంగా తొలగించుకోగలగడం ఉత్తమం. మన వంటగదిలోనే ఇందుకు అనేక రకాల పదార్థాలు అందుబాటులో వుంటాయి.

టొమేటో, పెరుగు, శనగపిండి, పసుపు వాటిలో కొన్ని. పచ్చిపాలు, నిమ్మరసం, చిటికెడు పసుపు కలుపుకుని పట్టిస్తే, సన్‌ట్యాన్ ఇట్టే తొలగిపోతుంది. సన్‌ట్యాన్ పోగొట్టుకోవడానికి కొబ్బరినీళ్ళు మరో సులువైన ప్రత్యామ్నాయం.



డాలి. కలర్డ్ హెయిర్ వాష్‌కోసం తేలికపాటి షాంపూ, కూల్‌వాటర్‌లను ఉపయోగించాలి.

హెయిర్ డ్రయ్యర్లు వాడితే వేడి మోతాదును బాగా తగ్గించాలి. కర్లర్స్, స్ట్రెయిటనర్లు, ఇతరాల హీట్‌ను కూడా బాగా తగ్గించాలి. ఇటువంటి శిరోజాల పరిరక్షణలో ఎల్లవేళలా రెండు విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి.

కలర్ ప్రొటెక్షన్ మరియు శిరోజాల ఆరోగ్యాన్ని మెయిన్‌టెయిన్ చేయడం... ఈ రెండింటికోసం ఎప్పుడూ కూడా మైల్డ్ షాంపూలను మాత్రమే వాడాలి. కలర్ ప్రొటెక్షన్ కోసం సల్ఫర్ లేని షాంపూలు సిఫార్సు చేయతగినవి.

## మేకప్ బ్రెష్‌లు :

మేకప్ బ్రెష్‌లను ప్రతివారం శుభ్రపరుచుకోవాలన్నది డెర్మటాలజిస్టుల సిఫార్సు.

ముఖ్యంగా ఫౌండేషన్, కన్సీలర్ బ్రెష్‌లను తప్పనిసరిగా శుభ్రపరుచుకోవాలి.

బ్రెష్‌లు మురికిగా వున్నట్లయితే పొడయి, పొడిబారి చర్మానికి హాని కలిగిస్తుంటాయి. బ్యాక్టీరియాకు నెలవుగా మారిపోతాయి. బ్రెష్‌లు సున్నితమైనవి కాబట్టి, వాటిని సున్నితంగానే ట్రీట్ చేయాలి. బ్రెష్‌క్లెన్సింగ్ లిక్విడ్ లేదా మైల్డ్, జెంటిల్ సోప్ వాడుతూ క్లీన్ చేసుకోవాలి.

బ్యూటీ బ్లెండర్ల విషయంలోనూ ప్రత్యేక శ్రద్ధ వహిస్తుండాలి. మూడు, నాలుగు నెలల వాడకం తర్వాత మార్చేస్తుండాలి.





Courtesy : NEW WOMAN




## సన్ బర్న్స్:

బయటకు వెళ్తున్నప్పుడు సూర్య కిరణాల తాకిడినుంచి కాపాడుకోవడానికి సన్‌స్క్రీన్ రాసినా ఫలితం లేకపోతే ఏం చేయాలి?

బయటకు వెళ్ళడానికి 15-30 నిమిషాల ముందుగా సన్‌స్క్రీన్ అప్లయ్ చేయాలి. సరైన దుస్తులతో కవర్ చేసుకోగలగాలి.

టోపీ, సన్‌గ్లాసెస్ ఉపయోగించాలి. కొబ్బరినూనె రాయడం మరో ఆప్షన్. విటమిన్ 'డి' చాలినంత ఉన్నప్పుడు సూర్యకిరణాల ప్రభావం తగ్గుతుంది. ఉదయం 11 గంటల నుంచి సాయంత్రం నాలుగు గంటలవరకు ఎండలో తిరగవద్దు.

ఈ సమయంలో సూర్యకిరణాలు తీవ్రంగా వుంటాయి.

## మేకప్ మెలుకువలు :

చక్కగా చేసుకున్న మేకప్ఎక్కువ గంటలు చెదిరిపోకుండా వుండాలంటే తగిన జాగ్రత్తలు తప్పనిసరి.

ముందస్తుగా సరైన స్కిన్‌కేర్ కావాలి. మేకప్ ఆరంభించడానికి ముందుగా క్లెన్సర్ వాడాలి. ప్రైమర్ వాడడం అస్సలు మర్చిపోకూడదు. వీటివల్ల మేకప్ ఎక్కువసేపు చెదిరిపోకుండా వుంటుంది.

సరైన ఫౌండేషన్ ఎంచుకోవాలి. దీన్ని వీలయినంతవరకు వేళ్ళతో కాకుండా బ్రష్‌తో అప్లయ్ చేసుకోవాలి. ఇవన్నీ కనీసమాత్రంగా పాటించాల్సిన సౌందర్య సూత్రాలు. ప్రాథమికంగా తీసుకోవాల్సిన జాగ్రత్తలు. రాజీపడకుండా కొనసాగిస్తుంటే చర్మ, సమస్యలు శిరోజాల సమస్యలు తలెత్తవు.






## మొటిమలు చిదమవచ్చా?

మచ్చల భయం, ఇన్‌ఫెక్షన్ ఇబ్బందిలేకుండా వాటిని పిండే మార్గం వుంది. అయితే ఎలా పడితే అలా నొక్కేయకూడదు. స్వంతంగా కంటే సౌందర్య నిపుణులతో చేయించుకుంటే ఇంకా మంచిది.

స్టెరిలైజ్డ్ నీడిల్‌తోనే నొక్కాలి. పని పూర్తయిన తర్వాత మృదువైన క్లెన్సర్ అప్లయ్‌చేయాలి.

ఎటువంటి మచ్చలు, ఇన్‌ఫెక్షన్, ఇన్‌ఫ్లమేషన్ సమస్యలు రాకుండా వుండాలంటే డెర్మటాలజిస్టులు లేదా కాస్మొటాలజిస్టులను సంప్రదించడం శ్రేయస్కరం.

కె.మనస్విని





# స్త్రీ శక్తి

స్త్రీలు ఇల్లు అలుకుతూ ఈగ తన పేరు మరిచిపోయినట్లుగా ఇంటి పనులలో మునిగిపోయి, ఆరోగ్యకరమైన ఆహారాన్ని తినటాన్ని మర్చిపోతారు.

ఊపిరి సలపని ఇంటి పనులు, బయటకు వెళ్ళి సరుకులు, కూరలు తెచ్చుకోవటం, పిల్లల స్కూలు మీటింగ్‌లకు వెళ్ళటంలాంటి పనులతో రోజంతా సతమతమవుతూ సరైన ఆహారాన్ని తీసుకోరు.

దీనితో శరీరంలో శక్తి సన్నగిల్లుతుంది. అటువంటి పరిస్థితులలో తినటానికి వెంటనే అందుబాటులో వుండేవి, ఆరోగ్యాన్ని, శక్తిని ఇచ్చేవి,అలసటను దూరం చేసేవి అయిన పదిరకాల మంచి ఆహార పదార్థాల గురించి తెలుసుకుందాం.



## నట్స్ :

వీటిలో పోషకాలు పుష్కలంగా లభిస్తాయి. ఎప్పుడు ఆలసటగా అనిపించినా వీటిని తింటే తిరిగి శక్తిని పుంజుకుంటారు.

బాదంపప్పు, వాల్‌నట్స్ తీసుకుని వాటిని సలాడ్ల మీద, స్వీట్లమీద చల్లుకుని తింటూవుండండి.

## డార్క్ చాక్లెట్ :

డార్క్ చాక్లెట్‌లో థియోబ్రొమైన్ తర్వాత ట్రిప్టోఫాన్ అనే మిశ్రమాలు వుంటాయి. ఇవి శరీరంలోని శక్తిని పెంచుతాయి. మంచి మూడ్‌లోకి తీసుకువస్తాయి. కానీ గుర్తుంచుకోండి ఎక్కువ తినకూడదు. శరీరంలో క్యాలరీలు పెరుగుతాయి.

## చిరుధాన్యాలు :

సజ్జలు, జొన్నలులాంటి చిరుధాన్యాలలో ఇనుము బాగా లభిస్తుంది. ఆ ఇనుమువల్ల రక్తం ఆక్సిజన్‌ను



శరీరమంతా సరఫరా చేయగలుగుతుంది. వీటిలో వున్న విటమిన్ బి వల్ల ఒత్తిడి తగ్గుతుంది. క్యాల్షియమ్ వల్ల కండరాల అలసట దూరమవుతుంది.



## అరటిపండ్లు :

శక్తి తగ్గిపోతోంది అనిపిస్తే పంచదార ద్రావకాలు, వేపుడు పదార్థాలు తినేకంటే ఒక అరటిపండు తినటం ఎంతో మేలు. అరటిపండులో వున్న పిండి పదార్థాలు తక్షణ శక్తినిస్తాయి.

వీటిలోని పొటాషియమ్, కండరాలు, నరాల పని తీరును మెరుగుపరుస్తుంది. శరీరంలోకి బ్యాటరీ రీఛార్జ్‌కి అరటిపండ్లు సరైన సాధనం.



## గుమ్మడి గింజలు :

పిడికిలినిండా గుమ్మడిగింజలు తీసుకుని తింటే శరీరానికి కావల్సిన మాంసకృత్తులు, జింక్, మెగ్నీషియమ్ మరియు కొవ్వులు లభిస్తాయి. వీటివల్ల శరీరంలో శక్తి తిరిగి పుంజుకుంటుంది.



Courtesy : B+ve

## ఖర్జూరాలు :

ఖర్జూరంలో వుండే స్వతస్సిద్ధమయిన పంచదార శక్తినిచ్చే 'బి' విటమిన్లు, ఐరన్, అలసటను దూరం చేయటానికి బాగా ఉపయోగిస్తాయి.

## చిలగడదుంపలు :

కేకులు, బ్రెడ్‌లు, కుకీస్ తినటం వదిలేసి వాటి బదులు చిలగడదుంపలు తినటం మొదలుపెట్టండి. ఇవి రక్తంలో గ్లూకోజు నిదానంగా విడుదలయ్యేటట్లు చూస్తాయి. ఉడికించినవో లేదా పచ్చిముక్కలో లేదా పులుసులో వేసుకునో ఏదో రూపంలో చిలగడదుంపలను ఆహారంలో తీసుకోవాలి.



## ఛీజ్ :

దీనిలో వుండే పిండిపదార్థాలు, మాంసకృత్తులు శరీరానికి కావల్సిన శక్తినిస్తాయి.

అదే సమయంలో కడుపు నిండినట్టుగా చేస్తాయి.

## జిన్‌సెంగ్ :

జిన్‌సెంగ్ వేరు నుంచి తయారయిన పదార్థాలు, సప్లిమెంట్‌లు, టీలు వాడటంవల్ల రోగ నిరోధక శక్తి పెరుగుతుంది.

చురుకుదనం, జీవక్రియలు పెరుగుతాయి. రక్తములో గ్లూకోజ నియంత్రణలో వుంటుంది.

## మొలకెత్తిన విత్తనాలు :

మొలకెత్తిన వాటివలన అరుగుదల తేలిక అవుతుంది. వాటిలోని పోషకాలు మనకు బాగా అందుతాయి. దీంతో ఆరోగ్యంగా ఉంటారు.

ప్రతిరోజూ సాయంత్రంపూట ఒక కప్పు రకరకాల మొలకెత్తిన విత్తనాలను తినాలి.

వీటిద్వారా విటమిన్ సి, క్యాల్షియమ్, జింక్ మరియు ప్రొటీన్లు బాగా లభిస్తాయి.



డీ-హైడ్రేషన్‌వలన శరీరానికి అవసరమయిన ఎలక్ట్రోలైట్స్ అన్నీ కూడా ఆవిరయిపోతాయి. అందుచేత తరుచుగా అవసరమయినంత నీటిని తాగటం కూడా చాలా ముఖ్యం.

# దృష్టి

**₹ 9,999**
**బహుమతి కథ**

ఆకాశహర్మ్యంకేసి దృష్టి సారించాడు గాంధీ. ఇప్పుడు పద్మవ్యూహంలాంటి ఇంటర్వ్యూ హాల్లోకి ప్రవేశించబోతున్నాడు.

తనకు ఈ ఉద్యోగం వచ్చే అవకాశంరాదని తెలిసినా తండ్రి నచ్చచెప్పటంతో బలవంతంగా ఈ ఇంటర్వ్యూకి వచ్చాడు తను.

అంతలోనే అతని మొబైల్ ఫోన్ మోగింది "హలో"

"గాంధీగారూ...ఏం ఆలోచించారు?రెడీ చేశారా?"

"ఇంకాలేదండీ!కొంచెం మా పరిస్థితి ఇబ్బందిగా ఉంది. ఇంటర్వ్యూ అయ్యాక సెలక్టయితే ఎలాగో సర్దుబాటు చేస్తాను" తనవల్ల సాధ్యం కాదని తెలిసినా నమ్మబలికాడు గాంధీ.

"కంపెనీవాళ్ళకు నేను మీపేరు చెప్పేశాను. వాళ్ళు రాసుకున్నారు కూడా. మీరు సెలక్టవడం ఖాయం. తర్వాత మాత్రం టైమ్ ఉండదు.

మరి చూసుకోండి. వారంరోజులు మాత్రమే ఇవ్వగలను. వారంరోజుల్లో రెండు లక్షలు ఎలా సర్దుబాటు చేస్తారో ఆలోచించుకోండి" ఫోన్ డిస్కనెక్ట్ అయ్యాక ఒక్కక్షణం వెనక్కి వెళ్ళిపోదామా అని ఆలోచన వచ్చింది గాంధీకి.

అయినా ఏదో ఆశ అతన్ని ముందుకే నడిపించింది. కంపెనీ ఆఫీసు పదిహేడో అంతస్తులో ఉండటంతో లిఫ్ట్ వైపు నడిచాడు గాంధీ.

నాలుగు నిమిషాల నిరీక్షణ తర్వాత కిందకు వచ్చిన లిఫ్ట్ తలుపులు తెరుచుకోగానే లోపలికి అడుగుపెట్టాడు.అంతస్తుల సంఖ్యలు ఒక్కొక్కటీ మారడంచూస్తూ ఉన్న అతని దృష్టి అకస్మాత్తుగా ఓ పక్కకు మరలింది.

లిఫ్ట్ గోడకు పక్కగా ఓ బ్యాగ్! లిఫ్ట్‌లో ఎవరూ లేరు. ఖాళీగా ఉంది. లిఫ్ట్‌బాయ్ కూడా లేడు. ఎవరైనా మర్చిపోయారేమో అనుకుంటూ దాన్ని అందుకున్నాడు. దానిపైన ఎవరి పేరూ రాసి లేదు. ఏమున్నాయో ఇందులో అనుకుంటూ సహజంగా కలిగిన కుతూహలంతో జిప్ తెరిచిచూశాడు.ఐదు వందల రూపాయల నోట్ల కట్టలు నాలుగు కనిపించాయందులో!

'ఓ మైగాడ్!' ఒక్కసారిగా గాంధీ గుండెవేగం పెరిగింది. పైన ఫ్యాన్ తిరుగుతున్నా చెమటలు పట్టేశాయి.రెండు లక్షల రూపాయలు! ఇప్పుడు వెళ్ళబోయే ఇంటర్వ్యూ నామమాత్రమే.

కానీ ఒకటిన్నర లక్షలు ఇచ్చేస్తే ఉద్యోగం తనదే అవుతుంది! ఇచ్చినా ఇంకా ఏభైవేలు తనకే మిగులుతాయి! ఎంత అదృష్టం తనది!! అంతలో ఫోన్ మోగింది. నాన్న దగ్గర్నుంచి "చెప్పండి నాన్నగారూ!"

"బాబూ గాంధీ... ఇంటర్వ్యూ బాగా చెయ్యి నాన్నా! తప్పకుండా సెలక్టవుతావు. ఉద్యోగం రావడం లేదే అన్న దిగులును నీ మనసులోంచి తుడిచెయ్. డబ్బులిస్తేనే పనవుతుందన్న ఆలోచన కూడా వద్దు. ఇంటర్వ్యూ మీదే నీ దృష్టిని కేంద్రీకరించు గాంధీ! తప్పకుండా విజయం నీదేరా బాబూ గాంధీ!"

ఫోన్లో తండ్రి హితబోధలు... పక్కనే టెంప్ట్ చేస్తున్న సూట్‌కేసు! గాంధీ తండ్రి మాటలు పూర్తవకుండానే ఫోన్ కట్ చేశాడు.

పదిహేడో అంతస్తుకు చేరుకుని అక్కడి రిసెప్షన్‌లో కాల్ లెటర్ చూపించాడు.

లోపల వెయిటింగ్ హాల్లో కూర్చోమని చెప్పడంతో అక్కడికి వెళ్ళి కూర్చున్నాడు. అక్కడ చాలామంది అభ్యర్థులు అప్పటికే నిరీక్షిస్తూ ఉన్నారు. వాళ్ళందరిపైనా దృష్టిలేదు గాంధీకి. అప్పటివరకూ అతని మనసులో రేగిన అలజడి, అనుభవించిన ఉద్వేగం అతన్ని ఇంటర్వ్యూకి వచ్చేముందు తన తండ్రితో జరిపిన సంభాషణను తలుచుకునేలా చేశాయి.

'అలా అనుకోకు. సూర్యా కన్‌స్ట్రక్షన్స్ కంపెనీ చాలా మంచిగ్రూప్. నేను డిప్లొమా చేసినప్పటినుంచీ ఉంది. అందులో అవినీతికి తావులేదురా!' గాంధీ తండ్రి రాఘవ చెప్పాడు.

"నువ్వు అలా అనుకోకు నాన్నా! చాలామంది ఇలా డబ్బులిచ్చే పనులు చేసుకుంటున్నారట. నువ్వేమో ఎప్పుడు చూసినా నీతి, నిజాయితీ అంటూ వచ్చిన అవకాశాలన్నీ పోగొడతావ్!" అంటూ గాంధీ కోపంగా చెప్పాడు.

"అలా అనుకోకురా మన నిజాయితీయే మనకు శ్రీరామరక్ష! ఎప్పటికయినా అదే కాపాడుతుంది" సౌమ్యంగా ఉంది రాఘవ కంఠం.

'ఏమో నాన్నా. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కావాలని ఎన్నో కలలు కన్నాను. కానీ నీవు కాలేకపోయావని నన్ను సివిల్ ఇంజనీర్ కావాలని బలవంతపెట్టావు.

ఇప్పుడు చూడు... సివిల్ ఇంజనీర్లకి ఉద్యోగాల్లేవు.



ఒకటీ అరా ఉన్నా బోలెడు పోటీ! నా ఫ్రెండ్స్ సాఫ్ట్‌వేర్లో ఎంతెంత సంపాదిస్తున్నారో తెలుసా?' బాధగా చెప్పాడు గాంధీ.

'డబ్బులెన్నొస్తే ఏం ప్రయోజనంకన్నా,మనశ్శాంతి ఉండొద్దా? పోటీ ఉండనీ... అసలు పోటీపడి తెచ్చుకున్న ఉద్యోగంలోని సరదా ఇంకెందులో ఉంటుంది చెప్పు?' నవ్వుతూ అన్నాడు రాఘవ తన కొడుకు గాంధీని ఓదార్చుతూ.

'ఏమో నాన్నా. మీరు చెప్పే నీతులన్నీ ఇలానే ఉంటాయి.మా స్నేహితులు కూడా అంటారు. నువ్వు ఇలా ఉంటే లోకంలో బ్రతకలేవురా అని. ఈ ఒక్కసారికీ నామాట వినండి నాన్నా, వాళ్ళకి డబ్బులిస్తే వెంటనే పనైపోతుంది. జస్ట్ ఒక్క, ఆరు నెలల జీతం అంతేకదా?' గాంధీ స్వరంలో బాధ ధ్వనించింది.

మూడేళ్ళుగా ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నా ఉద్యోగం రాని అసహాయతకు అది ప్రతిబింబం!

'వద్దురా బాబూ...'అని మొదలుపెట్టి ఇంకా ఏవో తండ్రి చెబుతోంటే వాటిని విన్నా కూడా విననట్టే ఉండి పైకి లేచి విసుగ్గా చెప్పాడు గాంధీ...

'సరే నాన్నా! నామాట మీరు వినరు. వస్తాను. అమ్మకు చెప్పండి వెళ్ళానని'

ఇంటర్వ్యూ మొదలైంది. కొన్ని తేలికగా కొన్ని క్లిష్టంగా ఉన్నాయి ప్రశ్నలు. ప్రశ్న ఎలాంటిదైనా గాంధీ తడుముకోకుండానే సమాధానాలు చెబుతున్నాడు. మధ్యలో కూర్చున్న వ్యక్తి గాంధీ ఊహించని ప్రశ్న అడిగాడు.

"గాంధీ, నువ్వు డిగ్రీ పూర్తిచేసి మూడేళ్ళు అయినా ఎందుకు ఖాళీగానే ఉండిపోయావని

సుగుణ - రాజేష్
సెల్ : 97004 67675

చాలామంది అడిగి ఉంటారు. కానీ నాకనిపిస్తోంది. నువ్వు నిర్మాణరంగంలోనే ఉన్నావని"

"లేదు సర్. నేనెక్కడా పనిచేయడం లేదు" చెప్పాడు గాంధీ. "కానీ నిర్మాణరంగంలో చోటు చేసుకుంటున్న అత్యంత ఆధునిక పద్ధతుల గురించి కూడా నువ్వు చెప్పగలుగుతున్నావ్.

అది కేవలం పుస్తకాలు చదవడం ద్వారా రాదు. ఏదో రహస్యం ఉంది నీ దగ్గర" అన్నాడు, మధ్యనున్న వ్యక్తికి కుడివైపు కూర్చున్న బట్టతల మనిషి.

"మా నాన్నగారు సర్" గాంధీకంఠంలో గర్వం కనిపించింది.

"ఓహ్...ఆయనకూడా ఈ రంగంలోనే ఉన్నట్టుగా ఉన్నారు. ఎక్కడ పనిచేస్తున్నారు" అడిగాడు మధ్యనున్నవ్యక్తి పక్కన ఉన్న నడివయస్కుడు.

"ఆకాశ్‌నిర్మాణ్‌లో సర్. ఆయన సివిల్‌లో డిప్లొమా మాత్రమే చేశారు. సివిల్ ఇంజనీరింగ్‌లో డిగ్రీతీసుకోవాలనేది ఆయన తీరని కోరిక. అది నా ద్వారా నెరవేరాలని ఆయన కల.

అందుకే నేను సాఫ్ట్‌వేర్ తీసుకుందామనుకున్నా కూడా సివిల్ ఇంజనీరింగ్‌మాత్రమే తీసుకోమని బలవంతపెట్టి చదివించారు" చెప్పాడు గాంధీ.

"గ్రేట్! ఆయన పేరు?" మధ్యలో ఉన్న వ్యక్తి అడిగాడు. "రాఘవ సర్"

"ఐ సీ" అన్నారు వాళ్ళు. "ఇంకా ఏం చెప్పేవారు మీ నాన్నగారు?" ఆసక్తిగా అడిగారు వాళ్ళలో ఒకరు. గాంధీకి వాళ్ళలా అడగడం ఆశ్చర్యమేసింది.

"మన సివిల్ ఇంజనీరింగ్ భాషలో చెప్పాలంటే నీతి, నిజాయతీ, క్రమశిక్షణ... ఈ మూడూ ఇటుక, సిమెంట్, ఇసుకల్లాంటివి. వీటిలో దేనిలో తేడావచ్చినా మానవ జీవితం అనే భవనం కుప్పకూలిపోతుందనిసర్" ఉత్సాహంగా చెప్పాడు.

"ఓహ్ దట్స్ ఫెంటాస్టిక్ రియల్లీ!" మెచ్చుకోలుగా అన్నాడు నడివయస్కుడు.

"మా నాన్నగారి గొప్పదనమే సర్ అది" వినయంగా చెప్పాడు గాంధీ.

ఎందుకో అతని కన్నుల్లో చిరుతడి!

"ఓకే! యూ కెన్ గో!" అన్నారు వాళ్ళు.

గాంధీ వెళ్ళడానికి లేచి నిల్చున్నాడు. "మీ నాన్నగారికి మా నమస్కారాలు చెప్పండి" నడివయస్కుడు అన్నాడు. గాంధీ విస్మయంగా చూశాడు. ఏదో ఆలోచిస్తూ.కలలోనడుస్తున్నట్టుగా బైటికి నడవబోయాడు.

"మిస్టర్ గాంధీ!" పిలిచారు ఒకరు.

గాంధీ ఆగి వాళ్ళవంక చూశాడు "మీ బ్యాగ్" అప్పటి దాకా కుర్చీ పక్కనపెట్టి మర్చిపోయిన డబ్బులున్న బ్యాగ్‌ని చూపిస్తూ చిరునవ్వుతో అన్నాడు ఒకతను. గాంధీ మనసులో ఏదో సంశయం.

వంగి బ్యాగ్ అందుకున్నాడు. ఇందాక తండ్రిని గురించి చెప్పినప్పుడు తనలో కలిగిన ఉద్వేగం ఇప్పుడు లేదు. బ్యాగ్ అందుకుంటుంటే ఏదో న్యూనతా భావం! ఆ బ్యాగ్ అందవలసిన వాళ్ళకిఅందిస్తే తనకి ఉద్యోగం వస్తుంది. కానీ...



పెట్రోల్ ధరలను నియంత్రించే అంశాలు ఏపీ భారత్ చేతుల్లో లేవు.
-ధర్మేంద్ర ప్రదాన్, కేంద్రమంత్రి



తెలంగాణ సమస్యలు తీరలేదు కాని కె.సి.ఆర్. హయాంలో భారీగా అప్పులుపాలైంది రాష్ట్రం.
-ప్రొ॥ కోదండరాం, టి.జె.ఎస్. అధ్యక్షుడు

"సర్! మర్చిపోయాను. ఈ బ్యాగ్ నాది కాదు. నాకు లిఫ్టులో దొరికింది. ఇందులో డబ్బు ఉంది. మీ ఆఫీసువాళ్ళెవరిదైనా కావచ్చు. రిసెప్షన్లో ఇద్దామని తెచ్చాను. కానీ రాగానే నా నెంబర్ రావడంతో లోపలికి వచ్చేశాను. ఈ బ్యాగ్ మీదే సార్" అంటూ బ్యాగ్ వాళ్ళకి అందించాడు.

వాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "ఇప్పుడు నీకో సర్‌ప్రైజ్ గాంధీ!ఆ స్క్రీన్‌వైపు చూడు" అంటూ రిమోట్ ఆన్ చేశాడు బట్టతల వ్యక్తి. పక్కన గోడమీద ఉన్న స్క్రీన్ ఆన్ అయింది. అందులో ఒక వీడియో మొదలైంది. వెంటనే గుర్తుపట్టాడు గాంధీ... అది తను ఎక్కి వచ్చిన లిఫ్ట్.

లిఫ్ట్ తలుపులు తెరుచుకున్నాయి. పొట్టిగా వున్న మనిషొకడువచ్చి ఓ బ్యాగ్‌ను పక్కన పెట్టి బైటకు వెళ్ళిపోయాడు. ఆశ్చర్యం! ఆ మనిషిని కూడా తను ఇదివరకు చూశాడు!వీడియో ఆగింది. గాంధీకి నోట మాట రాలేదు.

"లిఫ్ట్‌లో డబ్బుపెట్టిన వ్యక్తిని నువ్విదివరకు కలిశావ్ కదూ?" అడిగాడు బట్టతలతను.

"అవును సార్. ఈ కంపెనీలో ఉద్యోగం రావాలంటే ఒకటిన్నర లక్షల లంచం ఇవ్వాలని చెప్పాడు. ఇంటర్వ్యూకి రాబోయేముందు కూడా ఫోన్ చేశాడుసర్" అన్నాడు వణుకుతున్నకంఠంతో.

"అలా అని మేమే చెప్పమన్నాం.

సూర్యా కన్‌స్ట్రక్షన్ కంపెనీలో ప్రతిరోజూ కోట్ల రూపాయల లావాదేవీలు జరుగుతూ ఉంటాయి. మరి డబ్బుకు ఆశపడేవ్యక్తులు ఉంటే ఉద్యోగానికి అర్హులుకారు కదా?అదొక్కటే కాదు... నిజాయితీ లేకపోతే. కంపెనీ చేసే ప్రాజెక్టుల్లో అవకతవకలు ఎన్నో జరుగుతాయి. దానివల్ల అపారమైన ప్రాణనష్టం.

ఆస్తినష్టం కూడా జరుగుతుంది. అందుకే ఈ పరీక్షపెట్టాం" చెప్పాడు నడివయస్కుడు.

"ఎనీవే... యూ గాట్ సెలెక్టెడ్ గాంధీ! కంగ్రాచ్యులేషన్స్!"నవ్వుతూ చెప్పాడు మధ్యనున్న వ్యక్తి. అప్పుడన్నాడు నడివయస్కుడు "టెంప్టేషన్అన్నది మానవ సహజం, చివరికి నిజాయితీనా, టెంప్టేషనా ఏది గెలిచిందన్నదే పరీక్ష. బ్యాగ్‌తోపాటు బయటికి వెళ్ళిపోయిన వాళ్ళని మావాళ్ళు గేటుదగ్గరే తనిఖీ చేసి బ్యాగ్ లాగేసుకున్నారు. నువ్వొక్కడివే ఇప్పటివరకూ బ్యాగ్ మాకు హ్యాండోవర్ చేసినది. అది మీ నాన్నగారి పెంపకం ప్రభావమనుకుంటాను!"

"థ్యాంక్యూ సోమచ్ సర్స్" అని ముగ్గురికీ చేతులు జోడిస్తూ చెప్పి ఆనందంగా బైటకొచ్చాడు గాంధీ. బైటికి వెళ్ళబోతుంటే ఖాళీ లిఫ్ట్‌లో పొట్టిగా ఉన్న వ్యక్తి మరో బ్యాగ్‌పెడుతూకనిపిస్తే నవ్వుకున్నాడుగాంధీ.

"మన సివిల్ ఇంజనీరింగ్ భాషలో చెప్పాలంటే నీతి, నిజాయితీ, క్రమశిక్షణ... ఈ మూడూ ఇటుక, సిమెంట్, ఇసుకల్లాంటివి. వీటిలో దేనిలో తేడావచ్చినా మానవజీవితం అనే భవనం కుప్పకూలిపోతుంది' అన్న తండ్రి మాటలు గుర్తొచ్చాయి.

'భవనం స్థిరంగా నిలబడాలంటే పునాది చాలా ముఖ్యం. తనకి అలాంటి పునాది తన తండ్రి...' కృతజ్ఞతగా అనుకున్నాడు గాంధీ.



# కెమెరా అంటే ఇష్టం



ముంబయికి చెందిన నటి హెబ్బాపటేల్ 2014లోనే కన్నడ సినిమా 'అధ్యక్ష'తో నటనకు శ్రీకారం చుట్టినా తెలుగునాట 'కుమారి 21 ఎఫ్'తో ఒక్కసారిగా ఫామ్‌లోకి వచ్చింది. తన నటనతో అందరినీ మెప్పించింది. వ్యక్తిగతంగాచూస్తే, తనెంతో రిజర్వ్‌డ్ అని చెప్పుకోవాలి.

రాబోయే '24 కిస్సెస్'సినిమాతో హాటెస్ట్, లేటెస్ట్ టాపిక్ అయింది. ట్రైలర్ విడుదలైన ఇరవైనాలుగు గంటల్లోనే లక్షమందికిపైగా చూసిన ఘనత అందుకున్నది. ఆమెతో ఇంటర్వ్యూ.

**మీ '24 కిస్సెస్'గురించి అంచనాలను చెప్తారా?**

నా కెరీర్‌లో ఇది అత్యంత ఎగ్జయిటింగ్ చిత్రం. ఇప్పటిదాకా నేను చేయనటువంటి ఛాలెంజింగ్ పాత్ర. ఓ నటిగా పరిణామం చెందేందుకు నిజంగా సాయపడిందీ సినిమా. ట్రైలర్‌కు స్పందన, పోస్టర్లు చాలా గొప్పగా వున్నాయి. ఇవన్నీ సినిమాపై నా అంచనాలకు మరింత విశ్వాసాన్నిచ్చాయి.

**మీ ఇతర ప్రాజెక్టుల సంగతేంటి?**

కొన్ని ప్రాజెక్టులు ఫైనలైజ్ అయ్యే దశలో వున్నాయి. వాటిని త్వరలోనే ప్రకటిస్తారు.







**'24 కిస్సెస్'లో సెట్స్‌లో మరవలేని క్షణాలేంటి?**

ఇంతకుముందు నేను ఏడ్వాల్సిన సన్నివేశాలకు సంబంధించి ఎప్పుడూ గ్లిజరిన్ ఉపయోగించేదాన్ని. కాని, '24 కిస్సెస్' సినిమాలో దాని అవసరం లేకుండా ఏడ్చాను. ఇది ఓ నటిగా నాకు ఎంతో గొప్ప పరిణతిగా అనిపిస్తున్నది. నేను సాధించిన లక్ష్యంగా భావిస్తున్నాను.

**వెబ్ సిరీస్‌లో నటించాలన్న కోరిక ఉందా?**

(నవ్వేస్తూ) ఇప్పుడు వెబ్ సిరీస్ అనేది ఓ రేంజ్‌గా వుంది. నాకు నటించడం ఇష్టమే. నెట్ ఫ్లిక్స్, అమెజాన్ ప్రైమ్‌లు ఇష్టం. ఈ వేదికలుగా వచ్చే ఏ వెబ్ సిరీస్‌లోనైనా నటించడం నాకు ఇష్టం.

**ఎప్పుడూ చూడాలనుకునే ఆల్ టైమ్ ఫేవరెట్ సినిమా ఏంటి?**

'మహేష్‌భట్ తమన్నా', ఇటీవలి కాలంలో 'జబ్ ఉయ్ మెట్' సినిమా.

**నటనను కెరీర్‌గా ఎందుకు ఎంచుకున్నారు?**

నాకు కెమెరా ముందుండడం ఇష్టం. నిజాయితీగా చెప్తున్నాను- కెమెరా ముందు నన్ను నేను చాలా ఇష్టపడతాను. అందుకే నేను మంచి తారను కాగల నన్న ఆలోచన వచ్చింది.

**మీరు కెరీర్ ఆరంభించినతర్వాత ఎదుర్కొన్న సవాళ్ళు ఉన్నాయా?**

మొదట్లో ఎవర్ని నమ్మాలో అర్థం అయ్యేది కాదు. అదో ప్రధాన సమస్య అనిపించేది.మరో సవాల్ ఏమిటంటే పరిశ్రమలో గాడ్‌ఫాదర్ లేకపోవడం.

**నటికాకపోయివుంటే ఏ వృత్తి ఎంచుకునేవారు?**

(మరోమారు నవ్వేస్తూ) నటి కాకపోయివుంటే ఖచ్చితంగా జర్నలిస్టును అయివుండేదాన్ని.

**పని లేనప్పుడు ఏం చేస్తారు?**

ఖాళీ సమయాన్ని ఇంట్లో హాయిగా, ఆనందంగా గడిపేస్తా. నెట్‌ఫ్లిక్స్‌తో టైమ్‌పాస్ చేస్తా.

**మీ ఫ్యాషన్ మంత్ర?**

తక్కువే ఎక్కువ.

**ఎటువంటి ఫిట్‌నెస్‌ను అనుసరిస్తారు?**

పిలేట్స్ ప్రాక్టీస్ చేస్తాను. ఇవంటే నాకు చాలా చాలా ఇష్టం. నా మూడ్‌ను మెరుగుపరుస్తాయి. నా శరీరంపై, మనస్సుపై అద్భుతాలు చూపుతాయి- అంటూ ముగించింది హెబ్బాపటేల్.

అయినపూరి సుజాత




సీరియల్

ఇదంతా తొలిసారి చూస్తున్న నాని హావభావాల్లో క్రమక్రమంగా మార్పు కనిపిస్తుంది. కాంపిటేటివ్ స్పిరిట్ ఎలా ఉంటుందో, అంతమందిలో ప్రైజు గెల్చుకోవడం, కాంప్లిమెంట్ పొందడం ఎంత గొప్పగా, గర్వంగా ఉంటుందో ప్రత్యక్షంగా చూస్తున్నాడు.

మరిన్ని బొమ్మలు బోర్డుమీదకెక్కాయి. గెలుచుకున్న కుర్రాళ్ళ చొక్కాలమీద స్టిక్కర్లు అతుక్కున్నాయి.

కొన్ని బొమ్మలను గుర్తించిన నాని చెయ్యి ఎత్తుతున్నాడు. తాను చెప్తానన్నట్లుగా ఎక్స్‌ప్రెషన్ ఇస్తున్నాడుకానీ నిత్య అతన్ని గుర్తించటంలేదు.

గుర్తింపు పొందడం, బహుమతి సాధించడమెంత పెయిన్‌ఫుల్ ప్రాసెస్ అన్నది తెలుస్తున్నది.

కానీ ఎఫర్ట్ మానేయకుండా పదేపదే ప్రయత్నం చెయ్యడం అనేది అసంకల్పితంగా అలవాటవుతుంది.

మరో బొమ్మ వేసింది నిత్య "ఈ బొమ్మ ఏంటో ఎవరు చెప్తారూ?" వెనక్కి తిరగ్గానే పిల్లలంతా ఎవరికివాళ్ళు చేతులెత్తుతూ గోలచేస్తున్నారు.

ఇప్పటికీ ఒక్క స్టిక్కరూ గెల్చుకోని వాళ్ళు జీవన్మరణ సమస్యలాగ ఫీలైపోతుంటే రెండో స్టిక్కరు సంపాదించేద్దామని ఇంకొందరు.

ఈ హంగామా మధ్య నాని చెయ్యి ఎత్తడాన్నీ, ఎలాగయినా తనకి ఛాన్స్ ఇవ్వాలని అతను చేస్తున్న గోలనీ ఎవరూ గుర్తించడంలేదు.

"సో... ఎవరు చెప్తారూ?" చుట్టూరా కలియజూస్తూ చూపుడువేలిని చూపిస్తోంది నిత్య- "ఊ... ఇప్పుడు నాని చెపుతాడు..." అంది.

ఆమె అలా అనగానే మిగతా పిల్లలంతా చేతులు దించేశారు. తలలు నానివైపు తిప్పారంతా.

నిత్య తనకి ఛాన్స్ ఇచ్చినందుకు చాలా ఎగ్జయిట్ అవుతున్నాడు నాని. నాని దగ్గరికి నడిచింది నిత్య, "చెప్పు నానీ... ఇదేంటీ?"

నాని తడబడుతూ, ఊగిపోతూ, గొంతు పెగుల్చుతూ, నోటిని స్వాధీనంలోనికి తెచ్చుకుంటూ ఆ బొమ్మని గుర్తించి చెప్పాడు. అలా చెప్పినతర్వాత నాని నిత్య మొహంలోకి చూశాడు.

నిత్య కొద్ది క్షణాలసేపు ఎటువంటి స్పందననూ కనిపించనీయకుండా అలా ఉండిపోయింది.

నిత్యనుంచి ఎలాంటి రెస్పాన్స్ లేకపోయేసరికి అందరిలోనూ ఉత్కంఠ పెరిగిపోతోంది.

నానితోపాటు మిగతా పిల్లలు కూడా ఆదుర్దాపడుతున్నారు.ఎందుకు ఈమె ఇలా సస్పెన్స్ మెయింటెన్ చేస్తుందో వరండాల్లో నిలబడి చూస్తున్న వారికెవరికీ అర్థంకావట్లేదు.

అలా చిన్న పాజ్ తీసుకున్నతర్వాత నిత్య మాట్లాడింది- "నాని బొమ్మని కరెక్టుగా చెప్పాడు. సో... నానీ ఈజ్ ది విన్నర్" గట్టిగా అరిచింది.

ఈ మాటను అర్థంచేసుకోగానే నానీలో ఆనందం కట్టలు తెంచుకుంది. వీల్ ఛెయిర్ హ్యాండిల్స్‌ని పట్టుకుని ఊపేశాడు.

నిత్య ఒక స్టిక్కర్‌ని నాని చొక్కా జేబుదగ్గర అతికించింది. అరచేత్తో మురిపెంగా దాన్ని తడుముకున్నాడు. మిగతా పిల్లలంతా నానిదగ్గరకొచ్చేసి పోటీలుపడుతూ అతని చెయ్యి అందుకుని షేక్‌హ్యాండులు ఇచ్చేశారు.

ఒక గొప్ప గెలుపుని ఆస్వాదిస్తున్న ఆనందం నాని కళ్ళల్లో కనిపిస్తోంది. కొంతసేపు ఆ గోలని కొనసాగనిచ్చాక నిత్య కల్పించుకుంది "సైలెన్స్" అంది.

పిల్లలందరూ కామ్ అయిపోయి బుద్ధిగా కూర్చున్నారు.

"ఈ రోజుకి ఆటలూ, ఎంటర్‌టైన్‌మెంటూ అయిపోయింది. ఇక చదువు చదవాలి" తాను తెప్పించిన పెద్దబాలశిక్ష కాపీల్ని మిగతా పిల్లలకి కూడా పంచిపెట్టింది. ఏదో పేజీ తెరిచింది నిత్య "తెలుగు అక్షరాలెలా రాయాలో తెల్సుకుందాం"

బ్లాక్ బోర్డుమీద ఖాళీగా ఉన్న కుడివైపు ఇంకో రంగు చాక్‌పీస్ అందుకుని అక్కడ తెలుగు అచ్చులూ, హల్లులూ రాసింది. "ఇవి తెలుగు అక్షరాలు. ఎలా పలకాలంటే..." అంటూ ఒక్కో అక్షరాన్నీ పలుకుతూ చెప్పింది... వాళ్ళచేత చెప్పించింది.

"మరి వీటిని గుర్తుపెట్టుకోవడం ఎలా? రాయడం ఎలా?"

## జరిగిన కథ 10

నాని చదువు పెద్దబాలశిక్షతో ప్రారంభించాలని నిత్య చెప్పడంతో రవళికి, మంజులకి చాలా కోపం వస్తుంది. దాంతో వాళ్ళు ఇద్దరూ మేడమ్ జయప్రభని కలసి నిత్య మీద కంప్లైంట్ చేస్తారు. వారిద్దరిలోనూ అభద్రతాభావాన్ని పోగొట్టి నిత్య చెప్పినట్లే చేయనిద్దామని తేల్చేస్తుంది జయప్రభ.

తన తల్లి కండిషన్ నార్మల్‌గా ఉందని తెలిసి సంతోషపడుతుంది నిత్య. పంచవటిలో పనిచేసే నూకరత్నం, మిగతా పనివాళ్ళు తనపట్ల చేసే నిరసనలను గమనించి అసలు తను ఎందుకు ఇక్కడికి వచ్చిందీ చెప్పడం ప్రారంభిస్తుంది నిత్య.

ఆ తరువాత ఆమె చెప్పిందంతా తమ శ్రేయస్సుకోసమేనని అర్థం చేసుకుంటారు. దివాణం పదికాలాల పాటు పచ్చగా ఉండాలి అంటే అబ్బాయిగారైన నాని బాగుపడాలని కోరుకుంటారు పంచవటిలో పనిచేసేవాళ్ళంతా.

నిత్యను అపార్థం చేసుకున్నందుకు పశ్చాత్తాపపడుతుంది నూకరత్నం. రవళి, మంజుల, చందర్రావు అంతా కూడా నిత్య మాటలకు ప్రభావితులవుతారు.

ఇక జరిగేది చదవండి.




ఒక ప్రశ్నను వదిలి అందరి మొహాల్లోకీ చూసింది. సమాధానం తెలియకపోయినప్పటికీ ఎలా? ఎలా? అన్నప్రశ్న అందర్లోనూ రిజిస్టర్ అయిపోయింది.

ఆలోచనకి ఆస్కారం ఇవ్వడంకోసం కొద్దిసేపు వెయిట్ చేశాక మాట్లాడుతోంది నిత్య. రవళి, మంజులకే కాక వరండాల్లోంచి తొంగిచూస్తున్నవాళ్ళకీ ఈ ప్రశ్న ఆసక్తి రేకెత్తించింది.

పలకమీద బలపం పట్టుకుని బరబరా దిద్దకుండా అక్షరాలని మెదడులోనికి జొప్పించడం ఎలా?

"సింపుల్... ఇదుగో ఈ బొమ్మని గుర్తుపెట్టుకుంటే ఈ అక్షరం బాగా గుర్తువుంటుంది" ఎడమవైపున ఉన్న మొదటి బొమ్మలో ఉన్న అక్షరాన్ని వేరే కలర్ చాక్‌పీస్‌తో దిద్దింది. ఆ బొమ్మలో తెలుగు అక్షరం స్పష్టంగా కనిపిస్తోంది.

"అలాగే రెండో అక్షరాన్ని గుర్తుపెట్టుకోవాలంటే ఈ బొమ్మని జ్ఞాపకం తెచ్చుకోవాలి" ఇలా మొత్తంగా బొమ్మల్లో అక్షరమాలని చూపించింది నిత్య.

"వావ్.. షీ ఈజ్ గ్రేట్... మోస్ట్ టాలెంటెడ్" మనసులో మాటను బయటకి చెప్పకుండా ఉండలేకపోయింది మంజుల. వరండాలో ఉన్నవాళ్ళకైతే మతిపోయింది.

అక్షరమాల నేర్పడానికి ఇన్ని బొమ్మల్నీ నిత్య గీసిందని అర్థమై ఆశ్చర్యానికి గురయ్యారు.

"ఈమె సామాన్యురాలు కాదు. డౌట్‌లేదు. నానీని తప్పక మేకోవర్ చెయ్యగలదు" చాలామందికి కలిగిన నమ్మకం ఇది. ఆటనుంచి చదువులోనికి మళ్ళిన పిల్లలు బొమ్మల్లోని అక్షరాలని సునాయాసంగా గుర్తించగలుగుతున్నారు.

అదే సమయంలో ఉచ్చారణ ఎలా చేయాలో కూడా నేర్పుతుంది. అలా అక్షరమాల నుంచి మొదలైన పాఠం అచ్చులు, గుణింతాలూ, హల్లుల ధ్వని ప్రత్యేకతలూ చిన్ని చిన్ని పదాలూ, మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌తోపాటు ఇలా సాయంత్రం నాలుగువరకూ సాగిన బడిలో పెద్దబాలశిక్ష సాయంతో తెలుగులో చాలావరకూ బోధన పూర్తిచేసింది.

"మీ అందరూ ఫ్రెండ్స్.కానీ ఇక్కడ బడిలో ఉన్నంతసేపూ ఒకరితో ఒకరు పోటీపడేవారే" ఇలా చెపుతూ ఆ రోజుకి కంక్లూడ్ చేసింది నిత్య, "రేపట్నించీ తెలుగు, ఇంగ్లీషూ, మ్యాథ్స్ అన్నీ నేర్చుకోవాలి... ఉదయం ఎనిమిదికే బడి మొదలవుతుంది. సరేనా?"

అలా ఆ రోజుకి బడి ముగిసింది. నిత్య బ్యాగు తీసుకుని రూమ్‌వైపు సాగింది. పిల్లలంతా అక్కడ్నుంచి నడిచారు. చంద్రావొచ్చి నానిని రూమ్ దగ్గరకి తీసుకెళ్ళబోతే అతను ఒప్పుకోలేదు. ఇప్పుడిప్పుడే జనాలూ, పిల్లలూ అలవాటవుతున్నారు.

అందరూ తనని పలకరిస్తున్నారు. చూసి నవ్వుతున్నారు. అంచేత ఒంటరిగా రూమ్‌లో కూర్చోవడానికి నాని ఇష్టపడడంలేదు. ఇక్కడే నడింవాకిట్లో ఉండడానికి ఆసక్తి చూపిస్తున్నాడు.

పనులలో బిజీగా అటూ ఇటూ తిరిగేవారిని చూడ్డం, ఏదైనా కమ్యూనికేట్ చెయ్యడానికి ప్రయత్నించడం... ఒక్క ముక్కలో చెప్పాలంటే మనుషుల మధ్య ఉండడానికే ఇంట్రెస్ట్ చూపిస్తున్నాడు నాని.

రూమ్‌లోకి తీసుకువెళ్ళడానికి నాని ససేమిరా అంటూవుండడంతో కొంతసేపటితరువాత వచ్చి అతన్ని రూమ్‌లోకి తీసుకువెళ్ళవచ్చని నిర్ణయించుకుని నడింవాకిట్లో నానిని వదిలేసి చంద్రావు అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

ఖాళీగా ఉన్న నడింవాకిట్లో అలా మెల్లగా వీల్ ఛెయిర్ చక్రాలను నెట్టుకుంటూ కలియదిరుగుతున్నాడు నాని. అప్పుడప్పుడూ కనిపించేవాళ్ళని నిశితంగా పరిశీలిస్తూ, వాళ్ళు చేసే పనులను అబ్జర్వ్‌చేస్తూ కాలక్షేపం చేస్తున్నాడు. మధ్యలో తన పాదాలను కదపడానికి, మోకాళ్ళను మూవ్ చెయ్యడానికీ ప్రయత్నిస్తున్నాడు.

ఈ వీల్‌ఛెయిర్‌నుంచి బయటపడాలన్న కోరిక మనసులో జనించింది. అది నిజం కావాలనే ప్రయత్నం నరనరాల్లో ప్రసరిస్తోంది.

నిత్య అంతకుముందే సూచించినట్లుగా ఎవరూ ప్రత్యేకించి నానిని గమనిస్తున్న ఫీల్ ఇవ్వకుండా తమ పనుల్లోనే నిమగ్నమైవున్నారు.

దొంగాపోలీసు ఆట ఆడుకుంటున్న పిల్లలు కొందరు ఆటలో భాగంగా



ప్రజల ముంగిటకి ప్రభుత్వ సేవలను తీసుకువెళుతున్నాం... ఇక డ్రైవింగ్ లైసెన్స్, వివాహ రిజిస్ట్రేషన్ ఇంటిదగ్గరే.

-అరవింద్ కేజ్రీవాల్, ఢిల్లీ సి.ఎమ్.



ఉత్తమ సమాజ నిర్మాణంకోసం ప్రపంచవ్యాప్తంగా ఉన్న హిందువులందరూ ఏకం కావాలి.

-మోహన్ భగవత్
ఆర్.ఎస్.ఎస్. చీఫ్

వరండాలోకి పరిగెత్తుకుని రావడం, దొంగని పోలీస్ గుర్తించి పట్టుకోవడం. నానికి ఈ ఆట అంతా కూడా తమాషాగా అనిపిస్తోంది. దీర్ఘచతురస్రాకారంలో వున్న నడింవాకిట్లో అంచువెంబడి నెమ్మదిగా వీల్‌ఛెయిర్ని నడిపిస్తూ సాగుతున్న నానికి ఎదురయ్యేవన్నీ వింతలూ విడ్డూరాలే.

కనిపించేవన్నీ తమాషాలూ, విశేషాలే. నాలుగ్గోడలకే అంకితమైన దశాబ్దాల జీవనంతర్వాత ఇలా బాహ్య ప్రపంచం. కొత్త మనుషులతో నిండిన సరికొత్త ప్రపంచం నవ్యమయిన అనుభూతులనతనికి పరిచయం చేస్తోంది. ఒక రూమ్‌దగ్గర పసిపిల్లాడి తల్లి వరండాలో చీరతో ఉయ్యాల కట్టి అందులో బిడ్డని పడుకోబెట్టి ఊపుతోంది.

బిడ్డ ఇంకా నిద్రపోకుండా కదులుతూ ఉండడంతో ఉయ్యాలని గట్టిగా ఊపుతూ లాలిపాట పాడుతోంది.

"కృష్ణుడంటి చిన్నిబిడ్డ.. కృష్ణుడింట వెన్నముద్ద... రేపల్లె వెలుగంట.. రాగాల మురళంట..." రిపీటెడ్‌గా చాలా రాగయుక్తముగా జోల పాట పల్లవిని వినసొంపుగా పాడుతోందామె... పదే పదే వింటున్న ఆ పల్లవి తెలియకుండానే నాని పెదవులపైన మెదులుతోంది... చిన్నగా తలూపుతూ కూనిరాగంలా ఆ పదాలను రాగయుక్తంగా వల్లెవేయడం అసంకల్పితముగా జరుగుతోంది.

యధాలాపంగా రూమ్ బయటికొచ్చిన నిత్య దీన్ని గమనించింది. పసిబిడ్డకి తల్లిని ఇంకా అలానే పాడుతూండమని సంజ్ఞచేసి చెప్పింది. ఆమె అర్థం చేసుకుని కాస్త గట్టిగా వినపడేలాగ పాటను రాగయుక్తంగా పాడడం కొనసాగించింది.

ఇదేదీ గమనించని నాని వీల్‌ఛెయిర్‌ని తోసుకుంటూనే ఆ పాటలోని పదాలను వల్లెవేస్తున్నాడు.రాగాన్ని అందుకోవడానికి ట్రైచేస్తున్నాడు.

ఆ సమయంలో నిత్యకు ఒక ఆలోచన వచ్చింది. వరండాలో ముందుకు నడిచి స్తంభంచాటున నిలబడి ఆ బిడ్డ తల్లితో తన ఐడియాను షేర్ చేసుకుంది నిత్య.

ఆమె నిత్య మాటలు విని అర్థం చేసుకుని సరేనంది. వెంటనే అక్కడ నుంచి తప్పుకుంది నిత్య.

బిడ్డ తల్లి ఉయ్యాలలోంచి బిడ్డను తీసి అక్కడే ఉన్న చాపమీద కూర్చొని తన కాళ్ళమీద బిడ్డను పడుకోబెట్టుకుని జోకొడుతూ లాలిపాటను కొనసాగించింది.

నడింవాకిట్లో ఆ చివరివరకూ వెళ్ళి మళ్ళా ఇటు వస్తున్న నాని ఇంకాస్త ముందుకి వచ్చేవరకూ చూసి ఆ సమయంలో బిడ్డని చాపమీద బోర్లాపడుకోబెట్టి తను రూమ్‌లోపలికి వెళ్ళింది.

చాపమీద బిడ్డ ఇంకా పూర్తి నిద్రలోనికి జారుకోకపోవడంచేత అటూ ఇటూ దొర్లుతోంది.

పాటలోని పదాలను పెదాలపై పలికిస్తూనే నాని దగ్గరకొస్తున్నాడు.

ఆ సమయములో బిడ్డ పూర్తిగా ఇటువైపు దొర్లింది. ఇంచుమించుగా గట్టు అంచుదగ్గరకి వచ్చేసింది.

మరికాస్త దొర్లితే మూడడుగుల ఎత్తున్న గట్టుమీద నుంచి నడింవాకిట్లోనికి పడిపోతుంది.

గట్టుకి అల్లంత దూరంలో ఉన్న నానికి పరిస్థితి అర్థమైంది. బిడ్డ పడిపోబోతుందని అతనికి తెలుస్తోంది. ఎవరయినా వచ్చి బిడ్డని అక్కడ్నుంచి తీసేస్తే బావుణ్ణని అనిపిస్తోందతనికి. అటూ ఇటూ చూశాడు. ఎవరూ కనిపించలేదు. నోరు పెగిల్చి అరిచాడు. మళ్ళీ మళ్ళీ గట్టిగా అరిచాడు.

నిత్య ద్వారా అందరికీ సూచనలు ముందే పాస్ అయిపోవడంతో నాని అరుపులు వినిపిస్తున్నా ఎవరూరాలేదు. ఓ పక్క కేకలు పెడుతూనే చేతుల్లోని శక్తిని అంతా వినియోగిస్తూ వీల్‌ఛెయిర్‌ని ముందుకు నడిపిస్తున్నాడు.

బిడ్డ పూర్తిగా ఇటు తిరిగేలోపు తాను అక్కడికి చేరుకోలేనేమోనన్న ఆదుర్దా అతనిలోని శక్తినంతా చేతుల్లో కేంద్రీకృతం అయ్యేలా చేస్తుంది.

బిడ్డ ఇటు దొర్లింది. గట్టు అంచు మీద ఉన్నది. ఏ క్షణమయినా పడిపోవడానికి సిద్ధంగా ఉంది.

నాని పదడుగుల దూరంలోనికి వచ్చేసరికి గట్టుమీద ఊగిసలాడుతున్న పసిబిడ్డ ఇటు తిరిగింది. అంతే... వెర్రికేక పెడుతూ చేతుల్లోని బలం అంతా ఉపయోగించి కుర్చీలోంచి లేచాడు.

ఒకదానితర్వాత ఒకటిగా అతని పాదాలు రాతి నేలపలకలని తాకాయి. తడబడుతూ అడుగులు పడ్డాయి.

పడుతూ లేస్తూ గుడ్డిగా కాళ్ళు కదుపుతూ ముందుకి సాగి గట్టుదగ్గర బోర్లాపడ్డాడు. సరిగ్గా ఆ క్షణంలోనే గట్టుమీద నుంచి జారిన పసిబిడ్డ నాని వీపుమీద పడింది.

రాతి గచ్చుమీద పడాల్సిన బిడ్డ మెత్తటి దిండుమీద పడిన రీతిన నాని వీపున పడింది. అంతవరకూ గోడ చాటున నిలబడి ఉగ్గబట్టుకుని నిలబడి ఉన్న బిడ్డ తల్లి పరుగుపరుగున వచ్చి తన బిడ్డని చేతుల్లోనికి తీసుకుని గుండెలకు హత్తుకుంది.

ఆ వెనకే వచ్చిన నిత్య నాని చేయి అందుకుని లేపి కూర్చోబెట్టింది.

నిత్య సూచనమేరకు అంతవరకూ ఆ పరిసరాలకు రాకుండా ఉన్న జనం అంతా అప్పటికప్పుడు పరుగుపరుగున



## కోట్లే కోట్లు!

తమిళనాట లేడీ సూపర్ స్టార్ ఇమేజ్ దక్కించుకున్న నయనతారతో లక్కీ లెగ్ కోసం ఇంకా దర్శక నిర్మాతలు క్యూ కడుతూనేవున్నారు.

ఇటు పెద్ద హీరోలు, అటు కుర్ర హీరోలతో ఎడాపెడా జత కట్టేస్తున్నది. తెలుగులో సైరాలో నటిస్తోంది.

మొత్తంమీద నయనతార ప్రస్తుతం చేస్తున్న సినిమాలు అన్నీకలిపి వెయ్యికోట్ల బిజినెస్ అని ట్రేడ్ విశ్లేషకులు చెపుతున్నారు.

భారతీయుడు ఐదొందల కోట్లు, అజిత్‌తో కలసి చేసే చిత్రం వంద కోట్లు, మరో సినిమా రెండువందల కోట్లు ఇలా మొత్తంమీద వెయ్యి కోట్లన్నమాట! ఈ రేంజ్‌లో మరో దక్షిణాది తార ప్రస్తుతానికైతే లేదు.

వచ్చి గుమిగూడారు.

"నానీ ఈ పసిబిడ్డ ప్రాణాలు కాపాడాడు" నిత్య గట్టిగా అరిచి అందరికీ చెప్పింది. అక్కడ ఏం జరిగిందో కన్నులకు కట్టినట్లు వర్ణించింది.

"శరీరం సహకరించకున్నా మనసులో అనుకున్నది చేసిచూపించాడు. హీ ఈజ్ గ్రేట్..."

"జమిందారుగారూ, వాళ్ళ నాన్నగారూ అంతేనమ్మా... సాహసాలు చెయ్యడానికి ఏనాడూ భయపడకుండా ముందుకు వచ్చేవారు.

ఒకసారి పెద్దారిపల్లిలో వరదలొచ్చినప్పుడు పెద్ద జమిందారు ఈదుకుంటూ వెళ్ళి కనీసం ఇరవైమంది ప్రాణాలు కాపాడారు.

మరి వాళ్ళ నాన్నగారైతే మనుషుల్ని చంపుకుతిన్న పులిని ఒంటిచేత్తో వేటాడారంట"

"ఆళ్ళ కుటుంబములో తరతరాలుగా అందరూ సాహసాలు చేసినవారే... మరి నాని బాబు చెయ్యడంలో విచిత్రం ఏముందీ?"

నాని సాహసాన్ని అందరూ గుర్తించడాన్ని ఎంకరేజ్ చేస్తోంది నిత్య.

"నానీ... అసలు వీల్ చెయిర్ మీద నుంచి కాలు కింద పెట్టడానికే ఇష్టపడని నువ్వు ఎలా... ఎలా.. ఈ అడ్వంచర్ చేశావ్? అంత దూరం నుంచి నువ్వు నడుచుకునివచ్చావు.

అంటే నీ కాళ్ళు పనిచేస్తున్నాయి. అంటే నువ్వు అడుగులెయ్యగలవు... నడవగలవు... ఇంకొంచెం ప్రాక్టీస్ చేస్తే చకచకా పరిగెత్తగలవు కూడా"

నిత్య మాటలు అతని మనోబలాన్ని రెట్టింపు చేసేలా పనిచేస్తున్నాయి.

"అసలు ఇలా చేయాలని నీకెలా అనిపించింది?" నాని తన మనసులోని మాటను కమ్యూనికేట్ చెయ్యడానికి పదాలు వెతుక్కుంటున్నాడు "బాబు... దెబ్బ... రక్తం..."

"ఓహో పిల్లాడు రాతిపలకమీద పడితే దెబ్బ తగిలి రక్తం వస్తుందని ఊహించి అలా జరక్కుండా ఉండాలని నీమీద పడేలా చేశావ్. అవునా?"

తన భావం కరక్టుగా కమ్యూనికేట్ అయినందుకు పెద్దగా నోరు తెరిచి నవ్వుతూ తలూపాడు నాని.

"వెరీగుడ్. చూశావా. ఒక మంచి చేద్దామనుకున్నప్పుడు మనలో శక్తి దానికదే బయటికొస్తుంది"

"ఈ లెక్కన అబ్బాయిగారు ఫుట్‌బాల్ ఆడి గోల్‌కొట్టడానికి ఎన్నిరోజులో పట్టదు" ఓ కుర్రాడు అన్నదాన్ని సమర్థిస్తున్నట్లు తలూపింది నిత్య.

మానసికముగా వెయ్యి ఏనుగుల బలం వచ్చినంత కాన్ఫిడెన్స్ నాని కళ్ళల్లో కనిపిస్తోంది.

అప్పుడే అక్కడికొచ్చిన చంద్రావుకి ఇవేవీ తెలియకపోవడంచేత ఏం జరిగిందా! అనే ప్రశ్నకు సమాధానం వెతుకుతూ కాస్తదూరంలో ఉన్న వీల్ చెయిర్ని నానిదగ్గరకి తీసుకొచ్చాడు.

"అదేంటి చంద్రావ్? మళ్ళీ వీల్ చెయిర్ తెస్తున్నావ్?" ఇకముందు అవసరం ఉంటేనే కానీ వీల్‌ఛెయిర్ ఉపయోగించడు. నానీ ఇప్పుడు నడవగలడు తెల్సా? కావాలంటే చూడు.

నిత్యరెండు చేతులతో నాని భుజాలను పట్టిలేపింది.

కష్టమ్మీద లేవగలిగిన నాని తన చేతుల్ని నిత్య భుజాలచుట్టూ వేసి పాదాలమీద నిలబడగలిగాడు. అలా సపోర్టు ఇస్తూనే నానిని నడిపించింది.

"అలా... ఎస్... యూ కెన్ వాక్"

"తడబడుతున్న నాని అడుగులు కొంచెం కొంచెముగా స్థిరత్వాన్ని పొందుతున్నాయ్. తనకు నడక వస్తున్నదన్న ఆనందము కళ్ళల్లో ప్రదర్శిస్తూ చుట్టూవున్న అందరివైపూ చాలా గొప్పగా చూశాడు నాని.

అక్కడ వున్న పసిపిల్ల నుంచి వృద్ధునివరకూ ప్రతి ఒక్కరి లక్ష్యం... అవకాశం వచ్చినప్పుడల్లా నానీని మోటివేట్ చెయ్యడం...

నాని నడకను చూసి ప్రతి ఒక్కరూ సంతోషాన్ని వ్యక్తపరుస్తూ చప్పట్లు చరుస్తుంటే హుషారవుతున్నాడు. ఐతే సపోర్ట్ లేకుండా ఇప్పుడప్పుడే నడవలేడని తెలిసిన నిత్య కొన్ని సంజ్ఞల ద్వారా ఆ విషయాన్ని చంద్రావుకి అర్థమయ్యేలా చెప్పింది.

నిత్య పక్కకి తప్పుకోగానే చంద్రావు తన భుజాలని నానికి ఆసరా ఇచ్చాడు.

"చంద్రావ్... వీలున్నప్పుడల్లా నానిచేత నడక ప్రాక్టీస్ చేయించు..." నొప్పిని భరిస్తూ నడవడానికే మొగ్గుచూపిస్తున్న నానిలోని కమిట్‌మెంట్‌ని చూసి ముచ్చటపడుతోంది నిత్య.

"ఇదుగో పిల్లా ఎలాంటి ప్లాన్ వేసి అబ్బాయిగారిని నడిచేలా చేశావ్?" దగ్గరకు వచ్చి నిత్య భుజంమీద చెయ్యి వేసి ఇటు తిప్పుతూ అంది మూకరత్నం.

"ఇందులో నా గొప్పతనం లేదక్కా... ఇదుగో ఈ అమ్మది. నానికోసం బిడ్డని ప్రమాదం అంచు ఉంచినా గుండెని అరచేతపట్టుకుని ఉగ్గబట్టుకుంది.



## రద్దయింది

'కిర్రిక్ పార్టీ' జంట రష్మికామండన్న, రక్షిత్ శెట్టిలు స్నేహితులయిపోయి మరో అడుగు ముందుకువేసి, పెళ్ళికి రెడీ అనుకున్నారు.

నిర్ణయం నిశ్చితార్థందాకా వచ్చింది.ఐతే వీరి నడుమ ప్రేమకు ఫుల్‌స్టాప్ పెట్టుకున్నారని, నిశ్చితార్థం రద్దయిందని వార్తలు అదేపనిగా వినిపించాయి. దీనిపై రష్మికమాత్రం పెదవి కదపలేదు కాని, ఈ మధ్య ఆమె తల్లి వార్త నిజమేనంటూ నిర్ధారించింది.

పెళ్ళి సమస్యను పక్కనపెడితే, రష్మిక సినిమాలతో బిజీగా 'గీత గోవిందం' సినిమా విజయంతో ఉత్సాహంగా ఉంది.



## ఆదరణకు అనుగుణంగా

పంజాబీలో చేతినిండా సినిమాలతో ఉన్న పాయల్ రాజ్‌పుత్ తెలుగులో మరో సినిమాకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చింది. క్రీడాకారిణి పాత్రలో నటిస్తున్నది. తొలి సినిమాలోని పాత్రకు,దీనికి ఏమాత్రం పొంతన ఉండదంటున్నది.

కబడ్డీ క్రీడాకారిణి పాత్రకోసం ప్రత్యేక శిక్షణ ఆరంభించిందట. పొంతన లేని పాత్రలతో కెరీర్ సాగించాలన్న కోరిక ఉందని, మారే ట్రెండ్స్‌కు, లభించే ఆదరణకు అనుగుణంగా పాత్రలు ఎంపిక చేసుకుంటానని చెపుతోంది పాయల్ రాజ్‌పుత్.

## నొప్పిస్తున్నాయి

కన్నుగీటి కబుర్లలోకి ఎక్కిన ప్రియాప్రకాశ్ వారియర్ 'వింకీ గాళ్'గా భలే ఫేమస్ అయింది. అంత స్పీడ్‌గానూ విమర్శల్ని, వివాదాలనూ ఎదుర్కొంటున్నది.

తను నటించిన తొలి సినిమా ట్రైలర్ విడుదలైనప్పుడు 'ఆహా, ఓహో' అన్నవారంతా సినిమా విడుదలకు ముందే విమర్శలు చేస్తుండడం ప్రియకు బాధగా ఉందట.

సామాజిక మాధ్యమంలో నెటిజన్లు చేసే విమర్శలు తన ఆత్మవిశ్వాసాన్ని దెబ్బతీస్తున్నాయంటూ ప్రియాప్రకాశ్ వారియర్ వాపోతున్నది. సినిమా విడుదలకు ముందే ఇంత సంచలనం సృష్టిస్తుంటే, విడుదలయినతరువాత పరిస్థితి ఏంటో...



## చిటికెలో చేసేశా

తెలుగు భాష, ఇక్కడి వాతావరణం తెగ నచ్చేశాయని అదేపనిగా చెప్పుకుంటూ సంబరపడుతున్నది 'నర్తనశాల' తార కశ్మీర.

'నర్తనశాల' అవకాశం వచ్చినప్పుడు నిర్వహించిన ఆడిషన్లలో నవరసాలూ ఒకేసారి పలికించమన్నారు. చిటికెలో చేసేశాను. అంతే, హీరోయిన్‌ను అయిపోయా.

మాది పూణె. ముంబయిలో డిజైన్ కమ్యూనికేషన్ కోర్సుచేశాను. కమర్షియల్స్ చేశాను.

థియేటర్ అనుభవమూ వుంది. పూణెలో ఉన్నప్పుడు తెలుగు సినిమాలు చూసేదాన్ని. తెలుగు నేర్చుకుంటున్నా" అని తెలిపింది.

ఆ గొప్పతనమంతా ఈమెది" బిడ్డ తల్లి చేతిని అందుకుంటూ ప్రశంసించింది నిత్య.

ఆనందంతో కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ బిడ్డని గుండెలకి హత్తుకుంది ఆమె. అక్కడున్న మిగతావాళ్ళుకూడా బిడ్డ తల్లిని మెచ్చుకున్నారు.

"ఇలా అందరం ఒకే ఆశయముతో పనిచేస్తే మన కల తప్పనిసరిగా దగ్గర్లోనే నిజమవుతుంది..." నిత్య మాట్లాడే ప్రతీ మాటా జీవితంమీదా, భవిష్యత్ మీదా ఆశని కలిగిస్తుంది.

అందుకే ఆమె ఎక్కడుంటే అక్కడ ఆమెచుట్టూ చేరడానికి అక్కడి జనాలు మొగ్గుచూపిస్తుంటారు. నిత్యకు ఏదో ఫోన్ కాల్ రావడంతో ఆమె అక్కడ్నుంచి రూమ్‌లోనికి వెళ్ళినతరువాత మిగతావాళ్ళు తమ పనులమీద అక్కడ్నుంచి కదిలారు.

ఇక మర్నాడు ఉదయాన్నే వీల్ ఛెయిర్‌మీద కాకుండా చందర్రావు సాయంతో నాని చిన్నచిన్న అడుగులేస్తూ బడికి రావడం అందరికీ కూడా ముచ్చట గొలిపింది. మిగతా పిల్లగాళ్ళతో కలిసి బెంచిమీద కూర్చోవడం కూడా ముఖ్యమయిన విశేషమే.

నిన్నటితో పోలిస్తే ఇవాళ బడికి వచ్చిన పిల్లలు ఇరవైమందయ్యారు.

"ఏం చెప్పమంటావు పిల్లా? స్కూల్ అంటే టీచర్ బెత్తం పట్టుకుని కొడుతుందీ, హోమ్‌వర్క్ ఇచ్చి కష్టపెడుతుందన్న నమ్మకాలని నువ్వు తుడిచేశావు. ఆటా, పాటా సరదా, గెలుపూ అంటూ కొత్త పద్ధతిలో నువ్వు చెప్పిన పాఠాలు అందరికీ నచ్చేశాయి.

కొందరు పిల్లకాయలే మేం వస్తామని మారాంచేస్తున్నారు. ఇంకొందరు తల్లులు తమ పిల్లలని నీ దగ్గరకే పంపుతామంటున్నారు. నేనే వద్దని చెప్పి ఆపిస్తున్నా. అసలు ఈ బడి ఉద్దేశ్యం అబ్బాయిగారికోసం. మంది ఎక్కువై పోయి అసలు పని దెబ్బతినకూడదు కదా" అంది నూకరత్నం.

"నువ్వు నన్ను మరీ మోసేస్తున్నావు అక్కోయ్... అప్పటికప్పుడు తోచింది ఏదో చెప్పుకుపోతున్నాను. నేనేం ప్రొఫెషనల్ టీచర్‌ని కాను"



"నాడి పట్టుకుని వైద్యంచేసే డాక్టరు బడి పెట్టుకుని విద్య చెబితే ఇలాగే అదిరిపోతుందన్న మాట" నూకరత్నం వేసిన జోకుకి నవ్వులు పండాయి అక్కడ. ఆ రోజు పెద్దబాలశిక్షలో చాలా పేజీలు కవర్ చెయ్యడమయిపోయినాక ఇంగ్లీష్ క్లాస్ మొదలైంది. నర్సరీ రైమ్స్ అన్నీ గుదిగుచ్చిన ముప్పైనిమిషాల యూ ట్యూబ్ క్లిప్‌ని ల్యాప్‌టాప్‌లో చూపించిందినిత్య. రాగయుక్తంగా, చిన్నగా మూవ్‌మెంట్స్ ఇస్తూసన్నని బ్యాక్‌గ్రౌండ్ స్కోర్ వెనుక ఏబీసీడీలూ, ఇంగ్లీషుపదాలతోపాటు వెరైటీ పాటల్లో చెప్పే అంకెలూ,లెక్కలూ ఆ వీడియో చిన్నారులందరిమీదా చాలా ప్రభావం చూపింది.

వీడియో పూర్తయ్యాక ఒక్కొక్కరూ ముందుకొచ్చి ఒక్కో రైమ్ అదే తరహాలో అదే ట్యూన్‌తో చెప్పాలి. దాంతో పోటీలుపడి పిల్లలు ముందుకు రావడం తమకి గుర్తున్న రైమ్ చెప్పడం, నిత్య నుంచి కాంప్లిమెంట్ తీసుకోవడం... ఈ కాంపిటేషన్‌లో నానికూడా ఉత్సాహంగా పార్టిసిపేట్ చెయ్యడం అందర్నీ ఆనందపరిచిన విషయం.

ఆ రోజు బడి ముగిసేనాటికి నానికి అర్థమయిందేమిటంటే ఈ స్కూల్ ప్రతిరోజూ కొత్తగానే ఉంటుందని, అసలు పగలూ, రాత్రీ బడి ఉండివుంటే బాగుంటుందని. అంతలా బడికి ఎడిక్ట్ అయిపోయాడు.

నానిని సరైన దారిలోనికి మళ్ళించగలిగానని నిత్యకు అవగతమయింది. అంతకుముందు నిర్ణయించుకున్న ప్లాన్ ప్రకారం ఇక స్పీడప్ చెయ్యాలని అనుకుందామె.

రోజులు చాలా వేగంగా గడుస్తున్నాయి. నానిలో శారీరకపరంగా మానసికరీత్యా వస్తున్న మార్పూహించినట్లుగానే ఉండడంతో నిత్య అప్రోచ్‌లో మార్పులేం చెయ్యలేదు. ఇక బడి నడపడాన్ని ఒక గాడిలో పెట్టేసినందున పాఠాలు చెప్పడంలోనూ, క్లాసులను తీసుకోవడంలోనూ రవళి, మంజులల సహకారం తీసుకుంటోంది.

ఇదివరకులా అభిప్రాయ భేదాలు లేనందున, కలుపుకుపోయే మనస్తత్వంతోనే నిత్య ఉన్నందునా అంతా సజావుగానే సాగుతోంది. ఒక్కోసారి మేధావులు పప్పులో కాలేస్తారనే సంశయం రవళికి కల్గుతున్నా పంచవటి జనాలు అందరూ నిత్యని సమర్థిస్తున్నందున తను కూడా ఎలాంటి అరమరికలూ లేకుండానే నడుచుకుంటోంది.

ప్రస్తుతానికి నానిమాత్రమే అందరి ఫోకస్ అయివుండడంచేత భిన్నాభిప్రాయాలకు అవకాశంలేకపోయింది.

నిత్య తన స్ట్రాటజిక్ అప్రోచ్‌తో క్రమంగా చదువుమీద నాని దృష్టి పెరిగేలా చేస్తోంది.

ఒక్కో రోజు ఒక్కో కొత్త విధానంతో క్లాస్ మొదలుపెట్టి నానీకి ఇంట్రెస్ట్ కలిగేలా చేసి క్రమంగా చదువుమీదకు మళ్ళిస్తోంది నిత్య.

**ఇంకా ఉంది**

# హెల్త్ బిట్స్


Courtesy : MAJI SAHELI

## మల్లెల వాసన మేలు

జడలో పూలు తురమటం అనేది భారతీయ మహిళల సాంప్రదాయం. అది అలంకరణలో భాగంకూడా.ఏ ఋతువులో పూసే పూలు ఆ ఋతువులో పెట్టుకుంటారు. కొన్నింటికే మంచి వాసన వుంటుంది. అందులో మల్లెలు ఒకటి.

వేసవి వస్తున్నదంటే ఇక మల్లెల వాసనలు ఇంటి నిండా విస్తరిస్తాయి.దేవుడి పటాలకు మల్లెపూదండలు వేస్తారు. ఇలా మల్లెపూలవాసన ఇంటినిండా వ్యాపించటం ఆ కుటుంబసభ్యులందరికీ మేలుచేస్తుంది. మనసులను ప్రశాంతపరచగలిగిన శక్తి మల్లెలవాసనకుంది. మానసిక ఆందోళనకు గురవుతున్నవారికి 'వేలియమ్' అనే మందును ఇస్తారు.

ఆ మందు ఎటువంటి ప్రభావం మెదడుమీద చూపుతుందో మల్లెపూలవాసన అటువంటి ప్రభావాన్నే చూపుతుంది. మల్లెపూలనుండి వచ్చే వాసన మెదడులోని భావోద్వేగాలను అదుపుచేసే కేంద్రం మీద ప్రభావం చూపుతాయని తేలింది.

మల్లెపూలని అలంకరణ మనవారు చేసేదిఅందుకే. మనసులోని ఇతర అంశాలు మరుగునపడి దంపతులు హాయిగా పడకసుఖం అందుకోగలిగేలా చేసే శక్తి మల్లెపూల వాసనకుంది. ◆

## మీకు తెలుసా

**మా**నసిక సమస్యలకు మూలం కుటుంబ వాతావరణమే. ఏ కుటుంబంలో అయితే భార్యాభర్తలు తరచుగా గొడవపడుతుంటారో, పిల్లలను అతిగా దండిస్తారో, విడాకులు తీసుకుని విడిపోతారో...అటువంటి కుటుంబ వాతావరణంలో పెరిగిన పిల్లలు చదువులో వెనకపడతారు. ఏ అంశంమీదా దృష్టిని కేంద్రీకరించలేరు. చివరికి మానసిక సమస్యల బారినపడి, త్వరగా డిప్రెషన్‌లోకి వెళతారు. ◆

## ఎంతకీ అర్థంచేసుకోలేరు

**భా**ర్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకుని బతకాలి అంటారు పెద్దలు. పెళ్ళికి ముందు ఒకరినొకరు అర్థంచేసుకుని ఆ తర్వాత దంపతులమవుతాం అంటారు నవతరం. పరిశోధనలుమాత్రం భార్యాభర్తల మధ్య 'అర్థం' ఎప్పటికీ అసంపూర్ణమే అంటారు.

ప్రేమికులు, దంపతులు వారి ఇష్టాలు, అయిష్టాలు, ఆలోచనలు వగైరా అంశాలన్నింటిమీద జరిపిన అధ్యయనంలో తన భాగస్వామి గురించి నాకు పూర్తిగా తెలుసు అని అనేది వాస్తవం కాదంటున్నారు. భార్యాభర్తలు ఒకరికొకరు ఎంతకాలం కాపురం చేసినా అర్థంకారరట.

ఎంత తెలుసు అనుకున్నా తెలియని కొత్తకోణం కనిపిస్తూనే వుంటుంది. అవతలివారి ఆలోచనలు, తెలివితేటలు, ఇష్టాలు ఒకప్పుడు చాలా గొప్పగా, ప్రత్యేకంగా కనిపిస్తాయి. అందం కూడా అలాగే కనిపిస్తుంది.

కలిసి జీవించటం మొదలుపెట్టిన తర్వాతగాని అవన్నీ పైపై మెరుగులేనని,తాము ఆశించినవి మరేవీ భాగస్వామిలో లేవని అర్థమవుతుంది.

నిజానికిఎక్కువ కాలం కలిసివుంటే ఈ తేడాలు మరింత ఎక్కువగా వుంటాయి. ఒకరినొకరు అర్థం చేసుకోవటం కామానే కాని ఫుల్‌స్టాప్ కాదు.

**భా**ర్యాభర్తల బంధంలో సమస్యలు అన్నింటికీ మూలం నేను సరైనరీతిలో వున్నాను,అవతలివారిని మార్చాలి అనే ఆలోచన.ఈ ఆలోచనకన్నా అవాస్తవం మరొకటివుండదు.తనకు తాను సరైన బాటలో వున్నాననుకోవటం ఒక తప్పైతే అవతలివారిని నాదారికి తెచ్చుకోవాలనుకోవటం రెండో తప్పు.

ఆ మార్పు తేవాలనే అనవసరపు పట్టుదలకుపోయి జీవితంలో చాలా ముఖ్యమైనవాటిని, ఆనందించే వాటిని చాలా పోగొట్టుకుంటారు. పెళ్ళి తర్వాత వారిలోని అలవాట్లు మార్చగలం అని సంసారంలోకి దిగే వారికి చివరికి మిగిలేది పాట్లు మాత్రమే.

మార్చాలన్న కోరిక, మారటంలేదన్న బాధ కలిసి నిరాశ, నిస్పృహలనే కాదు కోపాన్ని, వ్యతిరేక ఆలోచనలను కూడా పెంచుతాయి.


Courtesy : AROGYA SANJEEVANI

అక్కడినుండి సంసారంలో ఘర్షణ వాతావరణం నెలకొంటుంది. అవతలివారిని మార్చాలనే యత్నం మాని మీలో ఎటువంటి మార్పు తెచ్చుకోవాలో చూసుకోండి అంటుంది ఒక చైనా నానుడి.

నదీ ప్రవాహాన్ని, కొండ రూపాన్ని మార్చగలరేమో గాని మనిషిని మార్చలేరని బోధించి సంసారంలోకి దింపుతారట చైనా పెద్దలు. ◆

## బిగిస్తే అంతే...

**మ**గవాళ్ళు ధరించే అండర్‌వేర్‌కి వాళ్ళు ఉత్పత్తి చేసే వీర్యకణాలకు సంబంధం వుంది.మన దేశంలో బిగుతుగా వుండే లోదుస్తులు ధరించే అలవాటు ఉండేది కాదు. వృషణాలకు తగినంత గాలి తగలాలన్నది మన పెద్దలమాట.ఇది ఉష్ణదేశ పద్ధతి.

చలిదేశాలలో బిగుతుగా వుండే డ్రాయర్లు ధరిస్తారు. వారి వృషణాలకు వేడి అవసరం. పురుషులలో శుక్రకణాల ఉత్పత్తి వృషణాలలో జరుగుతుంది.స్ఖలించే సమయంలోనే లోపలికి వెళ్ళి పురుషాంగంద్వారా బయటకు వస్తాయి. అవి ఉత్పత్తి అవటానికి సరైన ఉష్ణోగ్రత అవసరం.

ఆ ఉష్ణోగ్రత పరిమితి దాటితే శుక్రకణాల ఉత్పత్తిలో తేడా వస్తుంది. తండ్రి కాలేకపోతున్నవారి మీద చేసిన అధ్యయనంలో సమస్య పురుషులు


Courtesy : HEALTH

వాడుతున్న అండర్‌వేర్‌లో వుందని తేలింది.బిగుతైన అండర్‌వేర్స్‌వల్ల వారు ఉత్పత్తిచేస్తున్న శుక్రకణాల నాణ్యత, సంఖ్య బాగా పడిపోయింది. వారి రక్తంలో ఫాలికిల్ స్టిమ్యులేటింగ్ హార్మోన్ (ఎఫ్.ఎస్.హెచ్.) 14 శాతం తక్కువగా వుంటున్నది. ఈ హార్మోన్ శుక్రకణాల ఉత్పత్తిలో పాత్ర పోషిస్తుంది. ◆

# కదిలే బొమ్మల కబుర్లు

## నిర్భీతిగా నిర్ణయాలు

కలల ప్రపంచంలో విహరిస్తున్నా కఠినమైన వాస్తవాలను ఒప్పుకోవడంలో రకుల్ ప్రీత్‌సింగ్ ముందుంటుంది.

"నేటి గ్లామర్ రేపు ఉండకపోవచ్చు. పరుగు ఎప్పుడు ఆపాలో బాగా తెలిసివుండాలి. నిష్క్రమించే దశ వచ్చినప్పుడు నిర్భీతిగా నిర్ణయాలు తీసుకోవాలి. ఇప్పుడున్న అవకాశాలు తర్వాత లేకపోతే అదేంటి నన్ను నిర్లక్ష్యం చేస్తున్నారేంటి అనుకోకూడదు. 'నిన్నుచూడడం ఇక చాలు' అని ప్రేక్షకులు అనుకున్నారంటే ఈ పరిశ్రమకు దూరమైపోతా" అని చెప్పింది. ◆

Review

## శైలజారెడ్డి అల్లుడు

### ఈ 'అల్లుడు' బాగా వీక్

ఈ వారం విడుదలైన 'శైలనారెడ్డి అల్లుడు' సినిమా దర్శకుడిగా మారుతి ఇప్పటికే ఒకటికి రెండుసార్లు ప్రూవ్ చేసుకునివుండొచ్చు. కానీ ఆయనకు పట్టువున్న జోనర్లు కొన్నే.

సన్నివేశాల్లో కామెడీ పుట్టించమంటే ఆయన ఏమైనా కాస్త కష్టపడతారేమో, సినిమాకు ఓ ఐడియా చెప్పమంటే, ట్రయ్ చేస్తారేమో? కానీ అదే, ఓ పక్కాగా కొత్త ఐడియావేసి, మాంచి వెరైటీ సబ్జెక్ట్ తయారు చేయమంటేమాత్రం కాస్త తడబడతారేమో అన్న అనుమానం కలిగిస్తుంది 'శైలజారెడ్డి అల్లుడు' సినిమా.

ఎందుకంటే 'శైలజా రెడ్డి' సినిమా అచ్చంగా ఉడికీ ఉడకని అన్నంలా, పక్వానికి రాని పాకంలా వుంటుంది తప్ప పరిపక్వమైన ఆహారంగా మాత్రం కాదు.

ఇంతకూ ఈ 'శైలజారెడ్డి అల్లుడు' ఎవరు? అతగాడి కథాకమామిషు ఏమిటి? బలుపు ఎక్కువైన బిజినెస్‌మేన్ (మురళీశర్మ) కొడుకు చైతన్య (నాగ్ చైతన్య). ఇతగాడికి ఎంత బలుపు అంటే కూతురు పెళ్ళి చెడగొట్టుకుంటాడు అల్లుడి కాళ్ళు కడగనుకాక

Review

## U TURN

### ఇది కదా థ్రిల్లర్ అంటే...

సినిమా ప్రేక్షకుల్లో ఓ ప్రత్యేకమైన తరగతి జనాలు వుంటారు. వీళ్ళు థ్రిల్లర్లు, హార్రర్, పరిశోధన సినిమాలు అంటే చాలు స్క్రీన్‌కు కళ్ళు అప్పగించేస్తారు. ఈ బాపతు జనాలు సరైన థ్రిల్లర్ సినిమాలు ఎప్పుడు వస్తాయా అని ఎదురుచూస్తుంటారు.

అలాంటి వారికి మృష్టాన్న భోజనంలాంటి సినిమా ఒకటి వచ్చింది ఈ వారం. అదే 'యు టర్న్'. సమంత, ఆది పినిశెట్టి, రాహుల్ రవీంద్రన్ మెయిన్ లీడ్‌గా నటించిన సినిమా. పక్కా పైసా వసూల్ థ్రిల్లర్ ఇది.

వాస్తవానికి ఈ క్రెడిట్ తెలుగు మేకర్లకు కాదు. ఈ సినిమా కన్నడ సినిమా.



అక్కడ విడుదలై అద్భుత విజయం సాధించింది. దాన్ని అదే డైరెక్టర్ పవన్‌కుమార్‌తో తెలుగులో రీమేక్ చేశారు. సాధారణంగా ఇలా రీమేక్ చేసినప్పుడు కొత్తగా ఈ సినిమాలో చేరే స్టార్‌కాస్ట్ కారణంగా కానీ లేదా నిర్మాతలు ఇక్కడ ప్రేక్షకుల అభిరుచి అనే వంకతో కానీ మార్పులుచేర్పులు చేస్తుంటారు.

ఆ కారణంగా కావచ్చు, ప్రేక్షకుల అభిరుచిలో తేడావల్ల కావచ్చు, మాతృకలో హిట్ అయిన రేంజ్‌లో రీమేక్‌లు విజయం సాధించడం అరుదు. కానీ 'యు టర్న్' విషయంలో ఇవన్నీ పక్కకు పోయాయి.

కన్నడలో ఎంత హిట్ అయిందో... అంతకు అంతా తెలుగులో కూడా పాయింట్లు సాధించేసే అవకాశం క్లియర్‌గా కనిపించింది. దానికి కారణం మాతృకను చెడగొట్టకపోగా, క్లైమాక్స్‌ను కాస్త ఇంప్రూ




కడగను అని. అలాంటివాడి కొడుకు చైతన్య పోయి పోయి అను (అనుఇమ్మానుయేల్)ను ప్రేమిస్తాడు. ఈమెకు వీర ఇగో. తను ప్రేమించినవాడైనా సరే, ముందు అతగాడే తనకు ప్రపోజ్ చేయాలనే టైపు.

ఆమె తల్లి శైలజా రెడ్డి (రమ్యకృష్ణ). ఈమె అణువణువునా పంతం నింపుకున్న వీర ఫెమినిస్ట్. కూతురు తను కోరిన చదువు చదవలేదు అని మాట్లాడడమే మానేస్తుంది. ఇలా బలుపు, ఇగో, పంతంతో వున్న మూడు క్యారెక్టర్ల మధ్య చైతన్య అనే కుర్రాడు ఎలా నలిగాడు అన్నది సినిమా.

'శైలజారెడ్డి అల్లుడు' సినిమా ప్రధాన సమస్య ఏమిటంటే, బలుపు, ఇగో, పంతం, పొగరు. ఇలాంటి క్వాలిటీలు అన్నింటినీ ఇగో అనే ఒకటే ఒక క్వాలిటీగా జమకట్టేశాడు దర్శకుడు మారుతి. అక్కడే బేసిక్‌గా అసలు తేడా వచ్చింది.

పైగా సినిమా ప్రారంభంలో తండ్రి పాత్ర బలుపును ఎలివేట్ చేస్తూ ఓ మాంచి సీన్ రాసుకున్న దర్శకుడు, మిగిలిన తల్లీ కూతుళ్ళ క్యారెక్టర్లను సక్రమంగా ఎలివేట్‌చేసే సీన్లు రాసుకోలేకపోయాడు.

సినిమా ఎత్తుగడవరకు ఓకె కానీ, హీరోయిన్‌ను ప్రేమలో దింపడానికి హీరో ప్రయత్నాలు మొదలైన దగ్గరనుంచి సినిమా కిందకు జారుతూ వస్తుంది. కొత్తదనం కనిపించదు.

ఇలాంటి టైమ్‌లో ఇంటర్వెల్ బ్యాంగ్ రావడం, రమ్యకృష్ణ పాత్ర ఎంట్రీ ఇవ్వడంతో సినిమా సరైన దారిలో పడుతోందన్న ఫీల్ కలుగుతుంది. తీరా విశ్రాంతి తరువాత సినిమా ప్రారంభమైన కొద్దిసేపటికే నిరాశాజనకంగా నడవడం ప్రారంభమవుతుంది.

ఇక్కడ ఒక్కసారైనా సీన్ రాసుకోవడం అన్నది దర్శకుడు మారుతికి కుదరలేదు. ముఖ్యంగా ఇక్కడ సమస్య ఏమిటంటే, తల్లీ కూతుళ్ళ పంతాలు. అదే సమయంలో అనుబంధాలు కలిపి ఆకట్టుకునేలా సీన్లు రాసుకోవాలి. అదే సమయంలో సినిమాలో ఫన్ మిస్‌కాకూడదు. ఇదెలాగ అన్నది దర్శకుడికి అంతు పట్టినట్లు లేదు. దాంతో రెండు రకాలు కలగాపుల గంగా మిక్స్ చేశాడు. అది వికటించింది. ఇటు కామెడీ పండలేదు. అటు ఎమోషన్లు రిజిస్టర్ కాలేదు.

దానికితోడు సినిమా దిశ ఏమిటి? దర్శకుడు ఏ విధంగా సమస్యను ఓ కొలిక్కి తెచ్చి మంచి ముగింపు ఇవ్వాలనుకుంటున్నాడు అన్నది క్లారిటీ లేకపోయింది, దాంతో కథను దాని మానాన దాన్ని కళ్ళెంలేని గుర్రంలా వదిలేశారు. దాంతో జనాలకు సినిమా ఎప్పుడు అయిపోతుందా? అన్న ప్రశ్న మెదలడం స్టార్ట్ అవుతుంది.

ఇలాంటి సినిమాలో ఏ నటీనటులకు సంతృప్తికరమైన నటనకు అవకాశం దొరకలేదు. రమ్యకృష్ణ, అను ఇమ్మానుయేల్‌కు కాస్త బెటర్. చైతన్యకు కొంచెం ఛాన్స్ వుంది. కానీ ముగ్గురూ అద్భుతమైన పెర్‌ఫార్మెన్స్ ఇచ్చిన దాఖలా కనిపించదు. కొంతమంది నటులకు ఒకటో, రెండో డైలాగులు వుంటే మరి కొంతమందికి ఆ అవకాశం కూడా వుండదు.

ప్లస్‌పాయింట్స్...
వెదికినా కనపడవు

మైనస్‌పాయింట్స్...
వెదకాల్సిన ప్రయాసలేదు

పంచ్‌లైన్
'ఈగో'ల గోల ◆

వైజ్ చేయడమే.

'యు టర్న్'లో కథకు కేవలం చిన్న పాయింట్ ఆధారం. సాధారణంగా పట్టణాల్లో డివైడర్లు పర్మినెంట్‌గా వుంటాయి. కొన్ని చోట్ల సిమెంట్ బ్లాక్‌లు పెడుతుంటారు.

చుట్టూ తిరిగి 'యు టర్న్' తీసుకోవడానికి బద్ధకించే వాళ్ళు కొందరు ఆ బ్లాక్‌లు అటూ ఇటూ జరిపి, తమ దోవన తాము వెళ్ళిపోతుంటారు. కానీ వారు చేసిన పని కారణంగా వేరెవరో ప్రమాదాలబారిన పడతారు. ఈ పాయింట్‌ను బేస్ చేసుకుని అల్లుకున్న కథే 'యు టర్న్'. ఇలాంటి సినిమాలకు ఇంతకన్నా వివరంగా కథ చెప్పడం అనవసరం.

అయితే కథ టైటిల్ 'యు టర్న్' అనడాన్ని మ్యాచ్ చేసుకునేలా క్లైమాక్స్‌ను కూడా డిజైన్ చేయడం, దానికి కాస్త ఫిలాసఫీ అద్దుకోవడం మాత్రం చెప్పక తప్పాల్సిన పాయింట్లు. 'యు టర్న్' సినిమా టైటిల్స్ స్టార్ట్ అయినదగ్గరనుంచి ఎండ్ టైటిల్స్ పడేవరకు ప్రేక్షకుడికి టైమ్ అన్నది తెలియదు. సినిమా మొత్తంమీద ఒక్కపాట లేదు. కనీసం మాంటేజ్ సాంగ్‌కూడా.

కామెడీ అన్నది కనిపించదు. జోక్‌లు వినిపించవు. సినిమాలో ఏ సీన్ ఎంత వుండాలో? ఏ పాత్ర ఏ మేరకు వుండాలో? ఏ సంభాషణ ఎంత వుండాలో? పక్కా కొలతలు తీసి అల్లుకున్నట్లు వుంటాయి. అదే సమయంలో సినిమా టేకింగ్‌లోనూ దర్శకుడి ప్రతిభ కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

సన్నివేశాలు తీయడంలో తీసుకున్న జాగ్రత్త అడుగు అడుగునా క్లియర్‌గా తెలుస్తుంది. ఇటు పత్రికా ఆఫీసు అయినా, అటు పోలీస్‌స్టేషన్ అయినా డిటైలింగ్ అన్నది అస్సలు మిస్ కాడు దర్శకుడు.

కానీ అలా అని చాదస్తంగా, స్లో టేకింగ్ లేదా స్లో నెరేషన్‌లా అనిపించదు. పైగా ప్రేక్షకుడికి ఆ డిటైల్డ్ నెరేషన్ అన్నది భలే మంచి అనుభూతిని ఇస్తుంది. పైగా కథనం సినిమాలో ఫలానా పాయింట్ కీలకం అని తడుతూనే వుంటుంది.

కానీ చివరి ఇరవై నిమిషాలవరకు ఆ పాయింట్‌ను తెరమీదకు తీసుకురాడు. అయినా ప్రేక్షకుడు ఉత్కంఠతో అప్పటివరకు ఎదురుచూస్తూనే వుంటాడు. అంత గ్రిప్పింగ్‌గా వుంటుంది 'యు టర్న్' సినిమా నెరేషన్. అసలు సినిమా మొదలుపెట్టడమే ఏదో అలా అలా సాదాసీదాగా మొదలుపెడతాడు.

ఏదో జరుగుతోంది... జరుగుతుంది అనుకుంటూ ప్రేక్షకుడు, ఆ సమయంకోసం ఎదురుచూస్తుంటే, వున్నట్లుండి కథ పోలీస్‌స్టేషన్‌కు వెళ్తుంది. తాను ఒకటి అనుకుంటే ఇదేమిటీ? అనే అబ్బురంతోనే ప్రేక్షకుడు కథను ఫాలో అయిపోతాడు.

పోలీసులు, ఇన్వెస్టిగేషన్, ఇలా ఒకదానికి ఒకటి లింక్‌అవుతూ కథ, ప్రేక్షకుడు ముందే అనుకునే పాయింట్‌కు చేరుకుంటుంది.

'యు టర్న్' సినిమా థ్రిల్లర్ ప్రియులకు అద్భుతంగా నచ్చడానికి ఒక్క రీజన్ అని అనడం సరి కాదు. దర్శకుడి ప్రతిభ, నటీనటుల దగ్గరనుంచి రాబట్టుకున్న నటన, అంతకుమించి సాంకేతిక విలువలు ఇలా అన్నీ కలిసివచ్చాయి.

సినిమాటోగ్రఫీ అద్భుతంగా వుంది. రీరికార్డింగ్ సినిమాకు పెద్ద అయువుపట్టు. ముఖ్యంగా కీలక సన్నివేశాల్లో నేపథ్యసంగీతం చాలా బాగుంది.

సాధారణంగా హర్రర్ సీన్లలో లౌడ్ సౌండ్ వినిపించడం అన్నది మామూలే. కానీ మంద్రస్థాయిలో వినిపిస్తూ, శభాష్ అనిపించుకున్నాడు సంగీత దర్శకుడు పూర్ణచంద్ర. కీలకపాత్రలో సమంత తన అనుభవం అంతా రంగరించి నటించేసింది.

ఆది పినిశెట్టి పోలీస్ అధికారిగా పెర్‌ఫెక్ట్ నటన అందించాడు. రాహుల్ రవీంద్రన్‌ది కాస్త చిన్నపాత్రే. మొత్తంగా ఒక్కమాటలో చెప్పాలంటే, థ్రిల్లర్ అభిమానులు తప్పనిసరిగా, సినిమా అభిమానులు వీలైతే ఓసారి చూడాల్సిన సినిమా 'యు టర్న్'.

ప్లస్‌పాయింట్స్...
కథ, కథనం, చిత్రీకరణ, నేపథ్య సంగీతం

మైనస్‌పాయింట్స్...
పెద్దగా ఏమీ లేవు

పంచ్‌లైన్
రైట్ టర్న్ ◆

Review

# జనతా HOTEL




## హోటలు పక్కకెళ్ళద్దురో...

కొన్ని సినిమాలు భలే చిత్రంగా వుంటాయి. మంచిగా వుంటాయి. మంచిగా అనిపిస్తాయి. కానీ చూడడానికి మాత్రం ఇబ్బందిగా వుంటుంది. వీటిని అవార్డుల సినిమాలు అనాలో? లేక రాంగ్ అటెంప్ట్ విత్ రైట్ సబ్జెక్ట్ అనాలో... ఇంకేం అనాలో? ఈ వారం విడుదల అయిన 'జనతా హోటల్' సినిమా ఇలాగే వుంటుంది.

వాస్తవానికి ఈ సినిమా ఇప్పటిది కాదు. ఆరేళ్ళ కిందటిది. 2012లో మలయాళంలో తయారైన ఉస్తాద్ హోటల్‌ను ఇప్పుడు తెలుగులోకి డబ్ చేశారు. దుల్కర్ సల్మాన్, నిత్యామీనన్, తిలకన్ కీలకపాత్రలు ఈ సినిమాలో.

వంటవాళ్ళ కుటుంబంనుంచి వచ్చి పైకి ఎదిగిన వ్యక్తి తన కొడుకు కూడా మాంచి బిజినెస్‌మేన్ కావాలనుకుంటాడు. కానీ ఆ కుర్రాడు స్టార్ హోటల్ వంటగాడు కావాలనుకుంటాడు.

ఈ ఎదిగే క్రమంలో పదుగురికి వండిపెట్టడమే కాదు, తిండి పెట్టడంకూడా ముఖ్యం అన్న మెసేజ్‌ను అండర్ కరెంట్ చేర్చి తీసిన సినిమా 'జనతా హోటల్'.

తండ్రి అభీష్టానికి వ్యతిరేకంగా చెఫ్ కోర్స్ చదివి, విదేశాల్లోని స్టార్ హోటల్లో చెఫ్ కావాలనుకుంటాడు ఫైజ్/ఫెయిజీ (దుల్కర్ సల్మాన్) కానీ తండ్రి ఒప్పుకోకుండా, పాస్‌పోర్టుతీసి దాచేస్తాడు. దాంతో ఓ బీచ్‌లో చిన్న రెస్టారెంట్ నడిపే తాత (తిలకన్) దగ్గరకు వెళ్ళిపోతాడు.

తాత సాయంతో ఓ స్టార్ హోటల్‌లో చెఫ్‌గా చేరతాడు. షహానా (నిత్యామీనన్) అనే అమ్మాయిని ప్రేమిస్తాడు.

అలాంటి టైమ్‌లో అనేక మలుపులు తరువాత విదేశాల్లో మంచి అవకాశం వస్తుంది. కానీ తాత ఓసారి మధురై వెళ్ళి తన మిత్రుడు నారాయణ్ కృష్ణన్ (జయప్రకాష్) కలిసి రమ్మంటాడు.

నారాయణ్ కృష్ణన్ తాజ్ హోటల్‌లో చెఫ్‌గా పని చేసి, అనాథలకు తిండిపెట్టడంకోసం ఉద్యోగం వదిలేసి, నిత్యం అనాథలకే అంకితం అయిపోయిన వ్యక్తి. అక్కడకు వెళ్ళిన ఫైజ్, వండిపెట్టడంమాత్రమే కాదు, తిండిపెట్టడంకూడా ముఖ్యమని గమనించి, విదేశాలకు వెళ్ళకుండా వుండిపోతాడు. అదీ కథ.

సినిమాలో ఎక్కడినుంచో ప్రారంభమై, ఎక్కడికో చేరుతుంది. దర్శకుడు తాను అనుకున్న విజన్ ప్రకారం ఈ సినిమాను ప్రెజెంట్ చేస్తాడు. కానీ అదంతా అనవసరం అనిపిస్తుంది.

హీరో నలుగురు ఆడపిల్లల తరువాత పుట్టడం, తల్లి పోవడం, అక్కలే పెంచడం, ఆపైన చెఫ్ కావాలనుకోవడం. ఈ సోది అంతా అవసరమా అనిపిస్తుంది సినిమా చూశాక. నేరుగా హీరోగానే పరిచయం చేసినా, కథ ఔచిత్యానికి తేడా ఏమీ వుండదు.

వంట చేయడం అనే గతం తండ్రికి నచ్చదు అనేది ఒక్క సీన్‌లో చూపించేస్తే సరిపోతుంది. దీని వల్ల కనీసం ఇరవై నిమిషాలు సేవ్ అవుతాయి. అంతేకాదు, రోడ్ రోలర్‌కు కట్టి లాగినట్లు కదిలే వ్యవహారం నుంచి ప్రేక్షకుడికి రిలీఫ్ వస్తుంది.

సరే సినిమా గాడిలోకి పడినతరువాత అంత చకచకా ఏమీ కదలదు.

తాత హోటల్‌లో హీరో అప్రెంటీస్ వ్యవహారాలు ఇన్నీ అన్నీ కాదు. ఇవన్నీ చూస్తే అసలు దర్శకుడు అన్వర్ రషీద్ ఏం చెప్పదలుచుకున్నాడు?

ఓ చెఫ్ బయోగ్రఫీ తీద్దామని అనుకుంటున్నాడా? అన్న అనుమానం కలుగుతుంది. మధ్య మధ్యలో హీరోయిన్‌తో లవ్ ట్రాక్ కాస్త రిలీవ్. స్టార్ హోటల్‌లో చెఫ్‌గా చేరినతరువాత తీసినసన్నివేశాలు కూడా ఆకట్టుకోవు.

ఇలా ఎక్కడికక్కడ అన్నీ ఆఫ్ బీట్ వ్యవహారాల్లా, అవార్డు చిత్రీకరణలా కనిపిస్తుంది తప్ప వేరు కాదు. చివరకు కథను మధురై, అనాథల సేవకుడిగా మారిన చెఫ్ రామకృష్ణన్ దగ్గరకు చేర్చినప్పుడు దర్శకుడి టార్గెట్‌మీద అనుమానం కలుగుతుంది.

ఎక్కడినుంచి ఎక్కడకు తీసుకెళ్ళాడు. ఏం చెప్పాలని డిసైడ్ అయ్యి, ఎక్కడినుంచి మొదలు పెట్టాడు అని చిన్న విసుగు వస్తుంది.

పోనీ ఆ చెప్పడం కూడా ఏమైనా ఆసక్తికరంగా వుంటుందా? అంటే అదీకాదు. టోటల్‌గా మంచి పాయింట్, మంచి ప్రయత్నం ఈ విధంగా వృధా అయిందనిపిస్తుంది.

సినిమాలో హీరో దుల్కర్‌ది ప్రధాన పాత్రే కానీ చేయడానికి పెద్దగా ఏమీ వుండదు. అందువల్ల ఏదో అలా అలా చేసుకుంటూపోయినట్లు అనిపిస్తుందితప్ప వేరుకాదు.

తిలకన్ (ఈయన మంచి నటుడు 2012లో మరణించాడు)కు మంచి పాత్ర లభించింది. ఆయన ఎప్పటిలా బాగా చేశాడు.

నిత్యామీనన్ ఓకె. సాంకేతిక విలువలు కూడా ఏమంత అద్భుతంగా లేవు.

సంభాషణలు ఓకె. నేపథ్య సంగీతం (గోపీ సుందర్) ఓ పాట బాగున్నాయి. అంతకుమించి చెప్పుకోవడానికి ఏమీలేదు. దుల్కర్ సల్మాన్, నిత్యామీనన్ జోడీ అని చూసి, తెలుగులోకి డబ్ చేసినట్లున్నారుతప్ప, డబ్ చేయాల్సినంత విషయం లేదు ఈ 'జనతా హోటల్'కు.

**ప్లస్‌పాయింట్స్...**
స్టార్ కాస్ట్

**మైనస్‌పాయింట్స్...**
నత్తనడక నెరేషన్

**పంచ్‌లైన్**
జనం లేని హోటల్

### ఎలా ఆడుతున్నాయి?

- 'గీతగోవిందం' హవా తగ్గినా, షేర్ వసూలు మాత్రం ఆగలేదు. ఒక్క నైజాం ఏరియాలోనే 20 కోట్ల షేర్‌కు దగ్గరగా చేరుకుంది. వరల్డ్ వైడ్ షేర్ 60 కోట్లు దాటేసింది.
- 'గీతగోవిందం' తరువాత ఆ రేంజ్ హిట్ సంగతి అలావుంచితే ఓ మాదిరి హిట్‌కూడా నాలుగు వారాల్లో విడుదలైన ఏ సినిమా కూడా సాధించలేదు. 'కేరాఫ్ కంచరపాలెం' సినిమాకు అంత హడావుడి అయితే జరిగింది. కానీ, తొలి మూడురోజులు కాగానే ఎందుకనో చప్పున చప్పబడిపోయాయి కలెక్షన్లు.
- 'సిల్లీ ఫెలోస్', 'పేపర్ బాయ్' కాస్త గౌరవప్రదమైన కలెక్షన్లు దక్కించుకున్నాయి. మిగిలినవాటి గురించి పెద్దగాచెప్పుకోవడానికి ఏమీలేదు. ◆

# చివరి రోజుల్లో...

**మోషె దయాన్ క్రూరుడు, ఒంటికన్ను రాక్షసుడు అన్నది పాలస్తీనా వారి విమర్శ. ఆ పొగడ్త, విమర్శ రెండూ సబబే. తన దేశ రక్షణకోసం ఎంతకైనా తెగించగలడు, ఎంత క్రూరంగా అయినా శత్రువులను హింసించగలడు. యూదులకోసం ఏర్పడిన ఆ దేశంకోసం తపనపడిన మోషె దయాన్‌కి యూదు మతం మీదే కాదు, అసలు దేవునిమీదే నమ్మకం లేని నాస్తికుడు.**

ఇజ్రాయిల్ ఒక చిన్న దేశం. అదికూడా రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఐక్యరాజ్యసమితి తీర్మానం ద్వారా అమెరికా, బ్రిటన్, సోవియట్‌వంటి మిత్రపక్షాలన్నీ కలిసి సహకారం అందించి పాలస్తీనాలోని కొంత భాగం వేరుచేసి ఇది యూదుల దేశం అంటూ నిర్మించినది ఇజ్రాయిల్.

ఆ దేశపు సైనిక అధికారిగా, ఆ దేశం గర్వపడేలా గొప్ప యుద్ధ విజయాలను అందించినవాడు మోషె దయాన్.మోషెదయాన్ అంటే యుద్ధతంత్రం బాగా తెలిసినవాడన్నది ఒకనాడు ఇజ్రాయిల్ పొగడ్త.

మోషెదయాన్ క్రూరుడు, వంటికన్ను రాక్షసుడు అన్నది పాలస్తీనా వారి విమర్శ. ఆ పొగడ్త, విమర్శ రెండూ సబబే. తన దేశ రక్షణకోసం ఎంతకైనా తెగించగలడు, ఎంత క్రూరంగా అయినా శత్రువులను హింసించగలడు.

యుద్ధంలో ఒక కన్ను కోల్పోయాడు. అయినా అతనిలో పోరాటపటిమ తగ్గలేదు. ఒక కన్నుమీద నల్లటితోలుముక్క అక్కడున్న కంటి రంధ్రాన్ని కప్పి ఉంచుతుంది. అటువంటి వైఫల్యం వచ్చిన తర్వాత అటువంటివారికి సరైన సహకారం లభించటం కష్టమే. కాని ఇజ్రాయిల్ దేశానికి అతడు రక్షణమంత్రి అయ్యాడు. యుద్ధాలను నడిపించాడు.

**మోషెదయాన్ పుట్టింది ఉక్రెయిన్ దేశంలోని యూదు కుటుంబంలో. ఆ కుటుంబం మొత్తం 1921లో ఇజ్రాయిల్ ప్రాంతంలోకి వచ్చారు. అప్పటికి అతని వయసు ఆరేళ్ళు.పాలస్తీనీయుల దాడిలో ఒక బంధువు,మిత్రుని కోల్పోవటం చూశాడు. 14వ ఏట యూదుల రక్షణదళంలో చేరాడు.**

రాత్రిపూట పనిచేస్తూ, గెరిల్లా యుద్ధ కదలికలను కనిపెడుతూ యూదు కుటుంబాలను రక్షించేవాడు. క్రమంగా ఒక పోలీసు బృందానికి నాయకత్వం వహించాడు. 26వ ఏట యుద్ధరంగంలో కన్ను పోయింది. కృత్రిమ కన్ను అమర్చేందుకుకూడా వీలు లేనంతగా కన్ను దెబ్బతింది.

ఇక ఆ తర్వాత కోలుకుని తిరిగి యుద్ధం చెయ్యటమే మోషెదయాన్ జీవితపు గొప్పతనం. ఇజ్రాయిల్ 1948లో ఏర్పడింది. ఇక మోషె దయాన్ సేవలు ఆ దేశానికి విశేషంగా ఉపయోగపడ్డాయి.



మోషె దయాన్
(1915-1981)

ప్రతి యుద్ధంలో దాదాపు ఇజ్రాయిల్‌దే విజయం. ఐదేళ్ళు తిరగకుండానే సైనికదళాల ప్రధానాధికారి అయ్యాడు. సూయజ్ కెనాల్ సంక్షోభ సమయంలో, ఏడురోజుల్లో అరబ్బు దేశాలను ఓడించిన 1967 యుద్ధంలో మోషె దయాన్‌దే కీలకపాత్ర.

కాని ఆ తర్వాత 1973 యుద్ధంలో మోషెదయాన్ చేసిన ఎత్తుగడల తప్పులు ఓటమిని తేలేదు కాని ఇజ్రాయిల్ ఇమేజ్‌ని దెబ్బతీసింది.

ఆ యుద్ధంలో తగిలిన దెబ్బ మోషె దయాన్‌ని డిప్రెషన్‌కి గురిచేసింది. యుద్ధంలో గెలిచినప్పుడు కూడా డిప్రెషన్‌లోకి వెళ్ళేవాడట.

యుద్ధం అనగానే రెచ్చిపోయి, ఆవేశంలో అవతలి వారిని చీల్చి చెండాడి, యుద్ధం అవగానే అక్కడి నష్టాలు చూసి కుంగిపోయే మనస్తత్వం. ఐతే 1973 యుద్ధం దెబ్బనుండిమాత్రం కోలుకోలేకపోయాడు.

**అతనితో 36 ఏళ్ళు కాపురంచేసిన భార్య విడాకులు తీసుకుని వెళ్ళిపోవటం జత అయింది. తనకు తిరుగులేదనే ధోరణి వున్న మోషె దయాన్‌కి అదొక పెద్ద దెబ్బ. మోషె దయాన్ ఎంతో వికారంగా కనిపించినా అతన్ని ఇష్టపడే ఆడవారు ఎంతోమంది వుండేవారు. అతని వివాహేతర సంబంధాలు అనేకం.**

అవన్నీ అందరికీ తెలిసినవే. అయితే వారి సంసారాలను ఎందుకు పాడుచేయాలి అంటూ విడాకులు తీసుకున్న ఒక ఒంటరి మహిళను 1976లో పెళ్ళాడాడు. ఆ వివాహానికి దయాన్‌కు ఇద్దరు పిల్లలు.

ఆయన వివాహం చేసుకుంటున్నా ఆమె పిల్లలు గాని రాలేదు. వారిద్దరూ కలిసి మతం ప్రకారం నిర్వహించాల్సిన క్రతువుకు కనీసం పదిమంది సాక్షిగా నిలవాలి. ఆ పదిమందిని సేకరించుకునేందుకు నానా తంటాలూ పడాల్సివచ్చింది.

అదే జీవితం... ఎప్పుడు ఏమవుతుందో జీవితం కదా అంటూ నవ్వుతూ, జోక్‌లేస్తూ సరికొత్త వైవాహిక జీవితంలోకి అడుగుపెట్టాడు.

మోషె దయాన్ జీవితం చిత్రమైనది. అతని పోరాటం అంతా యూదుల దేశానికి అంకితం. యూదులకోసం ఏర్పడిన ఆ దేశంకోసం తపనపడిన మోషెదయాన్‌కి యూదుమతం మీదే కాదు, అసలు దేవునిమీదే నమ్మకం లేని నాస్తికుడు.

అందుకే రెండవ పెళ్ళిచేయించేందుకు మత పెద్దలు ముందుకు రాలేదు.

అయితే దానిని అతడు అంతగా పట్టించుకోలేదు. క్రమంగా వెనక్కి తగ్గాల్సివచ్చింది.

**అయినా ప్రజల అభిమానంతో పార్లమెంట్‌కి ఎన్నికైనా, విదేశీమంత్రిగా నియమించబడినా మోషె దయాన్‌లో మునుపటి ఉత్సాహం లేదు. ఒకనాటి పౌరుషం కరువైంది. పైగా పాలస్తీనాతో శాంతిచర్చలు జరుగుతుంటే అందులో భాగం అయ్యాడు.**

ఆనాటి శాంతి ఒప్పందం ముసాయిదా రూపకల్పనలో కీలకపాత్ర పోషించాడు. ఆ ఒప్పందంతో నాటి ఇజ్రాయిల్ ప్రధానికి నోబెల్ శాంతి బహుమతి లభించింది. కాని ప్రజల దృష్టిలో ఒకనాటి యుద్ధ వీరుడు ఇప్పుడు తెల్లజెండా పట్టుకుని పాలస్తీనా ముందు లొంగిపోయిన పిరికివాడు అయ్యాడు.

రాజకీయంగా తగిలిన ఈ దెబ్బ మోషెదయాన్‌ని మరింత డిప్రెషన్‌లోకి నెట్టింది. కొంతకాలం ఎటూ కనపడలేదు. నాటివరకు ఆదరించిన రాజకీయ పార్టీ కూటమిలో నుండి బహిష్కరించారు. అవన్నీ ఆయన ఆరోగ్యాన్ని దెబ్బతీశాయి.

**దేశాన్ని శాంతిబాటలోకి తీసుకువెళ్ళిన మోషె దయాన్‌కి క్యాన్సర్ సోకిందని తెలిసినా అంతగా స్పందించినవారు లేదు. జీర్ణనాళపు చివరిభాగంలో క్యాన్సర్ వుందని తేలింది.**

మోషెదయాన్ మెదడు మాత్రం అత్యంత చురుకైనది. ఎన్నెన్నో కొత్త ఆలోచనలు చేసేవాడు. కాని వాటిని వినేవారు, ఆదరించేవారు లేరు. అలాగే స్నేహితులు కరువయ్యారు.

భార్య తప్పించి మరెవరితో మాట్లాడే అవకాశంలేని వాతావరణంలో దాదాపు సంవత్సరంపైగా గడిపిన మోషెదయాన్ అక్టోబర్ 1981లో హఠాత్తుగా గుండెపోటుతో మరణించాడు.ఇజ్రాయిలీలు సరైన వీడ్కోలు కూడా ఇవ్వలేదు ఒకనాటి వారి హీరోకి.

# ఈ శీర్షిక మీదే

ఉత్తమ ప్రశ్న - సమాధానం

ఉత్తమ ప్రశ్నకు ₹500
ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

* పి.యోబు, ముదునూరు
'ఏమిటీ?' అని ప్రశ్నించలేనివాడు?
పెనిమిటి.

* జి.శ్రీనివాసరావు, ఖమ్మం
తినడానికి కొనేది,కాని తినడానికి పనికిరానిది?
ప్లేట్.

* టి.హిరణ్యమూర్తి, హైదరాబాద్
ఫంక్షన్స్ ఎందుకు పెడతారు?
'గిఫ్ట్' బాటు కావడానికి.

* కె.ఎస్.శ్యామ్‌ప్రసాద్, విశాఖపట్నం
లోతుగా ఆలోచించేవాడు?
భూగర్భ శాస్త్రవేత్త.

* ఎన్.వి.సత్యనారాయణ, విశాఖపట్నం
తేడా...?
గెలిచినవాడికి 'గతం' ఉంటుంది... ఓడినవాడికి 'భవిష్యత్' ఉంటుంది.

* పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట
ఎటువంటివారికైనా దేవుడిమీద నమ్మకం ఏర్పడేది ఎప్పుడు?
పెళ్ళయ్యాక.

* ఎమ్.కృష్ణ, కాకినాడ
ఒంటినిండా రోమాలు వుంటే?
రోమియో.

* కె.బుచ్చిరాజు, విశాఖపట్నం
కళ్ళ డాక్టర్ కన్నా...పళ్ళ డాక్టర్‌కే రాబడి ఎక్కువ... ఎందుకని?
ఎందుకంటే...కళ్ళు రెండు...పళ్ళు- 32 కనుక.

* కె.వి.లక్ష్మణరావు, మానేపల్లి
మన నుదిటిరాతను మనమెందుకు చదవలేము?
'కళ్ళు'నుదిటి'కింద' ఉన్నందువల్ల.

* సిహెచ్.నాగేశ్వరరావు, పాములవలస
రోడ్డు సైడ్....?
ఒకప్పుడు ఫుట్‌పాత్ ఇప్పుడు ఫుడ్ పాత్.

* ఆర్.ప్రశాంతి, విజయనగరం
ప్రభుత్వ కార్యాలయాల్లో పెండింగ్ ఉండని పని?
జీతాలు తీసుకోవడం.

## ఈ కార్టూన్ మీదే






## B హ్యాపీ

అరవయ్యో ఏట తల్లి అయి గర్వంగా పిల్లాడిని ఇంటికి తెచ్చింది. ఒకరోజు పిల్లాడిని చూద్దామని బంధువులు వచ్చారు. ఎంతసేపటికీ పిల్లాడిని చూపదు. అదేమంటే అరగంట ఆగమంటుంది.

అరగంట ఆగటం ఎందుకంటే... వాడు ఏడవాలి కదా! అంది. "ఏడవటం ఎందుకు అంటే పిల్లాడిని ఎక్కడ పెట్టింది" మరచిపోయా... ఆకలి వేసి ఏడిస్తే తెలుస్తుంది కదా... అంది ఆ తల్లి.

"మా ఆయనకు, నాకు ప్రతి విషయంలోనూ పోట్లాటేనే. పోట్లాడి పోట్లాడి ఇప్పటికి పదికిలోలు తగ్గిపోయాను" అంది లత.

"అదిసరేనే అంత పోట్లాడుతూ సంసారం ఎందుకు! హాయిగా విడిపోక" అంది శ్వేత.

"ఉండుండు. ఇంకో ఐదుకిలోలు తగ్గాలని అనుకుంటున్నా..." అంది సమాధానంగా.

"బ్యాంక్‌కి వచ్చిన కస్టమర్‌తో వాదించవద్దని చెప్పానా! కస్టమర్స్ మనకు దేవుళ్ళు... పైగా ఎప్పుడూ కస్టమర్స్‌దే సరైన అభిప్రాయం" అని క్లాస్ పీకాడు ఆ బ్యాంక్ మేనేజర్.

"సరే...ఇంతకీ పొద్దున కస్టమర్‌తో ఏ విషయంమీద వాదన మొదలైంది" అడిగాడు మేనేజర్.

"అవును సార్ కస్టమరే రైట్....అతగాడు మీ మేనేజర్ ఉత్త వెధవోయ్ అని మొదలుపెడితే అలా అనటం తప్పని వాదించా సార్"

"నా బిడ్డకు బాగోలేదు బాగుచెయ్యండి"అంటూ ఒకావిడ తన బిడ్డను ఒక బాబా దగ్గరకి తెచ్చింది. ఆయన 'సరే' అని కళ్ళు మూసుకుని ఏదో మంత్రం చదవబోతుంటే డాక్టర్ ఇచ్చిన మందులకే తగ్గని జబ్బు నీ మంత్రానికి తగ్గుతుందా రాజేష్ అంటూ ఎద్దేవా చేశాడు అక్కడే వున్న ఒక హేతువాది.

బాబా కళ్ళు తెరచి.... "నువ్వు వట్టి వెధవవి" అన్నాడు. "ఇంటర్నేషనల్ ఫిగర్‌ని నన్ను వెధవ అంటావా" అని గయ్యిన లేచాడు రాజేష్.

"చూశావా... ఒక చిన్న మాట నీలో అంత మార్పు తెచ్చినప్పుడు మంత్రంలోని పలుపదాలు ప్రభావం చూపవంటావా" అంటూ కళ్ళుమూసుకుని మంత్రం చదవడం మొదలుపెట్టాడు బాబా.

"రేపు మా అత్తగారు ఊరినుండి వస్తోంది... స్టేషన్‌కి వెళ్ళి రిసీవ్ చేసుకోవాలి... కాబట్టి సెలవు కావాలి సార్...." "నో... రేపు సెలవు కుదరదు..."

"మీరెంత మంచివారు సార్... వెంటనే మా ఆవిడకు చెప్పండి సార్ ఈ విషయం"

"అతిగా కోపం మంచిది కాదు... ముఖంలో కండరాలు అలా వంకర తిరిగి ముఖం వికారంగా తయారవుతుంది" అని టీచర్ వివరించింది.

"నిజమా మేడమ్... మీ చిన్నప్పుడు మీకీ హెచ్చరిక ఎవరూ చెయ్యలేదులా వుంది" అని అన్నారు క్లాస్‌లోని పిల్లలందరూ ఒక్కసారిగా.

విజయం సాధించాలంటే ఎంతో శ్రమ, అచంచలమైన సంకల్పం ఉండాలి.